ACC NO 20472

# ముందు మాట

రాష్ట్రంలోని వివిధ విద్యాలయాలలో ప్రభుత్వ పాలనా శాస్త్రాన్ని **Regular** గాను మరియు **External** గాను అధ్యయనం చేసే విద్యార్థుల సంఖ్య ఎక్కువగా ఉన్నది. అయితే ఈ **Subjects** కు సంబంధించిన పాఠ్యాంశాలు అన్నీ ఒకే పుస్తకంలో లభ్యం కాకపోవడం వల్ల వివిధ పుస్తకాలనుండి విద్యార్థులు తమ విలువైన కాలాన్ని వెచ్చించి పాఠ్యాంశాలు సేకరించవలసి వస్తున్నది విద్యార్థుల యొక్క ఈ సమస్యను దృష్టిలో ఉంచుకొని **M.A. Political Science Syllabus** ను మరియు సివిల్‌సర్వీస్, గ్రూప్ **I** కు ఇతర పోటీ పరీక్షలకు హాజరయ్యే వారి అవసరానికి అనుగుణంగా ఈ భారత దేశ విదేశాంగ విధానం ఇతర దేశాలతో సంబంధాలు (**Indian Foreign policy- Ist Relations with other Countries**) ఈ పుస్తకాన్ని తొలిసారిగా రూపొందించడం జరిగింది. ఈ పుస్తకాన్ని రూపొందించే సమయంలో విద్యార్థులను మరియు పాఠ్యాంశాలను దృష్టిలో ఉంచుకొని సులభశైలిలో అధిక సమాచారం విద్యార్థులకు తెలియ పరచడానికి ప్రత్యేక శ్రద్ధవహించడం జరిగింది. ఈ పుస్తకం రాజనీతి శాస్త్రంలో భాగమైన విదేశాంగ విధానం చేసే అధ్యయనం చేసే విద్యార్థులు సులభంగా అర్థం చేసుకొని పరీక్షలలో ఉత్తీర్ణతచెందుటకు సహకరిస్తుందని ఆశిస్తున్నాము.

ఇట్లు

**ప్రకాశకులు.**

# వి ష య సూ చి క

# 1. భారతదేశ విదేశాంగ విధానం – నిర్ణయక అంశాలు

## 1. చారిత్రక స్థితి-సంప్రదాయాలు-సంస్కృతి

భారతదేశం చరిత్ర పరిశీలించి నట్లయితే చాల శాంతి కాముకదేశం. భారత దేశం అన్ని సాంప్రదాయాలకు నిలయమే కాకుండ ప్రపంచంలో అన్ని చరిత్ర సంస్కృతల కంటే అతిపురాతనమైనది. గ్రీకు, ఈజిప్టు, చైనీసు, హిందూ నాగరికతలు సుప్రస్థితి చెందినవి. పురాతన కాలం నుండి భారత దేశానికి మెసపుటేమియా, ఇరానీ, తురానీ దేశాలతోను తూర్పు తీరంన చైనీయులు, మంగోలియా, జంభూ ద్వీపాలతో సత్సంబంధాలనే కాక వాణిజ్య వ్యాపార సంబంధాలను కలిగి ఉండెడిది. మధ్యకాలంలో అంటే క్రీ॥ శ॥ 720 మహమ్మద్ బీన్ ఖాసిం ఇండియాకు రావడం, కొన్ని ప్రాంతాలను ఆక్రమించుకొని పరిపాలన కొనసాగించడంతో ముస్లిం ప్రపంచంతో ఇండియా సంబంధాలు స్థిరపడినాయి. అప్పటి నుండి మొగలు కాలం వరకు ముస్లింలు భారత ఖండంలో తమ పెత్తనంను కొనసాగించారు. తదానంతరం మొగలులు సుమారు మూడువందల సంవత్సరాలకు పైగా రాజ్యంను కొనసాగించి తమ సంస్కృతి, చరిత్ర, సాంప్రదాయాలను ఇండియాలో వదిలారు.

17వ శతాబ్దం వరకు ఇండియాలో ఏకీకరణ అంటే భారత ఖండం అంతా ఒకటిగా ఏర్పడలేదు. బ్రిటిషువారు భారతదేశంను జయించిన అనంతరం ఏకీకృత పరిపాలనా విధానంను మొదలు చేయడానికి ప్రయత్నించి 1774తో రెగ్యులేటింగు చట్టంతో మొదలయింది.

## 2. సాంప్రదాయక స్థితి :

అంతకుముందు సాంప్రదాయక స్థితిని గూర్చి పరిశీలించినట్లయితే అశోకుని కాలం ఆదర్శవాదం, కౌటిల్యుని రాజకీయ ఆలోచనతీరు, కౌటిల్యుని వాస్తవక సిద్ధాంతాలు మనకు యిచ్చిన చారిత్రక సంపద. అందులో రాజ్యంను సుస్థిరంగా నిలబెట్టుకోవాలంటే పక్కరాజ్యంతో ఏవిధంగా ఉండాలి.ఎలామెలగవలెననేది ఎంతో గొప్పగా వివరించాడు. అదే విధంగా అశోకుని అహింసా సిద్ధాంతం మన

విదేశాంగ విధానంను ప్రభావితం చేస్తాయి. బ్రిటిష్ పరిపాలన నుండి మహాత్మా గాంధీ అనుసరించిన అహింసా సిద్ధాంతం భారతాని విముక్తిని కలిగించి స్వతంత్ర దేశం అయింది. మహాత్మా చెప్పినట్లు రాజకీయాలు అంటే అధికారంను ఏ విధంగా దక్కించుకొని కొనసాగించడానికి చేసే ఒక కళని అభివర్ణించారు. అట్లా కాకుండా మహాత్మా సాంఘిక విలువల మార్పులు, కొనసాగింపు స్థిరత్వం కలుగజేయాలంటారు. ఇండియా జాతీయకాంగ్రెస్‌ను నడిపినతీరు రెండవ ప్రపంచ యుద్ధంలో సామ్రాజ్యవాద శక్తులకు వ్యతిరేకంగాను ప్రజాస్వామ్య శక్తులకు కాంగ్రెస్, మహాత్మాగాంధీ మద్దత్తు నివ్వడం చెప్పకొనదగినది.

మన ఆదర్శాత్ములు రాజారామమోహన్‌రాయ్, స్వామి వివేకానంద, మన సంస్కృతిని పునర్జీవింప చేసిన విధానం. మహాత్మగాంధీ, శ్రీ అరబిందో, రవీంద్ర నాథ్ టాగూర్‌ల ఆదర్శవాదం మన జాతీయ జీవన విధానంను ప్రభావితం చేయుటయే కాక మన అంతర్జాతీయ విధానంను కూడ ప్రభావితం చేసింది. గాంధీ అంతర్జాతీయ సంబంధాలను అహింసా సిద్ధాంతం ద్వారా మార్చాలని పిలుపునిచ్చారు (దీన్ని గూర్చి ప్రత్యేకంగా చర్చించాం చూడండి.) మన ఆదర్శవాదంను జవహర్ లాల్ నెహ్రూ తన **Discovery of India** అనే గ్రంథంలో వివరించారు. అదే విధంగా జయప్రకాష్ నారాయణ్ మొదలయినవారు చూపిన మార్గాన భారతదేశ విదేశాంగ విధానంను నిర్ణయించిన అంశాలను ఎన్నుకొనడం జరిగింది.

## 3. సామ్రాజ్యవాద-జాతివివక్షణ వ్యతిరేకత :

భారతదేశ విదేశాంగ విధానంలో సామ్రాజ్యవాద వ్యతిరేకత ఇండియా స్వానుభావం. బ్రిటీషు సామ్రాజ్యవాదంతో ఎట్లా పోరాడింది తెలుస్తుంది. అంతే గాక ఇండియా సంప్రదాయాలలో ఏ విధంగా భారతానికి వచ్చి ఇక్కడనే కలిసి పోయింది కూడా మనకు తెలుపుతుంది.

బ్రిటిషు వారు ఇండియాను రెండువందల సంవత్సరాలు పాడి ఆవుగా సంపద నంత పితుక్కుపోయారు. కాంగ్రెస్ యొక్క ఆదర్శంలోనే ఈ సామ్రాజ్యవాద వ్యతిరేకత చోటుచేసుకుంది. ఇండియా స్వాతంత్రోద్యంలో స్వదేశీ ఉద్యమం, సహాయ నిరాకరణోద్యమం, క్విట్ ఇండియా ఉద్యమాల ద్వారా సామ్రాజ్యవాదాన్ని పారద్రోలడం జరిగింది. మొదటిగా ఇండియా సామ్రాజ్యవాద వ్యతిరేకత బ్రిటిషు వ్యతిరేకతతో మొదలయిందేకాని అంతర్జాతీయంగా ప్రభావం పడిందైతే కాదు.

1940 లలోనే సైనిక బడ్జెట్‌ను, బ్రిటిషువారి విధానాన్ని వ్యతిరేకించింది. రెండవ ప్రపంచ యుద్ధంలో సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులతో చేతులు కలిపింది ఇండియా.

మహాత్మాగాంధీ తన దక్షిణ ఆఫ్రికా అనుభవంతో జాతివిచక్షణ విధానం వ్యతిరేకించారు. నెహ్రూ **Discovery of India** లో బ్రిటిషు జాతి ఏర్పాటు వాదన్ని, విభజించి పాలించు పద్ధతిని వ్యతిరేకించారు. 1927 సోవియట్ సందర్శించగా జాతి వివక్షతలేని విధానానికి ప్రభావితుడైనాడు. 1946లో నెహ్రూ తాత్కాలిక ప్రధాని అయినపుడు మనదేశ విదేశాంగ విధానంలో సామ్రాజ్యవాద వ్యతిరేకత, జాతి వివక్షత తొలగింపు పోరాటంచేస్తుంటుందన్నారు. అది 1947లో స్వాతంత్ర్యనంతరం మనదేశ విదేశాంగ విధానంలో బాగమైంది.

## 4. ఆసియావాదం :

సామ్రాజ్యవాద-జాతివిచక్షణ వ్యతిరేకతల నుండే ఆసియావాదం ఆవిర్భవించింది. ఎందుకంటే మొత్తం ఆసియా అంతాకూడ సామ్రాజ్యవాదంలో మ్రగ్గుచుండెడిది. ఇండియా, జపాన్, పునర్జీవనంను పరిశీలించినట్లయితే వారు ఎంతో గౌరవ ప్రతిష్టలతో కొనసాగిందంటారు. రష్యా విప్లవం 1915, చైనా విప్లవం 1911 ఇండియా స్వాతంత్ర్యోద్యమంను, ప్రభావితం చేశాయి. మొదటి ప్రపంచ యుద్ధానంతరం 'ఆసియాటిక్ ఫెడరేషన్' ఏర్పాటు చేసారు. 1930లో పాన్-ఆసియాటిక్ ఫెడరేషన్ మొదటి మీటింగు ఏర్పాటుచేసి ఆసియాకు మంచి స్థితికలగాలని నెహ్రూ కోరారు. 1942లో జాతీయకాంగ్రెస్ మొత్తం ఆసియా దేశాలకు విముక్తి కాగలదని, ఆసియా నుండి విదేశీయులను పారద్రోలాలని కోరింది. 1947లో ఆసియా సంబంధాల సమావేశంను ఢిల్లీలో ఏర్పాటు చేసింది. ప్రపంచ శాంతి నెలకొల్పాలంటే ఆసియాలోని దేశాలు సహకరించుకొని పనిచేయాలని పిలుపునిచ్చాయి. అదే విధానం అవలంభించిన నెహ్రూ భారతదేశాన్ని ఆసియాలో పేరెన్నికగన్నదిగా చేసాడు. అప్పుడే నెహ్రూను **light of the Asia** గా కూడా పొగడడం జరిగింది.

## 5. ప్రపంచ శాంతి స్థాపన :

ఇండియా మొదటి నుండి 'వసుధైక ప్రపంచం'ను స్థాపించాలని కోరడం

జరిగింది. అందులో భాగంగానే మనరాజ్యాంగం రచించినపుడు ఆదేశ సూత్ర లలో ప్రపంచ శాంతి కొరకు కృషి చేయాలని చేర్చడం జరిగింది. అగ్రరాజ్యాల మధ్య పోటీ ప్రపంచ శాంతికి భంగం కలిగిస్తుందని, అదే విధంగా వీరి మధ్యపోటీ ఆయుధీకరణకు దారితీసి ప్రపంచంలో అశాంతిని నెలకొల్పుతుందన్నది ఇండియా శాంతిని ఏర్పరచుట వలనే అభివృద్ధికి మార్గం ఏర్పడుతుందని, అవకాశం కలుగు తుందని ఆదర్శంలో నమ్మకం. ప్రపంచ యుద్ధం వలన మానవాభివృద్ధికి నష్టం వాటిల్లుతుందని, యుద్ధోన్మాదానికి దారితీసే ఏ చర్యనైన భారతదేశం వ్యతిరేకిస్తుంది. సూయజ్ కాలువ వివాదం వలన చుట్టుప్రక్కల దేశాల ఆర్థిక వ్యవస్థల మీద ఆ ప్రభావం పడింది. అదే విధంగా 1990లో గల్ఫ్‌యుద్ధం మధ్య, దక్షిణ ఆసియా దేశాలలో విపరీతమైన వత్తిడిని ఎదుర్కొనవలసి వచ్చింది. అదేవిధంగా ఏ ప్రాంతంలో యుద్ధం కొనసాగినా నష్టం కలుగేది చిన్నదేశాలకే ఏనుగు-ఏనుగు కొట్లాడుకుంటే నష్టపోయేది గడ్డియే గదా! అందువలన అగ్రరాజ్యాలు, ఉన్నత ధనికదేశాల విధానాలవలన చిన్నదేశాలకు ఎక్కువ నష్టం వాటిల్లుతుంది. అందువలన భారతదేశం శాంతిని నెలకొల్పి అంతర్జాతీయ సంస్థ ఐక్యరాజ్య సమితికి మద్దత్తు నివ్వడం, ప్రపంచదేశాల మధ్య శాంతి స్థాపనకు కృషిచేయాలని ఆయా దేశాల మధ్య వివాదాలను పరిష్కరించడానికి ఇండియా మద్దత్తునిస్తుంది. ఈ విధంగా ప్రపంచశాంతికి ముఖ్యంగా నిరాయుధీకరణ, ఆయుధాల తగ్గింపుకు ఇండియా కృషి చేస్తుంది.

## 6. పంచశీల :

వివిధ దేశాలమధ్య తగాధాలను పరిష్కారంకు, యుద్ధం రాకుండా చేయ డానికి ప్రయత్నం చేయడంవలన ప్రపంచశాంతిని నెలకొల్పవచ్చును. ప్రపంచ దేశాలమధ్య ఉద్రిక్తతల ముందు పసిగట్టి వాటిని పరిష్కరించడం ద్వారా శాంతిని ఏర్పరచవచ్చును. ఇండియా, చైనాల మధ్య 1954లో జరిగిన ఒప్పందంలో రెండూ దేశాలమధ్య శాంతిని నెలకొల్పడానికి ఐదుసూత్రాలను అంగీకరించాయి. అవి

1) ఒకదేశం, మరొకదేశం యొక్క ప్రాదేశిక సమగ్రతను, ఐక్యతను, సార్వభౌమత్వాన్ని పరస్పరం గౌరవించుకోవడం.

2) పరస్పర దురాక్రమణ జరుపకుండుట

3) ఒకదేశం యొక్క అంతర్గత విషయాలలో జోక్యం చేసుకొనకుండుట

4) సమానత్వం, పరస్పర ప్రయోజనాలను కాపాడుకోవడం

5) శాంతియుత సహజీవనం

ఈ అయిదు సూత్రాలను ఆధారంగా ఏ దేశమైన తమ మధ్య సంబంధాలను ఏర్పరుచుకొనవచ్చును. ఈ పంచశీల నెహ్రూ వేలంలో చాల ప్రచారం పొందిన భావన రాను రాను మారిన ప్రపంచ రాజ్యాల స్థితిగతుల మూలంగా ఇది మూల పడింది. అయినా అంతర్జాతీయ సమావేశాలలో దీని ప్రాధాన్యత ఇంకా ఉంది.

## 7. అలీనవిధానం :

ఇండియా స్వాతంత్ర్యం పొందే సమయానికి ప్రపంచం రెండు వర్గాలుగా పశ్చిమ ప్రజాస్వామ్య దేశాలు, కమ్యూనిస్టు దేశాలుగా ఉంది. అట్లా ఇండియా ఈ రెండు వర్గాలలో చేరకుండా, ప్రచ్ఛన్న యుద్ధంకు దూరంగా ఉండాలని నిశ్చయించుకొని ఏ వర్గంలో చేరకుండ, అనుసరించకుండ అలీన విధానంను అవలంబించింది. (దీన్ని గూర్చి ప్రత్యేకంగా చర్చించడం జరిగింది చూడండి.)

ఆ విధంగా భారతదేశ విదేశాంగ విధాన నిర్ణయంలో ఈ అంశాలే కాకుండా అంతర్గత సమస్యలు కూడ ఆయా దేశాల ఆదేశాంగ విధానంను ఏర్పాటుచేటప్పుడు తోడ్పడుతుంటాయి.

....o....

# 2. భారత విదేశాంగ విధాన నిర్ణయంలో అంతర్గత పరిస్థితుల ప్రభావం

1. ఇండియా విదేశాంగ విధానంను నిర్ణయించేటపుడు ఎన్నో అంతర్గత పరిస్థితులు చాలవరకు ప్రభావం చేస్తాయి. అంతేకాక ఇండియా ఆర్థిక వ్యవస్థ, శిష్ట పాలకులు మొదలైన వారి దృక్పథంలు ఎక్కువగా ప్రభావం చూపుతాయి.

**విదేశాంగ విధానం-జాతీయ ప్రయోజనాలు :**

ఏ దేశ విదేశాంగ విధానమైన ఆ జాతీయ ప్రయోజనాలమీద ఆధారపడి ఉంటుంది. ఆధునిక రాజ్యాలన్నియు చాల తేజోవంతంగాను తమ ప్రయోజనాలను బేరీజువేసుకొని తమ విదేశీ సంబంధాలను నిర్ణయించడం జరుగుతుంది. వారి యొక్క ప్రయోజనాలు తీరకపోయిట్లయితే ప్రయోజనం యేమిటని ప్రశ్నించు చున్నారు.

ఈ జాతీయ ప్రయోజనం అనేది మన జాతీయ రాజకీయ జీవన స్థితిపై ఆధారపడి వుంటుంది. మనదేశ పార్లమెంటరీ వ్యవస్థపై ఆధారపడి ఉంటుంది. అదే విధంగా మనదేశాన్ని ఏ శిష్టవర్గాలు పాలిస్తున్నాయి అంటే నెహ్రూ, గాంధీ కుటుంబాలే కాక, వేరే ఏ శిష్టవర్గాలు పరిపాలన చేస్తే ఎట్లా ఉంటుంది అనేది ముఖ్యం. నెహ్రూ కాలం మనదేశ ప్రయోజనాల దృష్ట్యా నెహ్రూ వ్యక్తిగత ఆదర్శాల దృష్ట్యా మన విదేశాంగ విధానం రష్యావేపు మొగ్గుచూపిందంటున్నారు. ఆ తరువాత వచ్చిన నాయకులుకూడ అదే తీరును కొనసాగించారు. కాని నేడు మారిన స్థితిగతులదృష్ట్యా మన విదేశాంగ విధానం మన దేశ ప్రయోజనాలను కాపాడ గలిగేదై ఉండాలి. అప్పుడే అది ఫలవంతమైన విధంగా నడుస్తుంది.

ముఖ్యంగా జాతీయ ప్రయోజనంవలన ఆ దేశానికి ఒక ప్రత్యేక గుర్తింపును కలిగిస్తాయి. హిట్లర్‌కు జాతీ విచ్చక్షణతోకూడిన సామ్రాజ్యవాదంచేత, అమెరికాకు ఆర్థిక సామ్రాజ్యవాదం ద్వారా రష్యా కమ్యూనిస్టు సిద్ధాంతంద్వారా, అదే విధంగా ఇండియాకుకూడా అలీన విధానం అవలంబించుటవలన ఒక ప్రత్యేక గుర్తింపు లభించింది.

**రక్షణ :**

జాతీయ ప్రయోజనంలో అంతర్గత-బహిర్గత రక్షణకు ఉపయోగపడాలి. ముఖ్యంగా రక్షణ తన సార్వభౌమాధికారం రక్షించుకొనుట, సరిహద్దులపరిరక్షణ విదేశీ దండయాత్రలు, వారు చొరబడకుండా చూడడం మొదలగు అంశాలు ఇందులో యిమిడి ఉంటాయి. ప్రాదేశిక సమగ్రతను కాపాడుకొంటూ సార్వభౌమాధికార పరిరక్షణ ఉండాలి. శాంతియుతంగాను, ఉద్రిక్తతలు లేకుండుటవలన స్థిరత్వం ఏర్పడి, అభివృద్ధి సాధించుటకు ఆస్కారం కలుగుతుంది. ప్రాదేశ రక్షణ కొరకు కొన్నిదేశాలు కలిసి రక్షణ సంబంధమైన ఒప్పందాలను ఏర్పరచుకొంటాయి. ఉదా : NATO, WARSAW ఒప్పందదేశాలు.

**జాతీయాభివృద్ధి :**

జాతీయ ప్రయోజనంలో యిమిడివున్న మూడు అంశాలు రక్షణ, అభివృద్ధి, ప్రపంచ సక్రమస్థితి. జాతీయాభివృద్ధి ఏ విధంగా విదేశాంగ విధాన నిర్ణయంలో ప్రభావం చూపిస్తుంది అంటే అభివృద్ధి చెందిన దేశాలు అమెరికా, ఫ్రాన్సు, బ్రిటన్ దేశాల విదేశాంగ విధానం వాటి జాతీయ ప్రయోజనాన్ని బట్టి ఆధారపడి వుంటుంది. వారియొక్క ఉద్దేశ్యం విదేశీ పెట్టుబడులద్వారా ఏ విధంగా లాభార్జన చేయవలయు ననేది ముఖ్య ధ్యేయంగా ఉంటుంది. అదేవిధంగా అభివృద్ధి చెందుతున్న దేశాల దృక్పథం మరో విధంగా ఉంటుంది. జాతీయాభివృద్ధి స్వయంసమృద్ధిగా లేకపోవుట మీద తన విదేశాంగ విధానంలో మరొకరిని వ్యతిరేకించకుండా తన ప్రయోజనాలకు భంగం కలుగకుండ వారి విధానం ఉన్ననాడు వారు ఎక్కువగా విదేశీ సహాయమును, వడ్డీ, పన్నుల రాయితీలను పొందుటకు అవకాశం ఉంటుంది. అదే విధంగా తమదేశానికి కావలసిన రక్షణ సౌకర్యాలను, సాంకేతిక పరిజ్ఞానం, ఎగుమతులు పెంచుకోవడానికి ఎక్కువ ఆస్కారం కలుగుతుంది.

అదేవిధంగా ప్రపంచ సక్రమస్థితి (World order) ని గూర్చి ఆలోచించాలి. సాంకేతికయుగంలో ఎన్నో మారణాయుధాలను కలిగి ఉన్నాయి కనుక ప్రపంచంలో ఎప్పుడో చిన్నాభిన్నం జరుగడానికి అవకాశం పొంచి ఉంది. అట్లా పాడుకాకుండా చూడడానికి నేటి నిరాయుధీకరణ అణుయింధన పరికరాలను నిషేధించడం ప్రపంచవ్యాపంగా పెరుగుతున్న జనాభాను అరికట్టడం, ఇంధనకొరతను

ఎదుర్కొని మానవ మనుగడకు ఉపయోగపడే పునరావృతిమై ఇంధన వనరులను పునరుద్ధరించడం, పర్యావరణ పరిరక్షణ మొదలైన అంశాలను ఆయాదేశాల విదేశాంగ విధానంలో చోటుచేసుకొని వాటిని అమలుచేయుటకు ఆయాదేశాలు కలిసి కట్టుగా కృషిచేయాల్సింది.

అంతర్గత అంశాలలో అవే కాకుండ ఆ దేశ రక్షణావసరాలు, దౌత్యం, కమ్యూనికేషన్లు కూడా ప్రభావం చూపుతాయి. దౌత్య పద్ధతులలో ఆరితేరిన దేశం అయితే తన లౌక్యంతో అన్ని దేశాలలో పలుకుబడిని సంపాదించుకొనుటకు ఉపయోగపడుతుంది.

అదేవిధంగా కమ్యూనికేషన్ల అభివృద్ధి ఆయాదేశాల విదేశాంగ విధానంను మరింత ప్రభావం చేస్తుంది. ప్రపంచం నలుమూలలనుండి మనదేశానికి సెటిలైట్, రాడార్, కంప్యూటర్ ద్వారా సమాచార సేకరణను చేయుటవలన దానిని విశ్లేషించి తగిన విధంగా ఆయా అంశాలపై విధాన నిర్ణయాలను తీసుకొనుటకు ఎక్కువ అవకాశం ఉంది. అంతేగాకుండా 'హాట్‌లైన్' సౌకర్యాలు ఉండడం వలన ఆయాదేశాల నేతలు పరస్పరం మాట్లాడుకొని, వెంటనే తమ నిర్ణయాలను గైకొనుటకు ఎక్కువగా వుంటుంది. మనదేశానికి పాకిస్థాన్‌ల మధ్య Hotline ఉండుటవలన సమస్యల పరిష్కారం సులభమైంది.

ఇట్లా అనేక అంతర్గత అంశాలపైన మన విదేశాంగ నిర్ణయాలు ఆధారపడతాయి. అవి భౌగోళిక పరిస్థితులు ఆ దేశం ఏ ఏ ప్రదేశాల మధ్య ఉంది. చిన్న, పెద్ద దేశమా, పరిహద్దులు, మొదలైన భౌగోళిక అంశాలు అందరికి తెలిసినవే కనుక ఇక్కడ చర్చించలేదు. భారతదేశం జనాభాలో రెండవది. భౌగోళిక ఏడవది, హిమాలయపర్వతాలు, అరేబియా సముద్రం, హిందూమహాసముద్రం, బంగాళాఖాతం ఇవి అన్నియు మనదేశ విదేశాంగ విధానంమీద ప్రభావం చూపుతున్నాయి.

# 3. భారతదేశ విదేశాంగ విధానం - నిర్ణయక తీరు

భారతదేశ విదేశాంగ విధానం నిర్ణయం రెండు విధాలుగా జరుగుతుంది. ఒకటి రాజకీయ కార్య నిర్వాహక వర్గం ప్రజాభిప్రాయం, పార్టీలు, ప్రధాన మంత్రి, కేబినెట్, విదేశాంగశాఖా మంత్రి, పార్లమెంటులలో జరిగితే, రెండోవైపు ఉద్యోగ స్వామ్యం కేబినెట్ కార్యదర్శి, విదేశాంగశాఖ కార్యదర్శి, ఆ మంత్రిత్వ శాఖలు విధాయక నిర్ణయం పనిచేస్తాయి. అంతేగాక ఇతర మంత్రిత్వ శాఖలు కూడా విధాయక నిర్ణయంలో పాల్గొంటాయి.

అవి ఆర్థికశాఖ, ఎగుమతులు- దిగుమతులు, వాణిజ్య శాఖలు.

ప్రజాభిప్రాయం :

ముందుగా రాజకీయ కార్య నిర్వాహక వర్గం ఏవిధంగా విధాన నిర్ణయం చేయుట జరుగుతుందో చూద్దాం. అందులో ప్రజాభిప్రాయంకు ఎక్కువ ప్రాధాన్యత వహిస్తుంది. భారతదేశ ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రజాభిప్రాయానికి ఎక్కువగా విలువనివ్వడం జరుగుతుంది. కాని మన విదేశాంగ విధానంలో ఏమేమి జరుగుతుందో ప్రత్యక్షంగా ప్రజలకు తెలియకపోయిన ఏ విధంగా ఇతర దేశాలు మన దేశాలను ఎట్లా చూస్తున్నది విదేశీ సహాయం, నిధులు, మత సంబంధాలు, ఎవరు ఇండియాను సందర్శించుచున్నారు అనేది పత్రికలు, రేడియో, టెలివిజన్ ద్వారా తెలుసుకొని దానిపై ప్రజలు తమ అభిప్రాయాలను వ్యక్తంచేయడం జరుగుతుంది.

అంతేగాక మనమంత్రులు, ప్రజా ప్రతినిధులు, పార్లమెంటు సభ్యులు, శాసనసభ్యులు తమ ప్రసంగాలలో అప్పుడప్పుడు విదేశాలను గురించి పేర్కొనడం జరుగుతుంది.

పత్రికలలో ప్రచురించుచున్న పార్లమెంటు ప్రచారం, రేడియో, టెలివిజన్‌లో సభ్యులు ఏ విధంగా మాట్లాడుతున్నారో ప్రజలు ఎక్కువగా నేడు తెలుసుకొంటున్నారు. అదేవిధంగా సినిమా స్లైడ్స్‌లో విదేశీసందర్శకులను గూర్చిచూపించడంద్వారా

కూడా ప్రజలు తమ పరిజ్ఞానం పెంచుకొంటారు. ఉదాహరణకు కమ్యూనిస్టుపార్టీ పరిపాలన రష్యాలో ఏ విధంగా విచ్ఛిన్నం చెందింది. సామాన్య ప్రజలు కూడా కొంత ఆసక్తిని చూపడం జరిగింది. ఎందుకు అన్నాళ్ళుగా కొనసాగిన కమ్యూనిస్టులు పడిపోయారు అన్నది ప్రజలకు తెలిసింది. అంతేగాకుండ ఆయా రాజకీయ పక్షాలు, ఆయా విషయాలపై ఆసక్తి వున్న వర్గాలు ప్రజల్లో ప్రచారం చేస్తాయి. అదే విధంగా 1991లో వచ్చిన గల్ఫ్‌యుద్ధం గూర్చి ప్రజలు ఎంతో ఆసక్తి చూపారు. వీరు కొన్ని అభిప్రాయాలను కలిగిఉంటారు. వాటిని నమ్మి ప్రచారం చేస్తుంటారు. ఆయావాటికి మద్దతు నిస్తారు. అంతేగాకుండా ఆ యుద్ధం యొక్క ప్రభావం ఇండియాలో వస్తువులు దొరకుండా ముఖ్యంగా ఆయిల్, సంబంధిత నిత్యావసర వస్తువులు దొరక్కపోవడంపై వీరు తమ అభిప్రాయాలను వ్యక్తం చేస్తుంటారు. అదే నాయకులకు, విధాన నిర్ణయక కర్తలకు ప్రాతిపదికగా తీసుకొని విధానాలను తయారు చేస్తుంటారు. ఈ విషయంలో మన నాయకుడైన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ శ్రీ వి. కె. కృష్ణమీనన్‌లు ప్రజలకు అనేక సందర్భాలలో వివరించడం జరిగింది.

ప్రజలయొక్క ప్రభావం ప్రత్యక్షంగా విదేశాంగ విధానంపై పడకపోయిన పరోక్షంగా వారి ప్రభావం ఉంది. ముఖ్యంగా 1971 ఇండోపాకిస్తాన్ యుద్ధంలో కాని చైనా– ఇండియాలు సరిహద్దు సమస్యలపై గాని అనేక విధాలుగా ప్రజలు తమ అభిప్రాయాలను వ్యక్తం చేయుచు ప్రతిస్పందించడం జరుగుతుంది. భారత దేశం విద్యావంతులు తక్కువగావున్నా దృశ్యశ్రవణ యంత్రాల ద్వారా రాజకీయ సాంఘిక, ఆర్థిక ప్రచారం ప్రజలకు చేరుతుంది. దానిపై వారు ప్రతిస్పందించడం జరుగుతుంటుంది.

**రాజకీయపార్టీలు :**

ఇండియాలో పార్లమెంటరీ ప్రజాస్వామ్య ప్రభుత్వం కొనసాగుటచే రాజకీయ పార్టీలు దేశ విదేశాంగ విధానాలను ప్రభావంచేయగలుగుతాయి. ఎందుకంటే పార్టీ అధికారంలో ఉంటే మరోపార్టీ ప్రతిపక్షమౌతుంది. అప్పుడు వారు వారి దృక్పధాలను, పార్టీ నిర్ణయాలను పార్లమెంటులోను, శాసనసభలలో, బయట తమ పార్టీ ఆదర్శాలను ప్రచారం చేసుకొంటాయి. అందులో వారు అధికారంకు వస్తే ఎట్లాంటి విదేశాంగ విధానంను చేపడతాము, ఇప్పుడున్న ప్రభుత్వం ఏ విధంగా

తన అధికారంను దుర్వినియోగం చేస్తుంది వివరించుతారు. అట్లా కాంగ్రెసుపార్టీ 1925లోనే విదేశాంగశాఖను ప్రత్యేకంగా ఇతర దేశాలతో ముఖ్యంగా ఇంగ్లాండ్, కామన్‌వెల్త్‌తో ఎట్లా కొనసాగించాలనేది తన ప్రయోజనాలను కాపాడుకొనుటకు ఏ విధంగా ప్రయత్నించడం చేస్తున్నారు చూడడం జరుగుతుంది. నెహ్రూ ఆ కాంగ్రెస్‌శాఖకు ఆధిపత్యం వహించేవారు.

అట్లా కాంగ్రెస్‌పార్టీ తనకంటూ ఒక విదేశాంగవిధానం ఉండాలని అన్ని దేశాలలో శాంతియుత సంబంధాలను కలిగి ఉండాలనేది ఆకాంక్షించారు. అట్లానే స్వాతంత్ర్యంకు పూర్వం అనంతరం కూడా కాంగ్రెస్‌పార్టీ తను ఎట్లాంటి విదేశాంగ విధానం అవలంభించుచున్నదో స్పష్టంగా పేర్కొనడం జరిగింది. కాంగ్రెస్‌పార్టీ వారు పార్టీపరంగా పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీని విదేశాంగ విధానంపై వేసి వాటి తీరుతెన్నులను చూస్తుంది. జనతాపార్టీ కూడా విదేశాంగ విధానంపై ఒక స్టాండింగ్ కమిటీని ఏర్పరిచి అధికారంలో ఉన్నప్పుడు నిర్వహించింది.

అదే విధంగా కమ్యూనిస్టుపార్టీకి విదేశాంగ సెక్షన్ నిర్వహించుతుంది. ఈ కమిటీ తనకు లింకున్న విదేశ కమ్యూనిస్టు పార్టీలతో జరుపుతుంది. 1964లో కమ్యూనిస్టుపార్టీలో చీలికలు వచ్చిననంతరం నిజంగా విదేశాంగ సెక్షన్ బాగా పనిచేశాయి. కమ్యూనిస్టుపార్టీలు రష్యా, చైనా కమ్యూనిస్టులతో వ్యవహారాలు నిర్వహించడం స్నేహసంఘాలు నిర్వహించడం జరుగుతుంది. ఆ విధంగా ప్రతిపార్టీకి తనకు కావలసిన విదేశాంగ విధానంను ఏర్పాటుకు ప్రత్యేక సెక్షన్‌పని చేస్తుంటుంది.

## ప్రభావ వర్గాలు:

ప్రయోజక వర్గాలు విదేశాంగ విధాన నిర్ణయంలో అత్యంత ప్రముఖపాత్ర వహిస్తుంటాయి. ప్రయోజక వర్గాలలో మరికొన్ని గ్రూపులున్నాయి అవి.

## 1. వ్యాపారవర్గాలు:

ఇండియా విదేశాంగ విధానం నిర్ణయంలో వ్యాపార వర్గాలు ప్రముఖపాత్ర నిర్వహించుతాయి. ఉదా. ఇండియన్ ఛాంబర్ఆఫ్ కామర్స్& ఇండస్ట్రీ,వ్యాపారులు, వాణిజ్యవేత్తల గ్రూపులు ప్రభుత్వ విధానాన్ని, ప్రభావం చేస్తాయి. తమ ప్రయోజనాలు కాపాడుకొనుటకు ప్రయత్నం చేస్తుంటాయి. ముఖ్యంగా పశ్చిమ దేశాలతో

వ్యాపార వాణిజ్య సూత్రాలను ఏర్పరిచేటప్పుడు ఇవి బాగా పనిచేస్తాయి. అదే విధానం దిగుమతి- ఎగుమతులలో ఈ ప్రభావ వర్గాలు బాగా తమ ప్రయోజనంకు కృషి చేస్తుంటాయి.

## 2. సైనిక శక్తులు :

ఆఫ్రో— ఆసియాదేశాలలో ఈ సైనిక ప్రభావవర్గాలు బాగా పనిచేస్తున్నాయి. ఇవి రక్షణమంత్రిత్వ శాఖలో ఎట్లాంటి నిర్ణయాలు తీసుకొంటాయి. విదేశాలనుండి ఆయుధాలు దిగుమతులు సాంకేతిక పరిజ్ఞానం పొందుటలో వీరి ప్రయోజనార్థం కృషి చేస్తుంటాయి.

## 3. ఉద్యోగ స్వామ్యం :

భారతదేశ ఉద్యోగస్వామ్యంలో స్పష్టంగా గ్రూపులున్నట్లు కనిపిస్తాయి. అవి ముఖ్యంగా రష్యా గ్రూపు, అమెరికా గ్రూపు అని ఉద్యోగ స్వామ్యంలో ఉన్నాయి. ఇవి ఢిల్లీ విదేశాంగశాఖ ఆఫీసు అయిన దక్షిణ బ్లాక్‌లో బాగా పని చేస్తున్నాయి. ముఖ్యంగా ఉద్యోగ స్వామ్యంలో తమ ప్రయోనార్థం, వారియొక్క విద్యాభ్యాసంద్వారానో ఆయా దేశాలవైపు మొగ్గు చూపడం జరుగుతుంది. శ్రీమతి ఇందిరాగాంధి ప్రధాని అయినాక ఉద్యోగస్వామ్యం ఆ వర్గం ఈ వర్గంయొక్క ప్రాధాన్యత పెరిగింది. అంతేకాక ప్రో సోవియట్ విదేశాంగ విధానంను చేపట్టడం జరిగిందనే ప్రతీతి గలదు.

అంతేగాక విదేశాంగ శాఖ మంత్రిత్వశాఖ ఉద్యోగుల సంఘాలుకూడ ప్రభావం కలిగి ఉంటాయి.

## 4. కార్మిక సంఘాలు :

ఇండియాలో జాతీయ స్థాయిలోనున్న కార్మిక సంఘాలు తమదేశం అనుసరించు విదేశాంగశాఖ నిర్ణయాలను ప్రభావితం చేస్తుంటాయి. 1971లో ఆల్ ఇండియా డాక్‌వర్కర్స్ యూనియన్ పాకిస్తాన్ కార్గో షిప్‌లకు సేవలనందించడానికి నిరాకరించాయి. పౌర విమాన పైలట్ల సంఘం విదేశాలకు విమానాలను నడపడానికి విముఖతను వ్యక్తం చేయడంతో అనేక విధాలుగా చర్చలనంతరం అంగీకారం కుదిరింది.

INTUC, AITUC, CITU మొదలైన కార్మిక సంఘాలు విదేశాంగ విధానం తమ ప్రభావం చూపిస్తాయి.

## 5. విదేశాంగ లాభాలు :

ఇంత పెద్ద దేశమైన ఇండియాలో ఎన్నో విదేశ స్నేహ సంఘాలు ముఖ్యంగా ఇండో, అమెరికన్ ఫ్రండ్షిప్ సంఘం, ఇండో-సోవియట్ స్నేహ సంఘం, మొదలైనవన్ని తమ అభిప్రాయాల తీరులో నిర్ణయం జరగాలని ప్రభుత్వంపై వత్తిడి తెస్తుంటాయి. 1977కి భారతదేశంలో 112 స్నేహ సంఘాలున్నాయని గుర్తించారు.

అఖిలభారత శాంతిమండలి ఇండియా విదేశాంగ విధానంను ప్రభావితం చేస్తుంటుంది. ఈ సంఘాలన్నియుకూడా వాటి దృక్పథంతో ప్రయోజనంను ఆశించి పనిచేస్తుంటాయి.

## పార్లమెంటు :

పార్లమెంటు భారతదేశంలో అత్యున్నత విధాననిర్ణయక సంస్థ.పార్లమెంటు విదేశాంగ విధాన నిర్ణయాలు ప్రభావితం చేస్తుంది. పార్లమెంటులో వివిధ అంశాలను గూర్చి చర్చించునపుడు ప్రభుత్వం అవలంబించుచున్న విధానంను అడిగి ఆయా నిర్ణయాలను తీసుకుంటే బాగుంటుందని సూచనలు చేయడం జరుగుతుంది. చర్చలు, ప్రశ్నలు, వ్రాత సమాధానాలు యివ్వడం, ప్రకటనలు చేయడం మొదలైన వాటిద్వారా ప్రభుత్వం నిర్ణయాలను నియంత్రణ చేయుటేకాక ప్రభావితం చేస్తాయి.

భారతరాజ్యాంగంలోని 246 ప్రకరణద్వారా పార్లమెంటు విదేశాంగ విధానంలోని అన్ని అంశాలపై శాసనాలను చేస్తుంది. ఇందులో ఒప్పందాలను కుదుర్చుకోవడం, దౌత్య వ్యవహారాలు, కన్సలేటన్సు పంపడం, వ్యాపార ప్రతినిధులను నియమించడం, ఐక్యరాజ్యసమితి సమావేశాలు, అంతర్జాతీయ ఒప్పందాలు మొదలైనవన్ని పార్లమెంటు అధికారపరిధిలోకే వస్తాయి.

పార్లమెంటు విదేశాంగశాఖ బడ్జెటును నియంత్రించుతుంది. అనధికారిక చర్చనీయాంశాలను ప్రవేశపెట్టి చర్చించడం, తీర్మానాలు, వాయిదా, కోతతీర్మానాల

ద్వారాను, ప్రశ్నలు, అనుబంధపు ప్రశ్నలుద్వారా విదేశాంగశాఖ అంశాలను పార్లమెంటు నియంత్రించి నిర్ణయాలును గైకొనడం జరుగుతుంది.

అంతేగాక పార్లమెంటు సంప్రదింపుల సంఘంద్వారా ఆయా మంత్రిత్వ శాఖలను పార్లమెంటు నియంత్రణ చేస్తుంటుంది. విదేశాంగశాఖ సంప్రదింపులు సంఘం, విదేశాంగశాఖ కమిటీలు ఉంటాయి. వీటిలో ఉభయసభల సభ్యులు విదేశాంగ విధానంలోని నిర్ణయాలు ఇట్లా ఉండాలని, ఈ పద్ధతిపై నిర్మించాలని సూచనలు చేయడం జరుగుతుంది

ఈ విదేశాంగశాఖ సంప్రదింపుల సంఘంలో రాజ్యసభ నుండి లోక్‌సభ నుండి సభ్యులుంటారు. 1959లో సంప్రదింపుల సంఘంను ఏర్పరచినపుడు 65 మంది సభ్యులుండేవారు. వీరు ఒక అధ్యయన సంఘంగా వివిధ సమస్యలను గూర్చి వారి ప్రయోజనంనుబట్టి అంశాలు చర్చించడం జరిగేది. 1969కి ఆ సభ్యులసంఖ్య 36కి తగ్గింది అంటే 22 మంది లోక్‌సభనుండి 9 మంది రాజ్య సభ్యులు వివిధ విదేశాంగ అంశాలనుగూర్చి ప్రస్తావిస్తూ విధాననిర్ణయక సూచనలు చేయడం జరిగెడిది.

నెహ్రూ కాలంలో ఈ సంప్రదింపుల సంఘం చాల చురుకుగా పనిచేసింది. అదేవిధంగా 1965, 1971 యుద్ధంలోకూడ సంప్రదింపుల సంఘం ఏమి చేయాలి అనేది విధానాలను సూచించేది 1971 సిమ్లా ఒప్పందంను గూర్చి ఈ సంఘం కూలంకషంగా చర్చించడం జరిగింది ఈ సంప్రదింపుల సంఘం జనతాపార్టీ హయాంలోను, రాజీవ్‌గాంధీ కాలంలో బాగా పనిచేసింది. ఇపుడు కూడ ఈ విధాన నిర్ణయాల్లలో చక్కగా సలహాలనిస్తుంది. ముఖ్యంగా మారిన అంతర్జాతీయ స్థితిలో ఈ సంఘం వివిధ అభిప్రాయాలకు అత్యంత ప్రాధాన్యతను సంతరించుకొన్నాయి నేటి మన దేశవిదేశ విధానంను జపాన్, చైనా, అమెరికా పెద్ద, అగ్ర రాజ్యాలలోను, ఇరుగుపొరుగు దేశాలతో ఏ విధంగా ఉండాలనేది బాగా చర్చించిన అనంతరం ప్రధానమంత్రి విదేశాంగమంత్రులు ఆయా నిర్ణయాలను గైకొనడం జరుగుతుంది.

**కేబినెట్ :**

ప్రభుత్వం అధినేత ప్రధానమంత్రి. ప్రధానమంత్రి సహాయపడుటకు కేబి

నెట్ ఉంటుంది. ఇది ఒక పార్లమెంటరీ ప్రభుత్వంలోనే జరుగుతుంది. కేబినెట్ నిర్ణయం గైకొనడం అనేది ప్రధానమంత్రి చేయడం జరుగుతుంది. దాన్ని కేబినెట్ చర్చించి, ఆమోదించడం జరుగుతుంది. ఏ విదేశాంగ నిర్ణయమైన ప్రధానమంత్రి అనుమతితో కేబినెట్ అనుమతిపొంది అమలుచేయడం జరుగుతుంది. నెహ్రూ కాలంనుండి కూడ ఈ కేబినెట్‌ను సంప్రదించడం విధాయక నిర్ణయాలు ప్రకటించడం చేస్తుంది. కేబినెట్‌లోనే ఒక స్టాండింగ్ కమిటీ ఉంటుంది. ఈ కమిటీసభ్యులను ప్రధానమంత్రి నామినేట్ చేయడం జరుగుతుంది. ఇందులో రక్షణమంత్రి, హోంశాఖ, ఆర్థికశాఖ, విదేశాంగశాఖ మంత్రులు పాల్గొంటారు. శ్రీ కృష్ణమీనన్ కాలంలో ఈ కేబినెట్ కమిటీ చాల పకడ్బందీగా ఏర్పాటుచేయడం జరిగింది.

అదేవిధంగా ఏ విషయాన్నైనా చర్చించి నిర్ణయం గైకొనడం జరిగేది. స్టాండింగ్ కమిటీలోకూడ ప్రధానమంత్రే అసలు విషయాలను గూర్చి చెప్పడం మిగతా మంత్రులు ఆమోదించడం జరుగుతుంది. నెహ్రూ ప్రధానమంత్రిగా నున్నప్పుడు విదేశాంగశాఖమంత్రి శ్రీ వి. కే. కృష్ణమీనన్ స్వతంత్రంగా నిర్ణయాలు గైకొనడం జరిగేది. శ్రీమతి ఇందిరాగాంధీ కాలంలో విదేశాంగశాఖ నిర్ణయాలన్నీ ప్రధానమంత్రే తీసుకొనేది. శ్రీ స్వరణ్‌సింగ్ విదేశాంగమంత్రిగా ఉన్నప్పుడు అన్నీ ఇందిరాగాంధీ చేసేది. అదే విధంగా విదేశాంగశాఖ విధులను రాజకీయ వ్యవహారాల కమిటీలోకూడ చర్చించి వివిధ కోణాలనుండి అంశాన్ని పరిశీలించి నిర్ణయం గైకొనడం చేస్తారు.

జనతాపార్టీ కాలంలో ఈ కమిటీల యొక్క ప్రాధాన్యత పెరిగింది. శ్రీ మురార్జీదేశాయ్ కాలంలో విదేశాంగశాఖ పరిధిలోని అంశాలను చర్చించి కమిటీ నిర్ణయాలను గైకొనడం జరిగింది. కేబినెట్‌కమిటీ, ప్రధానమంత్రి పూర్తిగా నిర్ణయం గైకొని మిగతా సంస్థలు అనుమతికి పంపేది. ఇప్పుడుకూడ అదే పరిస్థితి జరుగుతుంది. నేటి ప్రభుత్వం వున్నస్థితిలో విదేశాంగశాఖను ముట్టుకొని ప్రక్షాళనం చేయడంలేదు. కాని రాజకీయ కార్యవర్గం ప్రధానమంత్రి దగ్గరనుండి అనేక ప్రయోజనాలను చూచుకొనవలసుంటుంది. ప్రధానమంత్రి, కేబినెట్ తుదినిర్ణయాలను గైకొంటుంది. విదేశాంగ విధానంలో ఆచితూచి ప్రతినిర్ణయం గైకొనది కనుక ప్రధానమంత్రి సరియైన నిర్ణయాలు తీసుకొంటారు.

విదేశాంగ మంత్రి, మంత్రిత్వశాఖలను గూర్చి ఇపుడు తెలుసుకొందాం.

# 4. విదేశాంగ మంత్రిత్వ శాఖ

ప్రజాస్వామ్య పార్లమెంటరీ వ్యవస్థలో విదేశాంగ విధానం నిర్ణయంలో రాజకీయ కార్యనిర్వాహకవర్గం ఉద్యోగి సామ్యానకు ఒక మార్గం చూపుతుంది. ఆ చూపిన మార్గంను ఆ సంబంధిత మంత్రిత్వశాఖ మంత్రి ఉద్యోగి స్వామ్యం నిర్ణయాలను అమలు చేయడం జరుగుతుంది. ఉద్యోగి సామ్యం యొక్క ప్రథమ కర్తవ్యం ఏవైతే రాజకీయ కార్యనిర్వాహకవర్గం యిచ్చిన అదేశాలను తూ. చ. తప్పకుండ అమలుచేయడం జరుగుతుంది. విదేశాంగ విధానం సహజంగా చిక్కులతో కూడుకొన్నది. గనుక ఉద్యోగ సామ్యం మరింత అప్రమత్తంగా వ్యవహరించడం జరుగుతుంది. విదేశాంగ శాఖ విదేశాంగ మంత్రి ఆధీనంలో పనిచేస్తుంది. కాని ప్రధానమంత్రి, కేబినేట్ చివరికి బాధ్యత వహించవలసిన అవసరం ఉంటుంది. విదేశాంగశాఖ ప్రధానమంత్రి, కేబినేట్, విదేశాంగ మంత్రి తీసుకొన్న నిర్ణయాలను అమలు చేయడం జరుగుతుంది. ఇదీ అమలుచేయుటలో విఫలమయిన యెడల మొత్తం విధానం విఫలమయ్యే అవకాశం కలదు.

విదేశాంగ మంత్రిత్వ శాఖను మొట్టమొదటిసారిగా బ్రిటిషువారు ఏర్పరచినారు. విదేశీ వ్యవహారాల శాఖ అనే పిలిచేవారు. అప్పుడు అమెరికాలోను, చైనాలో నున్న ఏజెన్సీ జనరలు, వివిధ రాజ్యాలలోనున్న ప్రతినిధులను, వాణిజ్యాన్ని నియంత్రించుతూ ఉండేది. ఆ తరువాత కామన్వెల్తు సంబంధాల శాఖ ఏర్పాటు చేయబడింది. కాలక్రమేణా ఈ విదేశ వ్యవహారశాఖ, కామన్వెల్తు సంబంధాల శాఖలు కలిసి పనిచేశాయి. 1947 స్వతంత్ర్యం అనంతరం రెండేళ్ళు కొనసాగేక 1949లో కామన్వెల్తు సంబంధాలు శాఖను తొలగించి విదేశీ మంత్రిత్వ శాఖగా ఏర్పరచారు. అప్పటినుండి ఇది కొనసాగుతుంది.

**నిర్మాణం :**

విదేశాంగ మంత్రిత్వశాఖ నిర్మాణం గూర్చి తెలుసుకొనే ముందు నెహ్రూ ప్రధానమంత్రిగా వున్నంతకాలం ఆయనే విదేశాంగ శాఖను నిర్వహించేవారు. ఆయనక్రింద సహాయమంత్రి డిప్యూటీ మంత్రులిద్దరు పని చేశారు. ఉద్యోగి స్వామ్యంతో విదేశాంగశాఖ సెక్రటరీ జనరలు సెక్రటరీలు, జాయింట్, డిప్యూటీ

సెక్రటరీలు ఉండేవారు. లాల్‌బహదూర్ శాస్త్రి ప్రధానమంత్రి అయ్యాక సర్దార్ స్వరణ్‌సింగ్‌ను పూర్తిహోదాలో విదేశాంగశాఖ మంత్రిగా నియమించడం జరిగింది. ఆ విధంగానే నేటికి కొనసాగుతుంది.

పట్టిక—I




ఆధారం : 1990-91 విదేశాంగశాఖ వార్షిక నివేదిక నుండి. విదేశాంగశాఖ పరిపాలనాధిపతి విదిశాంగశాఖ కార్యదర్శి. ఆయన క్రింద ప్రత్యేక కార్యదర్శులుండేవారు. కాని వారిని ప్రస్తుతం కార్యదర్శి-I & కార్యదర్శి-II అని ఏర్పఱచి విభాగాలను ఏర్పరచడం జరిగింది. పరిపాలనా సౌలభ్యం కొరకు వారికి ప్రత్యేక బాధ్యతలు అప్పగించిరి. ఒక కార్యదర్శి ఆర్థిక సంబంధాలను చూడడానికి, మరొక కార్యదర్శి తూర్పు విభాగంకు సంబంధించిన పనులు. అదేవిధంగా అదనపు కార్యదర్శులు ఏర్పరచి వారికి ప్రత్యేక బాధ్యతలు నిచ్చిరి. వీరి క్రింద అనేకమంది సంయుక్త కార్యదర్శులు, డైరక్టర్లు, డిప్యూటీ సెక్రటరీలు అండర్ సెక్రటరీలు, అటాచీలు అనేవారు పనిచేస్తున్నారు.

కార్యదర్శి, అదనపు కార్యదర్శులు, సంయుక్త కార్యదర్శి ప్రత్యక్షంగా మంత్రి వద్ద నుండి ఆదేశాలు, ఆజ్ఞలు జారీ అవుతుంటాయి. ఆ ఆదేశాల అనుగుణంగా పీయ పని చేయవలసి ఉంటుంది. కార్యదర్శి నేరుగా విదేశాంగమంత్రి వద్దకు ఫైళ్ళను పంపడం జరుగుతుంది. జాయింట్ సెక్రటరీ అదనపు కార్యదర్శికి పంపకుండ నేరుగా కార్యదర్శికి పేపర్లను పంపవచ్చును. అదే రీతిలో పైకి, దిగువకు పేపర్లు, ఫైళ్ళు కదులుతుంటాయి.

ముఖ్యంగా విదేశాంగ శాఖలో అనేక విభాగాలు పనిచేస్తుంటాయి. ఇవి మూడు రకాలుగా విభజించడం జరిగింది. ఈ విభాగాలు టెరిటోరియల్, విధులను బట్టి, పాలనా సంబంధాలు నిర్వహించుచున్నారు. 1961-62 లలో కేవలం 13 విభాగాలు పనిచేశాయి. కాని విదేశాంగ విధానంలో అనేకమార్పులు చోటుచేసుకోవడంతో ఇంకా ఈ డివిజన్ల సంఖ్య 19కి పెరిగింది.

| భూభాగం విభాగం | విధులు బట్టి | పాలనా విభాగాలు |
|---|---|---|
| 1. ఆఫ్రికా విభాగం | 1. సమన్వయ విభాగం | 1. పరిపాలన విభాగం |
| 2. అమెరికా ” | 2. ఆర్థిక ” | 2. ప్రోటోకోల్ విభాగం |
| 3. బంగ్లాదేశ్ ” | 3. విదేశ ప్రచారపు విభాగం | |
| 4. తూర్పుఆసియా విభాగం | 4. చారిత్రక ” | |
| 5. యూరోపు ” | 5. శాసన, ఒప్పందాల ” | |
| 6. ఉత్తర ” | 6. పాస్‌పోర్టు, వలస సంబంధాల విభాగం | |
| 7. పాకిస్తాన్, ఇరాన్ ఆఫ్ఘనిస్తాన్ విభాగం | 7. విధాన ప్రణాళిక విభాగం | |
| 8. దక్షిణ విభాగం | 8. ఐక్యరాజ్య సమితి, సమావేశాల విభాగం | |
| 9. పశ్చిమాసియా, ఉత్తర ఆఫ్రికా విభాగం | | |

వీటికి అదనంగా ఆర్థిక మంత్రిత్వశాఖ కూడ ఉంటుంది. విదేశాంగ సర్వీసు ఇన్స్పెక్టరేట్, ఈ శాఖకు చెందిన సర్వీసు వ్యవహారాలను నియంత్రణ చేస్తుంది.

ప్రతి విభాగాని అధిపతిగా సంయుక్త కార్యదర్శి లేదా డైరెక్టరు అధిపతిగా వ్యవహరించడం జరుగుతుంది.

విదేశాలలో ఏమేమి జరుగుచున్నది వాటి విషయాలను గూర్చి ఆ శాఖ యొక్క నెట్‌వర్క్‌ల నుండి విదేశాలలో నున్న మిషన్‌ల ద్వారా తెలుస్తుంటది. విదేశాంగశాఖ ఆధ్వర్యంలో సుమారు 225 మిషన్‌లు ఇతర దేశాల్లో భారతదేశం తరపున పనిచేస్తున్నాయి. ఒక్కొక్క మిషన్‌లో అనేక విభాగాలుంటాయి. అవి సరఫరాల విభాగం అంతర్జాతీయ సంస్థలు, పాస్‌పోర్టు, సంక్షేమం, సహాయక అట్లా ఎన్నో ఉంటాయి- ఈ మిషన్‌లో ఆయాదేశాలలో నున్న ప్రవాస భారతీయుల క్షేమం, స్థితిగతులు ఆదేశంలో ఏమి జరుగుతుంది నివేదికలను పంపిస్తుంటాయి.

ఆయా మిషన్, దౌత్యదూతలు పంపిన సమాచారం ప్రకారం ఆ సమాచారంను విశ్లేషించి, వాటిపై ఒక నిర్ణయంను గైకొని మరల ఆ మిషన్స్‌కు ఈ విధంగా పనిచేయండి అని సలహాలు వెళుతుంటాయి. సలహాలు సంప్రదింపులు ఆయా విభాగపు అధిపతులు, కార్యదర్శి, మంత్రి యొక్క సమన్వయంతో నిర్వహిస్తుంటారు.

## సాంస్కృతిక సంబంధాలు :

దేశ విదేశాలతో సాంస్కృతిక సంబంధాలను చూడడానికి సాంస్కృతిక వ్యవహారాలశాఖ పనిచేస్తుంది. దీనిని 1950 లో నెలకొల్పారు. ఈ శాఖ విదేశాలలో మన సంస్కృతిని, సంప్రదాయాలను ఏ విధంగా విస్తరింపచేయాలనేది చూస్తుంది.

## విదేశ ప్రచార విభాగం :

విదేశీ ప్రచార విభాగంను 1948లో ఏర్పాటు చేశారు. ఈ ప్రచారవిభాగం విదేశాలలో మనదేశ విధానాలు, తీరుతెన్నులు, సంస్కృతులను గూర్చి ఆయాదేశ వాసులకు పత్రికలు, ప్రచారం ద్వారా తెలియ జేస్తుంటుంది. విదేశప్రచార విభాగం కూడ ఒక సంయుక్త కార్యదర్శి ఆధిపత్యంలో పని చేస్తుంటుంది.

ఈ విదేశీ ప్రచార విభాగం మూడురకాలుగా పనిచేయడం జరుగుతుంది. ఆయా పత్రికా విలేకర్లకు,మీడియా ప్రతినిధులకు దేశవిదేశాలకు చెందినవారికి చెపుతుంది ఇది ఢిల్లీనుండి పనిచేస్తుంది. ఆయా విదేశీ పత్రికలతో విధిగా సంబంధాలు కలిగి ఉంటుంది ఏ విధంగా విదేశాలలో ప్రచారం చేపట్టాలి, విధాన నిర్ణయాలు, దానికి సంబంధించిన సమాచారం అన్నింటిని చేస్తుంది.

ఈ విదేశ ప్రచారవిభాగం ప్రసార మంత్రిత్వశాఖల సమన్వయంతో పని చేస్తుంది. ముఖ్యంగా ఫిల్మ్ డివిజన్, రేడియో విదేశీ విభాగం, అన్నింటి సమన్వయంతో పనిచేస్తుంటుంది. ప్రచారపు ముద్రిత పోస్టర్లు, ప్రింట్లు, రకరకాలుగా ప్రచారం చేస్తుంటుంది. దీనినే XP విభాగం గుర్తింపు పొందింది. మనదేశం తరపున పనిచేస్తున్న మిషన్‌కు తగన సమాచారం, ప్రచార సామాగ్రిపంపి సమర్ధవంతంగా విదేశాలలో మనదేశంపై జరుగుతున్న తప్పుడు ప్రచారాన్ని త్రిప్పికొడుతుంది. మనదేశపు స్థితిగతులు విదేశీయులకు తెలియడానికి ఒక పత్రిక ఇండియా-పారిన్ రివ్యూ (India Forign Review)ను నడుపుతుంది. పత్రికలు, చిన్న పత్రికా సమాచారాలు అన్నింటిని చేస్తుంది. మనదేశ గౌరవం వివిధ దేశాలలో పెంచడానికి ముఖ్య సాధనంగా పనిచేస్తుంది.

**గూఢాచారి విభాగం (Intellegence) :**

విదేశాలలో ఏ విధంగా మనదేశం గూర్చి ప్రచారం జరుగుతుంది. మన దేశంలో ఆయాదేశాల ప్రతినిధులు, సంఘాలు ఎట్లా పనిచేస్తున్నాయి అనే విషయాలను సేకరించుతుంది. ముఖ్యంగా ప్రతిదేశానికి ఈ గూఢచారి విభాగం సమర్ధవంతంగా పనిచేయుటపై ఆదేశ విదేశాంగ విధానం ఆధారపడి ఉంటుంది. అమెరికా దేశంలో గూఢచారి విభాగంను CIA అంటారు. సోవియట్ రష్యా గూఢచారి సంస్థను KGB, బ్రిటన్, ఫ్రాన్సులు అన్నింటి ప్రత్యేక గూఢచారి సంస్థలు పని చేస్తుంటాయి.

మనదేశంలో గూఢచారి విభాగం RAW అంటారు. అదేరిసెర్చ్ ఎనాలిసిస్ వింగ్ అంటారు. ఇదికాక మిలిటరీ ఇంటలిజెన్సు, ఇంటలిజెన్సు బ్యూరోలు సమాచార సేకరణకు పనిచేస్తుంటాయి. ఇండియాయొక్క విదేశీ సమాచార సేకరణ సమర్ధవంతంగా జరుగుతుంది. ఈ RAW మొదటి డైరెక్టరుగా శ్రీ R. N. Rao పని చేయడం జరిగింది. అదే విధంగా జాయింట్ ఇంటలిజెన్సు కమిటీని 1965లో ఏర్పాటు చేశారు. దాని నిర్మాణం ఈ విధంగా ఉంటుంది. ఈ కమిటీ కేబినెట్ సెక్రటేరియట్ ఆధ్వర్యంలో పని చేస్తుంటుంది.

**జాయింట్ ఇంటలిజెన్సు కమిటీ**

చైర్మన్ : కేబినెట్ సెక్రటరీ
విదేశాంగ కార్యదర్శి

రక్షణ కార్యదర్శి
హోమ్‌శాఖ కార్యదర్శి
డైరెక్టర్ : **RAW**
చైర్మన్ : రక్షణ శాఖాధిపతుల కమిటీలు సభ్యులుగా ఉంటారు.

## భారత ఇంటల్‌జెన్సు వ్యవస్థ




ఈ ఇంటల్‌జెన్సు వ్యవస్థ అనేక విధాలుగా ఇండియాను గూర్చి సమాచారంను అందిస్తుంటాయి. భారత విదేశాంగ విధానం ఈ ఇంటిలిజెన్సు శాఖ యొక్క పరిస్థితిపై ఆధారపడి ఉంటుంది.

ఈ విధంగా భారతదేశ మంత్రిత్వశాఖ విధాన నిర్ణయంలో అటు రాజకీయ కార్యవర్గం ఇటు ఉద్యోగస్వామ్యం అనేకరకాలుగా యిమిడి ఉంటాయి. మనకు కనిపించేది మాత్రం విదేశాంగమంత్రి, ఉపమంత్రులు. వారు పనితీరు మాత్రమే తెలుస్తుంది.

# 5. ప్రపంచ వ్యవహారాలపై గాంధీజీ ప్రభావము

నేటి హింసతో కూడిన ప్రపరాజ్యాల వ్యవహారాలలో అహింస ఎంతో ప్రాముఖ్యతను కలిగి ఉంది. అంటే రాజ్యాల రాజకీయ నాయకత్వం అలజడి రాజకీయాలపై ఆధారపడడం ఆనవాయితీ అయింది. అలాంటి రాజకీయ వ్యవహారాలకు ఒక శాంతియుత మార్గం చూపినవాడు మహాత్మాగాంధీ. గాంధీజీ మొదట తన అహింసా వాదాన్ని ఆఫ్రికాలో శ్వేత జాతీయులు నల్ల వారిపై జరిపిన అణచి వేత చర్యలకు వ్యతిరేకంగా కొనసాగించిన కార్యక్రమంతో మొదలయింది. తదానంతరం గాంధీ 1915 నుండి బ్రిటిష భారతదేశ రాజకీయ పోరాటంలో నీలి మందు కార్మికులకు కనీస వేతనంకొరకు చంపారన్ ఉద్యమంను శాంతియుతంగా నడిపి బ్రిటిష యజమానులనుండి విజయవంతంగా కనీస వేతనాలను లభించేట్లు చేయగలిగారు. ఆ నాటినుండి గాంధీ స్వాతంత్ర్య పోరాటంలో అహింసాయుత మార్గం ననుసరించి కాంగ్రెస్ నాయకత్వానికి అహింసా మార్గాన్ని చూపారు. ఆ అహింసా పోరాటం భారతానికి స్వాతంత్ర్యంను తెచ్చింది.

మహాత్మాగాంధీ చూపిన మార్గం ననుసరించి అమెరికా నీగ్రోల ఉద్ధరణకు మార్టిన్ లూథర్‌కింగ్ ప్రయత్నించి కొంతవరకు సఫలీకృతుడయినాడు. మార్టిన్ లూథర్‌కింగ్ మొదలుపెట్టిన సమానహక్కుల కార్యక్రమమే నేటి నల్ల వారికి అమెరికా రాజకీయ వ్యవహారాలలో స్థానాన్ని కల్పించింది. అదే శాంతియుత పథంలో తన ప్రజలకు నిజమైన హక్కులు కావాలంటు పోరాడుతూ గత సంవత్సరంవరకు జైలులో కాలం గడిపి నల్ల జాతీయుడు వారికెలుగునైన నెల్సన్ మండెలా. అదే విధంగా ఆరవదశకంలో అహింసా వాదం ననుసరించి ఆసియా-ఆఫ్రికా జాతీయులు తమ దేశ స్వాతంత్ర్యంనకు కృషిచేసి పాక్షికంగా విజయం సాధించారు. నేటి ప్రపంచం అణుయుగపు భయానక స్థితిలో ఉంది. ఈ అణుబాంబుల దాడి, మిస్సైల్స్, నక్షత్రయుద్ధం అనే భయంకర స్థితినుండి బయటపడాలంటే దానికి మార్గం అహింసా సిద్ధాంతం ఒకటే మార్గం. అదేవిధంగా నేటి ప్రపంచ దేశాలన్ని ఏదో విధమైన అలజడి హింసా రాజకీయాలతో కొట్టుమిట్టాడుతున్నాయి. అభివృద్ధిచెందిన దేశాలు ఒకటేమిటి ప్రతి ప్రపంచరాజ్యం హింసా రాజకీయాలతో నడుస్తున్నాయి. కనుక వీటి పరిష్కారంకు గాంధీజీ చూపిన అహింసా మార్గం

ఆచరించదగినది. ఈ అహింసా సిద్ధాంతంను ప్రయోగాత్మకంగా నిరూపించి విజయం సాధించినవారు మహాత్మాగాంధీ. ఆయన ప్రబోధించిన అనేక సూత్రాలలో అహింస అతి ముఖ్యమైనది. మొత్తం గాంధీజీ తన ప్రభావంను ఏ విధంగా ప్రపంచ వ్యవహారాలలో ముద్ర వేయగలిగాడనేది వలసవాద వ్యతిరేకోద్యమము, మానవ గౌరవ (వేద) ప్రతిష్టకొరకు జరిపిన పోరాటం, శాంతికొరకు ఆయన కొనసాగించిన కృషిని గూర్చి ఇందులో చెప్పడం జరిగింది.

## 1. గాంధీజీ-ప్రపంచనేతలు :-

ఈ శతాబ్దంలో ప్రపంచ రాజకీయ వ్యవహారాలలో ప్రభావం చూపి విప్లవాత్మక మార్పులను చూపినవారిలో లెనిన్, హిట్లర్: మావో, మహాత్మాగాంధీ. వీరిలో గాంధీ మాత్రమే నాటి సమాజిక స్థితిని నాశనం చేయకుండ ఆ సమాజం ముందుకు పోవడానికి మార్గం చూపారు. మిగతావారు వున్న సమాజపు విలువలు. నడవడికను తొలగించి నూతన విలువలు, నడవడికను ప్రవేశపెట్టాలన్నారు. అది యువ రక్త సిక్తపు తిరుగుబాటు ద్వారాను, మార్పు సాధ్యమౌతుందన్నారు. కాని మహాత్మాగాంధీ మాత్రం వున్న సమాజిక స్థితికి ఆటంకం కలుగకుండ శాంతియుతంగా మార్పు కావాలన్నారు. ఆ విధంగా అమలుచేయడానికి ప్రయత్నించి సఫలీకృతుడైనాడు. అది సామాన్య లేదా అట్టడుగు ప్రజలను సాంఘికంగా ఆర్థికంగా మార్పుకు పూర్తిగా దోహదపడిందా లేదా అనేది ప్రశ్నకాదు. గాంధీ బోధించిన అహింసామార్గం ఆదర్శంగా తయారయింది. దానినే మహాత్మాగాంధీ ప్రాపంచిక సత్యం (Universal truth) ద్వార విచక్షణతో మానవాళిని మంచి మార్గంలో నడపడానికి మార్గం చూపారు. గాంధీజీ ఏ శాస్త్రవేత్త, నాయకుడు, విద్యావేత్త చూపని మార్గం అహింస పదంను ఎన్నుకొని ప్రపంచంలో పీడిత ప్రజలకు, జాతులకు, విముక్తిమార్గం చూపి అన్ని వర్గాలకు మార్గ దర్శకుడయ్యాడు.

## 2. గాంధీజీ వలసవాదం:

మొదటిగా మహాత్మాగాంధీ ప్రభావం వలసవాద వ్యతిరేకోద్యమంపై ఎక్కువగా ప్రభావంను చూపింది. ఆ ప్రభావమే కోట్లాదిమంది ఆఫ్రికా- ఆసియా జాతీయులను విముక్తిగావించింది. గాంధీజీ, లెనిన్ కంటే ఆరు నెలలు ముందుగాను, సన్‌యట్ సన్ ఆ తరువాత రెండు సంవత్సరాలకు జన్మించారు. వీరిమధ్య అనేకాంశాలలో సామీప్యత ఉంది.

గాంధీజీ వలెనే లెనిన్ న్యాయవాది. గాంధీవలెనే లెనిన్ కూడ జారిస్టు పరిపాలనా విధానంకు వ్యతిరేకంగా ఉద్యమం నడిపి జైలు జీవితం గడిపారు. ముగ్గురు (గాంధీ, లెనిన్, సన్ ఎట్‌సన్)లు వారి ప్రారంభ జీవితంలో వారి రాజకీయ జీవితం ఏర్పడేటప్పుడు విదేశాలలో జీవించారు. తమ ఉద్యమంకు పునాది వేసుకొన్నారు. అయినా ముగ్గురు వారి వారి విధానాలతో, సిద్ధాంతాల ప్రకారం పారిశ్రామిక విప్లవ దుష్ఫలితాలకు వ్యతిరేకంగా స్పందించారు. 1905లో లెనిన్ రష్యా జారిస్టు ప్రభుత్వంకు వ్యతిరేకంగా పెద్ద సైనిక తిరుగుబాటును నడిపించాడు. సన్ ఎట్ సన్ చైనా విప్లవం లీగ్‌ను రహస్యంగా వ్యవస్థీకరించారు. అదే కాలంలో గాంధీజీ జాతి వివక్షతకు వ్యతిరేకంగా దక్షిణాఫ్రికాలో ఉద్యమం నడిపారు. అదే సత్యం నిరూపణ (**Experiment With Truth**)ను మొదటిసారిగా నిర్వహించారు.

ఎప్పుడైతే ఆర్థిక విచ్ఛిన్నకర స్థితి, వ్యక్తిగత అవమానాలకు భారతీయులు దక్షిణ ఆఫ్రికాలోను భారతదేశంలోను ఎదుర్కొంటున్న పరిస్థితులనుబట్టి ఎవరైన హింసతో కూడిన మార్గంను ఎన్నుకొంటారు. కాని గాంధీ మాత్రం 'సత్యాగ్రహం' తన ఆయుధంగా ఎన్నుకొన్నారు. సత్యాగ్రహం అనేది సత్యంనుండి వచ్చిందంటారు గాంధీజీ.

గాంధీజీ అనేక రకాలుగా అసంతృప్తితో కూడిన పీడిత ప్రజలయొక్క నిరాశను దుర్వినియోగం చేయలేదు. ప్రతి వ్యక్తికి వ్యక్తిగత గౌరవంను దానితోపాటు సహనం వారిమధ్య వృద్ధిపొందేట్లు చేశారు. అదే విధంగా గాంధీజీ తన శత్రువులను (బ్రిటిషు సామ్రాజ్యవాదం)ను నాశనం చేయమని నినాదం యివ్వలేదు. అతని అనుచరులకు బ్రిటిషువారిని ప్రేమతోను, మర్యాదతోను నచ్చ చెప్పాలని ప్రబోధించారు.

కేవలం అర్ధ శతాబ్దంలోనే ప్రపంచ సామ్రాజ్యాలు కూలిపోయి వాటి స్థానంలో స్వాతంత్ర్యంగా ఏర్పడిన ప్రజా రాజ్యాలను చూసాం. అయినా ఏదో విధంగా నూతన వలసవాదం కొనసాగుతుంది. దాన్ని అంతం తొందరలోనేచూస్తాం. భారతదేశ స్వాతంత్ర్యోద్యమం మహాత్మాగాంధీ నిర్వహించిన అహింసా ఉద్యమంను ప్రపంచం ఎప్పుడు గుర్తుంచుకొంటుంది. ఆ భారత స్వాతంత్రోద్యమం ఆధునిక దేశాలకు మార్గం దర్శక మయింది. గాంధీజీ నడిపిన ఉద్యమం వలననే భారతీయులలో ఉత్తేజంను చెలరేగించి శాంతియుతంగా స్వాతంత్ర్యం పొందగలిగింది. అదే విధంగా ఆసియా- ఆఫ్రికా దేశాలలో హింస కొనసాగిన శాంతియుత మార్గంలోనే వలసవాదం నుండి విముక్తి పొందాయి,

## 3. గాంధీజీ- దక్షిణాఫ్రికాలో అహింసా మార్గం

దక్షిణాఫ్రికాలలో మహాత్మాగాంధీ ప్రదర్శించిన అహింసాయుత మార్గం సమున్నతమైనది. ఆ అహింసా మార్గమే అణచివేతను, యుద్ధోన్మాదంను విజయవంతం చేయగలిగింది. గాంధీ చూపిన మార్గమే స్వాతంత్ర్యానంతరం మాజీసైనిక పాలకుల మధ్య దేశీయవాసుల మధ్య సఖ్యత ఏర్పరచింది. ఆ మార్గమే ఐక్య భారతంను సాంఘిక, రాజకీయ, ప్రజాస్వామంను ఏర్పరిచింది. అదే విధంగా భారత విదేశాంగ విధానములో శాంతి సహనంతో ప్రపంచ దేశాలకు మార్గదర్శకమైంది. దీన్ని చూసి ఆసియా, ఆఫ్రికా దేశాలు పరస్పర మర్యాదలతోను వ్యవహరించాయి.

గాంధీజీయొక్క రెండవ అంశం మానవుని గౌరవంను కాపాడుట. ఈ పోరాటంలోనే గాంధీజీ భారతదేశానికి గొప్ప వెలుగును తెచ్చారు. మానవ గౌరవం కాపాడుట అనేదానికి నూతన ఉత్తేజాన్ని, శక్తిని, పటుత్వాన్ని కలుగచేశారు. అంటే ప్రతి మనిషి తను ఏ పని చేస్తున్నా గౌరవం, వ్యక్తిత్వం అనేది తప్పక ఉంటుంది. వ్యక్తిత్వం నిలుపుకొనుటకు అంతరాలు అడ్డురావు. పేదవాడు, ధనికుడు ఎక్కువ- తక్కువ, ఉచ్ఛ-నీచ బేధ భావాలుండవు. ధనికుడు కావచ్చు వ్యక్తిత్వం మర్యాదను కాపాడుకోలేనప్పుడు వృధాకదా! పేదవాడై ఉండవచ్చు తను చేస్తున్న ప్రతి పనిలో తృప్తి, ఆనందం పొందవచ్చు. కనుక ప్రతి మనిషి తన ప్రవర్తనను బట్టి తన స్థానాన్ని పొందుతాడేకాని మిగతా దేనివలన కాదనేది ఈ సిద్ధాంతం యొక్క ప్రాముఖ్యత. ఈ విషయం అందరికి ఎల్లప్పుడు రుచించకపోవచ్చును. కాని ఇది నిత్య సత్యం. ఏనాడు, ఎవరు ఒక సిద్ధాంతం ఒప్పుకోరు ప్రతిదానికి వ్యతిరేకత- అనుకూలతలు ఉంటూనే ఉంటాయి. దానితో ప్రపంచంలోని మైనారిటీలందరు పేద పీడిత ప్రజలు దానియందు నమ్మకం ఉంది. అదే మార్గంననుసరించారు.

మహాత్మాగాంధీజీ భారతదేశం కమ్యూనల్‌గా విభజించబడింది. అలా ఉంటే ఆత్మగౌరవంను స్వతంత్ర్యంను పొందడం చాల కష్టం అని ఎంచారు. ఆయన యొక్క చొరవ హరిజనులకు సమానత్వంను, గౌరవంను కల్పించడానికి పూనుకొన్నారు. దానితో సమాజాన్ని ఉద్ధరించడానికి కులం, మతం అనే వాటివలన

ప్రజాస్వామ్యానికి భంగం వాటిల్లుతుందని వాటికి వ్యతిరేకంగా ఉద్యమంను నిర్వహించారు.

## 4. గాంధీజీ - మార్టిన్ లూథర్‌కింగ్

మహాత్మాగాంధీ మానవ గౌరవ భావంను ఆదర్శంగా తీసుకొని డాక్టర్ మార్టిన్ లూథర్‌కింగ్ అమెరికాలో మానవ హక్కులు తెల్లవారితోపాటు నల్లవారికి సమానంగా ఉండాలని అహింసా యుతంగా పోరాటం కొనసాగించారు. మార్టిన్ లూథర్ నల్లవారికి సమాన హక్కులు రాజ్యాంగ పరమైన ఓటుహక్కు, విద్యాహక్కు, సమాన ఉద్యోగ అవకాశాలుండాలన్నారు ఇంకా తెల్లవారితోపాటు సమానంగా ప్రభుత్వంలో భాగం పొందడంకొరకు ఉద్యమం నడిపారు. ఆ పోరాటంలో గాంధీ ఆదర్శాలను, మార్గంను ఆచరించి క్రమంగా తమ కోర్కెలను సాధించారు. గాంధీజీ ఒక సమయంలో నీగ్రోవారి ద్వారానే అహింసా శుభ సందేశం ప్రపంచానికి వినిపించబడుతుందన్నారు. అప్పుడు ఈ మాటను సుదూర సత్యమని, నింగికి నేలకు ఎంత దూరం ఉందో అదే రీతిలో ఉందన్నారు. కాని సమానత్వం సమానవకాశాలనేవి ఒక జాతి మరో జాతికిచ్చేవి కావు. ఎవరికి వారే పోరాటం జరిపి వాటిని పొందుతారు. పోరాటం లేకుండా యిచ్చేవి అవి సమానత్వం స్వేచ్ఛలుకావు. దీన్ని మార్టిన్ లూథర్‌కింగ్ తన అహింసాయుత ఉద్యమంను చర్చిలలోను, సమావేశ మందిరాలలో, ప్రజాసంబోధనం వద్ద నిరాహారదీక్షలు జరిపారు. అదే విధంగా నీగ్రోలను బస్సులలో ఎక్కనిచ్చేవారుకారు. శాంతియుతంగా నీగ్రోలు బహిష్కరణలు, మాంటిగోమరీ, ఆల్బామాలో నిర్వహించి ప్రభుత్వం తమ కోర్కెలను ఆమోదించేటట్లుగా చేశారు.

డాక్టర్ మార్టిన్ లూథర్ కింగ్ జాగ్రత్తగా తన భావాలను, పద్ధతులను పరీక్షించి విజయంపొందారు.ఆ తరువాత1960 దశకంలో అదేరీతిలోశాంతియుతంగా గొప్ప పౌరహక్కుల ఉద్యమంను నిర్వహించి నీగ్రో అమెరికా వారి హక్కులను తెచ్చారు. అదే విధంగా మార్టిన్‌లూథర్ మానవహక్కులతోపాటు స్వయం అభివృద్ధి అనేది కూడ గాంధీ నుండి గ్రహించారు. తొంభై సంవత్సరాల క్రితం దక్షిణాఫ్రికాలలో మహాత్మాగాంధీ తన ఉద్యమం నడుపుతూ ఈ విధంగా చెప్పారు. మనకు వ్యతిరేకంగా తెల్లవారు సాగిస్తున్న చర్యలను పరిశీలించేముందు మనలను మనం ఏ విధంగా తీర్చి దిద్దుకొనవలెనని ఆలోచిద్దాం. ముందు మనం మన స్థితి గతు

లను గూర్చి తెలుసుకొని మన ఇల్లుని మనం దిద్దుకొనెటట్లు చూచుకొని ఇతరులనుండి ఎదురయ్యే సమస్యలు గూర్చి ఆలోచించాలి. అవి మనం ఎదుటి వానివద్ద నుండి పొందాలి మన కోర్కెలు నిజమైనపుడు మనం అడగడం వాటిని పొందడం తప్ప లేదంటారు. అదే విధంగా మార్టిన్ లూథర్‌కింగ్ తన జాతీయులకు అవి అన్ని చెప్పి, అంటే మనం చేస్తున్నపని నిజమైందికాదా! కోర్కెలు పొందటం తప్పనిసరి కనుక వాటిని పొందడం కొరకు పోరాటం జరుపాలి. నీగ్రో యువకులు నేరాలు చేస్తుంటారు. నీగ్రోలు తక్కువ ఆరోగ్యంను కలిగి ఉంటారు. వాటిని చూసి నీగ్రో లను, రెండవరకం పౌరులుగా చూసారు. కనుక వాటినుండి బయటపడి మనలను ఉద్ధరించుకుందాం అనే గాంధీ, లూథర్‌లు ప్రబోధించారు.

నీగ్రోలు తమ హక్కులు పొందడానికి ఊరేగింపులు జరిపారు. అందులో 2,30,000 మంది తెల్ల, నల్ల వారు పాల్గొన్నారు. ఆ ఊరేగింపులో ఏ విధంగాను హింస చెలరేగలేదు. ఆ విధంగా నల్లవారు అమెరికాలో గాంధీయ పద్ధతులు నుపయోగించి తమ కోర్కెలను సాధించుకొన్నారు.

## 5. గాంధీజీ-శాంతి-సమాధానం :

ఆఖరుగా గాంధీజీ ప్రభావం చూపినది ప్రపంచ శాంతి-సమాధానం. ఈ భావన ప్రపంచానికి చాటిచెప్పారు. ఇదేమార్గం మానవుని అనేకవిధాలుగా మార్చి వేస్తుంది. ప్రపంచదేశాల మధ్య శాంతి, సహకారాలు పెంపొందితే మానవాళి ప్రశాంతంగా ఉంటుంది. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో గాంధీజీ "ఆయుధీ కరణ తొందరగా కొనసాగితే ఊచకోతగా మానవులు చరిత్రలో యిదివరకెన్నడు జరుగని విధంగా చనిపోతారు. విజయం పొందితే ఆ విజయం శవాలు మీదుగా వచ్చినదవుతుంది. విజయం ఎవరికోసం సాధించినట్లని అంటారు. గాంధీజీ చెప్పి నట్లు రెండవ ప్రపంచయుద్ధంలో నలుబది మిలియన్ల ప్రజలు చనిపోయారు. అదే విధంగా అణుయింధన ఆయుధాలు నుపయోగించుట వలన పదిరెట్లు మంది చని పోతారు. యుద్ధం ఎవరికోసం జరిగినట్లు? ప్రశ్నగానే మిగిలిపోతుంది. నూతన సాంకేతిక పరిజ్ఞానం వలన మనకు ముక్తి లభిస్తుందా?

ఒకదేశం మరోదేశంపై దండెత్తడం వలన ఇరువైపుల పూర్తిగా వినాశకరం జరుగుతుంది. అటు దురాక్రమణదారుడు, యిటు వారికి నష్టం కలుగుతుంది. ఎందు వలనంటే దురాక్రమణ నాయకులు బాధ్యతా రహితంగా ఉండుటచే ఇట్లాంటి నష్టాలు

సంభవిస్తాయి. ఉదా:- ఇరాన్–ఇరాక్ యుద్ధం ఎనిమిది సంవత్సరాలు కొనసాగడం వలన ఎవరు లాభపడ్డారు ?

రెండవదిగా రేడియో, టెలివిజన్, కమ్యూనికేషన్లు, సెటిలైట్లు, సూపర్ సోనిక్ విమానాల అభివృద్ధి వలన ఒకదేశం మరోదేశ ప్రజలు ఏమి ఆలోచన చేస్తున్నారు ఎలా జీవిస్తున్నారనేది తెలుసుకొనవచ్చును. టూరిజం వలన, విద్యార్థులను మార్పిడి చేసుకొనుట వలన ఒక దేశానికి మరోదేశం ప్రజల హృదయాలకు మధ్య ప్రతిబంధకంగా నిలుస్తుందన్నారు. అయినా నేడు దేశనాయకులు బాధ్యత లేకుండ యుద్ధంకు దిగి మిలియన్ల ప్రజలయొక్క ప్రయోజనాలను మరచుటకు వీలులేదు. ఈ విషయం గాంధీజీ చెప్పిన సూత్రాలు ప్రపంచానికి వర్తిస్తాయి. శతాబ్ధపు క్రితం చెప్పబడిన 'ప్రపంచ సోదరభావం' సూత్రాన్ని 20వ శతాబ్ధపు ప్రజల విషయంలో చక్కగా వర్తిస్తుందంటారు.

గాంధీ చనిపోయినపుడు జనరల్ మెకార్థర్ "నాగరికత అభివృద్ధి పథంలో తప్పకుండ గాంధీజీ నమ్మిన సూత్రాలైన సత్యం, అహింసా, మానవ గౌరవం, సహాయ నిరాకరోద్యమంలు నిలిచి ఉంటాయన్నారు. గాంధీ యొక్క ప్రభావం ఎందుకు ప్రపంచం మీద ఉందంటే గాంధీ తత్వం మానవజీవితం కందని సత్యంను, ఆశయాలను అనునయించి స్వతంత్ర్యం, ఉమ్మడి జీవితం అందరికి ఉండాలంటారు. విశ్వావాప్త కుటుంబంను స్థాపించాలంటారు. గాంధీజీపై తోరో, టాలుస్టాయ్‌ల ప్రభావమే కాకుండ ఆధునిక సమస్యలకు పురాతన సూత్రాలనుండి పరిష్కారం కనుగొనడం అనేది నేర్పాడు. ఇంకా గాంధీ వ్రాసిన 'సత్యంతో నా ప్రయోగం' అనే పుస్తకంలో చెప్పారు. గాంధీ భావాలు దక్షిణాఫ్రికాలో ఉద్భవించి ఇండియాలో ఆచరణలో పెట్టబడ్డాయి. తదానంతరం అమెరికాలో మార్టిన్ లూథర్‌కింగ్ నాయకత్వాన విజయవంతంగా మానవహక్కులు రూపంలో ప్రచారం పొందాయి. గాంధీజీ పరిశీలన ప్రకారం 'చిత్త శుద్దితో కూడిన చిన్న నిర్ణయించబడిన నిజమైన సత్యం మొత్తం ప్రపంచ చరిత్రను మార్చివేయగల' దంటారు.

# 6. జవహర్‌లాల్ నెహ్రూ - భారతదేశ విదేశాంగ విధానం

జవహర్‌లాల్‌నెహ్రూ భారతదేశ ఆధునిక నిర్మాత. ఆయనకు భారతదేశ సుదీర్ఘ చరిత్రలో ముఖ్యస్థానం కలదు. నెహ్రూ భారతదేశ స్వాతంత్ర్యోద్యమ నాయకుడే కాక ప్రణాళిక బద్ధమైన ఆర్థిక సాంఘిక అభివృద్ధికి కృషి చేసిన మహా నుభావుడు. దేశ స్వాతంత్ర్యానంతరం మొదటి ప్రధానియేకాక భారతదేశ మొదటి విదేశాంగ శాఖమంత్రిగా సుమారు 18 సంవత్సరములు కొనసాగారు. ఆయన నాయకత్వాన నేటి భారతదేశ విదేశాంగ విధానం రూపుదిద్దుకుంది. ఆయన కృషి ఫలితమే నేటి ప్రపంచములో భారతదేశం ఆరవస్థానం నాక్రమించింది. నెహ్రూ విశాల దూరదృష్టియే భారత్‌కు ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలలో అగ్రగామిగాను, ఐక్యరాజ్యసమితిలో శాంతికాముక దేశంగాను, అంతర్జాతీయ సంస్థల్లోను, ప్రాంతీయ సహకార సంస్థలలోను అతి ప్రాముఖ్యమైన స్థానంను పొందింది. ఆయనకు ముందే చారిత్రక క్రమంలో మనదేశం నిర్వహించిన పాత్ర ప్రపంచ రాజ్యాలలో ఒక శాంతి కాముక దేశంగాను, ప్రపంచదేశాల నాగరికత సాంస్కృతి క్రమంలో ఒక ముఖ్య స్థానంను సంతరించుకున్నది. మన దేశం రెండువేల సంవత్సరాల సుదీర్ఘ చరిత్రలో సాధించిన సమున్నత స్థితిని నిలుపుటకు స్వాతంత్ర్యానంతరం అనేక విధాలుగా అభివృద్ధి అన్ని రంగాలలోను సాధించింది. దానికి ముఖ్యకారణం మన స్వాతంత్ర్యోద్యమ నాయకులు వారు అవలంభించిన నూతన, పంథా ఒక యెత్తు. అదేబాటలో అంటే బుద్ధుడు బోధించిన సత్యం, అహింస, మహాత్మాగాంధీ తను స్వయంగా అనుసరించి చూపిన మార్గంలో భారత దేశంను నడపడం మరో ఎత్తు. ఈ క్రమంలో భారతదేశ విదేశాంగ మంత్రిగా విదేశాంగ విధానంను రూపుదిద్దుటలోను ఆయన చేసిన సేవ గణనీయమైనది. విదే శాంగ శాఖను, వివిధ దేశాలతో నెలకొల్పిన సంబంధాలను భారతదేశంకు విశిష్ట స్థానం సంపాదించాడు నెహ్రూ.

నెహ్రూ విదేశాంగ మంత్రిగా చేసిన అంశాలను పరిశీలించాలంటే మన స్వాతంత్ర్యోద్యమ చరిత్ర చూడాలి. కాంగ్రెస్ చేసిన విదేశాంగ విధానం ప్రతిపాద నలు పరిశీలించాలి. మనదేశ స్వాతంత్ర్యోద్యమం కూడ ప్రపంచంలోని ఆసియా,

ఆఫ్రికాదేశాల విముక్తితో ముడిపడి ఉందని ఆనాడే నెహ్రూ బలంగా నమ్మారు. ఇండియాతో సహా ఈ దేశాలన్నియు విదేశీయులు అంటే ఐరోపా సామ్రాజ్యవాద పిడికిలి నుండి విముక్తి పొందడానికి ఎన్నో విధాలుగా కృషి సల్పాయి. నెహ్రూ ప్రపంచ విప్లవాలను తెలుసుకొనడం ఆయాదేశాల ప్రజాపోరాటం ఏ విధంగా జరిగాయి, ఆ మార్గం ఈ ఆఫ్రికా ఆసియా దేశాల విముక్తికి తోడ్పడతాయని ఆలోచన చేసిన మొదటి వ్యక్తి. అదే విధానంలో భారత స్వాతంత్ర్యోద్యమంకూడ కొనసాగాలన్నారు. అదే క్రమంలో మహాత్మాగాంధీ ఆయన అనుంగు అనుచరుడుగా నెహ్రూ కాంగ్రెస్‌లో ప్రముఖ పాత్రను నిర్వహించారు. అప్పటికే నెహ్రూకు ప్రపంచదేశాలు పశ్చిమ-తూర్పు దేశాల తీరుతెన్నులతో పరిచయం ఏర్పడింది. 1927 మద్రాస్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో విదేశాంగ విధానంలో పటుత్వం వున్న వ్యక్తిగా నెహ్రూ గుర్తించబడ్డారు. ఎందుకంటే 1917 లో నెహ్రూ రష్యా సందర్శించినపుడు ఆయన సోవియట్ రష్యా సాధించిన మార్పులకు ప్రభావితుడైనాడు. బోల్షివిక్ విప్లవ విజయం మానవచరిత్రలో ముఖ్యఘట్టం. అది ప్రజా జీవితాన్ని రష్యాలో మార్చివేసింది. ఐరోపా దేశాల సామ్రాజ్యవాదం ప్రపంచ పెట్టుబడిదారీ విధానం ఎట్లా ఆసియా-ఆఫ్రికా దేశాలను మార్చింది నెహ్రూ అర్థం చేసుకొన్నారు. ఎన్నో సందర్భాలలో మూడవ ప్రపంచ దేశాలకు సోషలిస్టు విధానం సరియైనదని నమ్మారు.

జవహర్‌లాల్‌నెహ్రూ 1936లో కాంగ్రెస్ విదేశాంగ వ్యవహారాల కమిటీ చైర్మన్‌గా ఎన్నిక కావడం. అప్పట్లోనే భారతదేశం ప్రపంచములోని సామ్రాజ్య వాదం, వలస వాదం, పీడింపు విధానం, ఆర్థికంగా కొల్లగొట్టడంవంటి విధానంకు, జాతివివక్షతకు వ్యతిరేఖంగా కాంగ్రెస్ విదేశాంగ విధానంను రూపొందించుటలో నెహ్రూ ప్రముఖ పాత్రవహించారు. నెహ్రూ 7 ఏప్రిల్ 1942లో జపాన్ భారత దేశంపై దండెత్తడం వలననే భారత్‌స్వాతంత్ర్యం ఇస్తానన్నారనే ప్రచారమును కాంగ్రెస్ ముఖ్య కార్యకర్తగా, విదేశాంగ విధానంపై అధిపతిగా ధైర్యంగా ఖండించారు. కెనడా రాజనీతి శాస్త్రవేత్త మైఖెల్ బ్రీచర్ నెహ్రూ జీవితచరిత్రలో 1930 తరువాత నుండి నెహ్రూ కాంగ్రెస్‌లో విదేశాంగ విధానంపై ప్రత్యేకుడుగా పేర్కొన్నారు. నెహ్రూయే కాంగ్రెస్ పార్టీకి ప్రపంచ వ్యవహారాలపై ఒక దృక్పథంను నెలకొల్పాడంటారు.' 1946 సెప్టెంబర్‌లో కాంగ్రెస్ నాయకత్వాన ఏర్పడిన ఇంటరిమ్ ప్రభుత్వ ప్రతినిధిగా నియమించబడినపుడు కామన్‌వెల్త్ అండ్ విదేశాంగ వ్యవహారాల శాఖ భారం నెహ్రూ ఆధిపత్యం క్రిందనే ఉంచుకున్నారు.

నెహ్రూ యొక్క ఆశావాదం ఆయన చేసిన మొట్టమొదటి రేడియో ప్రసంగం 7-9-1946లో అంటే ఆయన ఇంటరిమ్ ప్రభుత్వాధిపతిగా విదేశాంగ విధానం ధృక్పధాలను ప్రకటించారు. భారతదేశం సాధ్యమైనంతవరకు శక్తి రాజకీయ వర్గాలతోను, పశ్చిమ లేదా తూర్పుదేశాల ఒప్పందాలకు దూరంగా ఉంటుంది.ఇగివరకు రెండు ప్రపంచ యుద్ధాలను చూసాం. ఇకముందు అలాంటి అఘాయిత్యం జరగకుండ మేము యుద్ధాలకు దూరంగా ఉంటామని ప్రకటించారు. నెహ్రూ బ్రిటన్ మరియు ఇతర కామన్వెల్తు దేశాలలో సంబంధాలను నెలకొల్పాలని నిశ్చయించారు. నెహ్రూ ఆసియాలోని మిగతాదేశాల స్వాతంత్ర్యం కొరకు చేస్తున్న పోరాటానికి మద్దతుని ప్రకటించారు. ఆయన అమెరికా ప్రజలకు శుభాకాంక్షలను తెలియజేశారు, మీరే అంతర్జాతీయ వ్యవహారాలకు ప్రాతినిధ్యం యిచ్చారన్నారు. నెహ్రూ మిగతా మిత్ర దేశాలను గూర్చి చెపుతూ రష్యా—ఈ దేశంతో మాకు సరిహద్దులేకాక ఆసియాలోని విధాన నిర్ణయాలకొరకు దగ్గర సంబంధాలు ఏర్పరుచుకోవాలన్నారు. చైనాపట్ల ఉత్సాహంను వ్యక్తపరుస్తూ చైనా పెద్ద, శక్తి, చరిత్ర గలిగిన దేశం.మా పొరుగుదేశశంగా ఎంతోకాలంనుండి స్నేహభావాన్ని కలిగియున్నాము.ఇకముందు స్నేహసంబంధాలుండాలన్నారు.

నెహ్రూ ఈ ప్రసంగానికి ముందే భారతదేశ విదేశాంగ విధానం యొక్క ఆదర్శాలను, లక్ష్యాలను ప్రకటించారు. అవి జాతి వివక్షతకు, వలసవాదంకు వ్యతిరేకత, బ్రిటన్‌తోనున్న గత శత్రుత్వమును తగ్గించి మంచి సంబంధాలను నెలకొల్పాలన్నారు. రష్యా, అమెరికా, చైనాలతో సహకార సంబంధాలు ఆసియా-ఆఫ్రికా దేశాలతో సమానత్వ ప్రాతిపదికపై ఏ విధమైన వ్యతిరేకతలు లేకుండ సంబంధాలు కొనసాగించాలన్నారు. ఇలాంటి ప్రకటన చేయడానికి ఆ కాలపరిస్థితులలో చాలా ధైర్యము కావాలి. అంతేకాక అంతర్జాతీయ రాజకీయరంగం అస్తవ్యస్త పరిస్థితులతో నిలకడలేని స్థితిలో అలాంటి నిర్ణయం తీసుకొని భారతదేశాన్ని ఏ వర్గంలోకి చేరకుండ స్వాతంత్ర్య విదేశాంగ విధానమును సృష్టించుకొని భారత్‌కు ప్రపంచ రాజకీయరంగంలో ఒక విశిష్ట స్థానంను రూపొందించాలన్నారు.

నెహ్రూ 1947 ఆగస్టు 15న బ్రిటిషు వారినుండి స్వాతంత్ర్యం పొందిన అనంతరం ప్రధానమంత్రిగా నియమించబడ్డారు. అప్పుడుకూడ విదేశాంగశాఖ నిర్వహణను తన ఆధ్వర్యం క్రిందనే ఉంచుకున్నారు. ఆయన అంతకుముందే భారతదేశ విదేశాంగ విధానంగూర్చి విశాల దృక్పధం కలిగి ఉండుటతో ఆశయా

లను, లక్ష్యాలను నిర్ణయించుట సులభమైంది. నెహ్రూ నమ్మకం భారతదేశం ఆసియాలోను, అంతర్జాతీయంగా మూడవ ప్రపంచదేశాలలో ఉన్నతస్థానం పొందాలని ఆశించారు. అదే సమయంలో పీడితదేశాలు ఇండియాతోసహా విదేశీ ప్రభావం తమదేశ అంతర్గత, బహిర్గత వ్యవహారాలలో సాగింపుటను వ్యతిరేకించారు. ఆ దేశాలలోను శాంతి భౌతికమైన అభివృద్ధి అవసరం అని తలచారు. నెహ్రూకూడ శాంతి అనేది నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలకు అవసరం అన్నారు.

నెహ్రూ 1947లోనే భారతదేశం ఐక్యరాజ్యసమితిలో డొమినియన్‌గాక స్వాతంత్ర్యం అనంతరం ఐక్యరాజ్యసమితిలో ఒరిజినల్ సభ్యురాలిగా కొనసాగడానికి నెహ్రూ దూత వి.కె. కృష్ణమీనన్ కృషి జరిపారు. నెహ్రూ దౌత్యంవలన భారత్‌కు ఐక్యరాజ్యసమితిలో ఒరిజినల్ సభ్యురాలుగా గుర్తించబడ్డది. 1947లోనే అనేకదేశాలు భారతదేశంను గుర్తించి భారతదేశంలో తమ మిషన్స్ లేదా దౌత్య కార్యాలయాలు ఏర్పరచుకొనుటకు ముందుకొచ్చాయి. యూరీనశాంకో జవహర్‌లాల్ నెహ్రూ భారతదేశ విదేశాంగవిధానం అనే పుస్తకంలో భారతదేశ విదేశాంగవిధానం నెహ్రూయొక్క వ్యక్తిగత వ్యవహారంగా పేర్కొన్నారు. ప్రొఫెసర్ హీరేన్ ముఖర్జీ నెహ్రూ విదేశాంగ విధానం నిర్ణయాలను ఆయన కేబినెట్ అనుచరులు ఎవరు ప్రశ్నించలేదన్నారు.

నెహ్రూ గాంధీ అహింసా సిద్ధాంతమునకు ఎక్కువగా ప్రభావితుడైనాడు. అదే రీతిలో గాంధీ అహింసా సిద్ధాంతంద్వారా భారతదేశం పశ్చిమదేశం బ్రిటన్ నుండి రక్తపాతంలేకుండ విముక్తి పొందింది. నెహ్రూ జాతీయ విధానం పురోభివృద్ధిలో హింసను వ్యతిరేకించారు. అదేవిధంగా విదేశాంగ విధానంలోకూడ మిలిటరీ తత్వంను, యుద్ధాన్ని పూర్తిగా నిరసించారు. నెహ్రూ విదేశాంగ మంత్రి పదవిని స్వీకరించాక రెండు లక్ష్యాలు పేర్కొన్నారు. విదేశీపాలనలో మ్రగ్గుతున్న దేశాల విముక్తి పోరాటాలకు మద్దత్తు, ప్రపంచ దేశాలమధ్య శాంతిసంబంధాలు నెలకొల్పాలని కోరారు. ఈ లక్ష్యాలు మంచివై ఉండవచ్చును. కాని అమలుజరుపుట కష్టమే కాక చాల అదివరణంగా (Vague) ఉన్నవి. అయిన తనున్నంత కాలం ఆ లక్ష్యాలకొరకే కృషి సాగించారు. బ్రిటీషు విదేశాంగ ప్రతినిధి డీన్ అచిసన్ నెహ్రూతో మాట్లాడి నెహ్రూ మాటలలో చాల గట్టివాడు. ఇంతవరకు ఇలాంటి నిర్ద్వంద్వంగా భావాలను గలిగినవారిని ఎక్కడా చూడలేదన్నారు.

నెహ్రూ భారత స్వాతంత్ర్య విధానంను నిలబెట్టుటకు ఏ కూటమిలోనూ చేరకుండ భారత విదేశాంగ విధానంకు పునాదివేశారు. నెహ్రూ ప్రపంచ రాజకీయాలను పూర్తిగా ఆకళింపు చేసుకొని భారతదేశాన్ని ఏ దేశమునకు ధృవరాజ్యం కాకుండ స్వతంత్రంగా వుంచారు. నెహ్రూ 1949లో కామన్వెల్తు దేశాల సంఘంలో కొనసాగుట విజ్ఞతతో కూడిన అంశం అనవచ్చును. అప్పుడు కనుక బ్రిటన్‌తో తెగతెంపులు చేసుకున్నట్లయితే చాలా ప్రయోజనాలను కోల్పోయేది. కామన్వెల్తు దేశాల సభ్యత్వంను కొనసాగించుచు ఐరోపా దేశాలను ముఖ్యంగా బ్రిటన్ నుండి ఎక్కువగా వాణిజ్య, వ్యాపార, ఆర్థిక సంబంధాలు పెట్టుకొనడానికి ఆస్కారం కలిగింది.

## కాశ్మీరు సమస్య :

నెహ్రూ విదేశాంగశాఖను 1947లో చేపట్టిన తర్వాత ఎదుర్కొన్న సమస్య కాశ్మీరు సమస్య. ఇది భారత-పాకిస్థాన్ మొత్తం సంబంధాలతో ముడిపడింది. పాకిస్తాన్ భారత్‌పై (పాక్) కాశ్మీరు గిరిజనులచే తిరుగుబాటు చేయించింది. దానిని సైనిక చర్యచే త్రిప్పికొట్టింది. దానిని అనేక రకాలుగా పార్లమెంట్‌లో ప్రశ్నించినప్పుడు నెహ్రూ కాశ్మీరు భారతదేశ రక్షణకు చాలా ముఖ్యమైనదని దానిని పరిరక్షించుట అవసరం అని పదే పదే చెప్పారు. 1947లో దేశ విభజనానంతరం భారతదేశం లౌకిక తత్వం అవలంబించడం.కాశ్మీరు భారత్‌తోకలవడం మనయొక్క లౌకిక విధానంకు తార్కాణం అన్నారు. పాకిస్తాన్ విషయంలో భారత దేశం ఎల్లప్పుడు స్నేహ సుహృద్భావం.సౌభ్రాతృత్వంతోనే ఉంటుందని నెహ్రూ,పేర్కొన్నారు. అయినను పాకిస్తాన్ ఊహించుకొని భారతదేశం అంటే భయపడుతోంది. అంతేకాక పాకిస్తాన్‌లో పాలకవర్గం తమ అధికారం నిలబెట్టుకొనుటకు విదేశం దాడులను చేస్తోందని మధ్యపెట్టి ప్రజలను నియంత్రణ చేయటం జరుగుతుంది.

నెహ్రూ 'మేము ఇండియా-పాకిస్తాన్ సంబంధాలను గూర్చి పరిశీలించేటప్పుడు విశాల దృక్పథంతో ఆలోచించడం మనయొక్క గత చరిత్రను పరిశీలించి నేడు అనుసరించవలసిన విధానం గూర్చి నిర్ణయం తీసుకొంటామన్నారు ఇరు

వది లేక సుప్పది సంవత్సరాల్రకితం మనమందరం ఏకమై స్వాతంత్ర్యంకొరకు పోరాడాం. మనంకలిసి స్వాతంత్ర్యం సంపాదించుకొన్నట్లే నేడు మన సమస్యలను శాంతియుతంగా పరిష్కరించుకొందాం. ఆనాడు పాకిస్తాన్ కావాలన్నవారి భాషణ వేరుగా ఉండేది.వారు ఐక్యతకు నిర్మాణానికికాక అనైక్యతకు అవిచ్ఛిన్నతకి శాంతికి కాకఉద్రిక్తతలకు ప్రాధాన్యతనిచ్చారు. పాకిస్తాన్-భారత ప్రజలవలె శాంతికాముకులేకాని వారిని కొన్ని శక్తులు తప్పుడుదారిని పట్టిస్తున్నవి. మనకెన్నో ఆదర్శాలున్నాయికాని పాకిస్తానుకు మార్గం చూపే సూత్రాలులేవు' అదీ ఈ రెండు దేశాలమధ్య భేదమన్నారు నెహ్రూ.

1950, 1960లలో భారతదేశం ప్రపంచదేశాలలో కలిగి ఉన్న స్థానం, భారత-పాకిస్తాన్‌ల మధ్య వున్న సంబంధాలు చెడిపోవడమేకాక వ్యతిరేకతలను సృష్టించాయని చెప్పవచ్చును. పాకిస్తాన్-భారత్‌కు వ్యతిరేకంగా ప్రతి అంతర్జాతీయ సమావేశాలలో విమర్శించడం కాశ్మీరు సమస్యను లేవనెత్తడం చేస్తుంది. నెహ్రూ తన ఆశావాదం ననుసరించి రెండు దేశాలమధ్య సమస్యను పరిష్కరించక ఐక్యరాజ్యసమితికి నివేదించటంవలన నేటికి ఆ సమస్య కొనసాగుతూనేఉంది.

**అమెరికాతో సంబంధాలు :**

1947 నుండి నెహ్రూ అమెరికాతో దగ్గర సంబంధాలు కలిగి ఉన్నాయన్నారు. ఎందుకంటే స్వేచ్ఛా రాజకీయ విధానం వైపు మొగ్గు చూపుతూ అమెరికా ఆదర్శాలను మర్చిపోయి పొత్తుపెట్టుకొన్నారు. అంతేకాక అమెరికా, ఐరోపా దేశాలనుండి ఆసియా దేశాలవలెనే వలస వాదంకు వ్యతిరేకంగా పోరాడి ప్రజాస్వామ్యమును ఏర్పరచుకొంది. అందుకనే అమెరికాతో మైత్రితో ఉండాలని నెహ్రూ అన్నారు. అంతేకాక అమెరికానుండి కొంత సహాయమును భారత పారిశ్రామికాభివృద్ధికి కావాలని నెహ్రూ ఆకాంక్షించారు. కాని ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే నెహ్రూ 1949లో అమెరికాను సందర్శించినపుడు అమెరికా భారతదేశమునకు పారిశ్రామికంగా సహాయం చేయుటకుగాని సహాయాన్ని ఇతర రంగాలలో చేయుటకుగాని ఉత్సాహం చూపలేదు. ఎందువలనంటే రెండు దేశాల దృక్పథాలు, ఆలోచనా విధానంలోను, ఆచరణలోను, ఆదర్శాలలోను చాలా భేదం ఉంది. అంతేకాక భారతదేశమును అమెరికా తప్పుగా అర్థం చేసుకుంది సహాయం చేయుటకు ముందుకు రాలేదు.

ఆ తరువాత దశకంలో (1950) కీలక రక్షణ విధానంలో పాకిస్తాన్‌కు అమెరికా మద్దత్తు నిచ్చింది. దానితో నెహ్రూ తన దేశ స్వతంత్ర్య విదేశాంగ విధానంకు ఆసియా దేశాల రక్షణకు ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు. పాకిస్తాన్ అమెరికాతో మిలిటరీ రక్షణ వ్యవస్థలో పాల్గొనడాన్ని వ్యతిరేకించారు. నెహ్రూ అమెరికాతో సంబంధాలు పెట్టు కొందామన్నా వీలుపడలేదు నెహ్రూ చైనా విధానాలను, తన సభ్యత్వంకు ఐక్యరాజ్య సమితిలో మద్దత్తు నివ్వడం. ఆ చైనాయే నెహ్రూని విచారకరమైన స్థితికి లాగింది. నేటికిని అమెరికా భారతదేశంకు అనేక విధాలుగా సహాయం చేస్తున్న పూర్తిగా రాజకీయ సంబంధాలు ఏర్పడలేదు.

## చైనా సంబంధాలు :

నెహ్రూ తన సహజమైన రీతిలో చైనా యొక్క విధానాలకు మద్దత్తు నిచ్చారు. ఈ రెండు బహు పురాతన సాంస్కృతిక జీవన వ్యవస్థలు. ఈ రెండు పెద్ద జనాభాను కలిగిన దేశాలే కాక ఈ రెండింటిమధ్య శాంతి నెలకొంటే ఆసియాలో సుస్థిర శాంతి ఏర్పడుతుందని ఎంచారు. 1939 లోనే చైనాను నెహ్రూ సందర్శించారు. ఆ సుహృద్భావంతోనే 1949లో చైనాతో ఇండియాల మధ్య దౌత్య సంబంధాలు ఏర్పరిచారు. తదనంతరం చైనా-ఇండియాల మధ్య వచ్చిన కలతలు చైనా టిబెట్ స్వాతంత్ర్యంను నిలబెడతామని ప్రకటించినపుడు వచ్చింది. దానిని నెహ్రూ సమర్ధించారు. అంతేకాక చైనా ఆధిపత్యం క్రింద టిబెట్‌కున్న స్వతంత్ర్యంను గౌరవిస్తుందను కున్నారు. ఆ తర్వాత టిబెట్‌ను ఎందుకు మరల స్వతంత్ర్యం చేయాలన్నారు. అప్పుడు చైనా టిబెట్‌పై సైన్యంను పంపి ఆక్రమించుకొంది. నెహ్రూ టిబెట్-చైనాల మధ్య ఒప్పందం కుదుర్చడానికి టిబెట్ చైనాలో భాగంగా గుర్తించి చర్చలు జరిపారు. ఈ చర్చలు ఇండియా ఉత్తరసరిహద్దు సమస్యను తీర్చడానికి పనికి వస్తుందని నెహ్రూ భావించారు. అప్పుడు నెహ్రూకి చైనా భారత సరిహద్దుల గుర్తించి ఎట్టి హానిజరుగదని హామి యిచ్చింది. 1954లో ఇండో-చైనాలు టిబెట్ ఒప్పందము ఒక పద్ధతి ప్రకారం చేసుకొన బడింది.

ఇందులో ఐదు సూత్రాలు శాంతియుత సహజీవనం ఏర్పరిచే వాటిపై ఒప్పందం కుదిరింది. దీనినే పంచశీల సిద్ధాంతం అన్నారు. అవే కొద్ది మార్పులతో

అలీన దేశాల ఆదర్శ సిద్ధాంతాలైనాయి. కాని దశాబ్దం దాటకముందే చైనా దక్షిణ-పశ్చిమ భాగంలో కమ్యూనికేషన్లు నింపాలనే ఉద్దేశ్యముతో భారతదేశ భూభాగంలోకి చొచ్చుకొని వచ్చాయి. అనేక యిబ్బందులను సృష్టించినాయి.

ఇండియా-చైనా సంబంధాలు దిగజారిపోవడం నెహ్రూకి చాలా దుఃఖం ను కలిగించాయి. దీని ఫలితంగా ప్రపంచ దేశాలలో తను నిర్మించిన అలీన సిద్ధాంతానికే దెబ్బతింటుందని బాధపడ్డారు. నెహ్రూ 1950-60 దశకం నిర్మించిన సూత్రాలన్ని మర్చిపోయి చైనా చివరకు 1962లో భారత్‌పై మిలిటరీ దాడిని జరిపింది. కాని నెహ్రూ అధైర్యపడక నిశ్చలంగా ఎదుర్కొని తన సామర్ధ్యంతో తిరిగి తన అంతర్జాతీయ ప్రతిష్టతను నెలకొల్పుకొనగలిగారు. ఆనాటి నుండి భారతదేశం తన జాతీయ ప్రయోజనాన్ని గుర్తించి మెలుగుచు చైనాతో మైత్రి సంబంధాలును ఏర్పరుచుకొనుటకు చర్యలను కొనసాగిస్తూనే ఉంది. నెహ్రూ పంచశీల సిద్ధాంతము చైనా విషయంలో వ్యతిరేక ఫలితాలనిచ్చిన మూడవ ప్రపంచం అంటే ఆసియా-ఆఫ్రికా దేశాలు ఒక వర్గంగా అంతర్జాతీయ రాజకీయాలలో కొనసాగడానికి మార్గ దర్శకమైనాయి.

**ఆసియా-ఆఫ్రికా :**

1949 లోనే నెహ్రూ ఆసియాదేశాల సంబంధాల సమావేశంను ఏర్పాటు చేసి ఆసియాకు ప్రపంచ రాజకీయాలలో సమున్నత స్థానం పొందాలని కోరారు. 1955 బాండుంగ్‌లో ఆఫ్రో-ఆసియా దేశాల సమావేశంను ఏర్పాటు చేసి తమ స్వాతంత్ర్యం బహిర్గత-అంతర్గతంగా కాపాడు కొనుటకు, ఆర్థిక పురోభివృద్ధి సాధించడానికి కావలసిన మధ్యమ మార్గం అలీన విధానమునకు మార్గదర్శక సూత్రాలను రూపొందించారు. అందులో నుండి మూడవ ప్రపంచ దేశాలు ఒక శక్తి ఉద్యమంగా రూపొందడానికి నెహ్రూ మార్గదర్శకుడయినాడు. ఆ విధంగా ప్రపంచంలో నున్న పెత్తందారీ విధానం నకు సంకెళ్ళు వేసి బలహీన, చిన్న దేశాలు స్వతంత్ర్యంగా అభివృద్ధి చెందడానికి అవకాశం కలిగించి మూడవ ప్రపంచ దేశాల ఉద్ధారకుడుగా పేరుపొందారు. అదేవిధంగా ఆఫ్రికా-ఆసియాదేశాల జాతి వివక్షత విధానానికి వ్యతిరేకంగా పోరాడడానికి ఒక శక్తినిరూపొందించ గలిగారు.

## రష్యాతో సంబంధాలు :

1950 దశకంలో నెహ్రూ ఆసియా రాజకీయాలలో చేసిన పేర్కొన దగినది. ఇదే మరల ఇండియా–రష్యాల మధ్య దగ్గర స్నేహ సంబంధాలు ఏర్పడ డానికి దారితీసింది. మొదట్లో భారతదేశం పట్ల రష్యాకు అనుమానాలుండేవి. కాని 1950 దశకం మధ్యలో అమెరికా పాకిస్తాన్‌తో సైనిక ఒప్పందము చేసుకొనడంతో రష్యాలో నూతన నాయకత్వం కృశ్చేవ్ రావడంతో రెండు దేశాలమధ్య దగ్గర సంబంధాలు ఏర్పడ్డాయి. 1955లో నెహ్రూ రష్యా సందర్శించారు. భారతదేశం యొక్క స్థితిని రష్యా ప్రజలకు తెలియ జేసారు. రష్యా నాయకత్వం కూడ శాంతి యుత సహజీవనంను అంతర్జాతీయంగా అమలు పరుస్తామని కృశ్చేవ్ ప్రకటిం చారు. నాటి నుండి రష్యా-ఇండియా సంబంధాలు ఆర్థిక, శాస్త్రీయ, సాంకేతిక రంగాలలో అభివృద్ధి చెందడానికి నెహ్రూ బాగా కృషి చేశారు.

నెహ్రూ దూరదృష్టి వివేకంతో భారత-రష్యాల మధ్యన ఏర్పరిచిన మైత్రి భారతదేశంకు అంతర్గతంగావిదేశాంగ విధానంలోసార్థకతను ఏర్పరచుకొంది.రష్యా భారత్‌కు ఐక్యరాజ్య సమితి రక్షణ సంఘంలో 20 సార్లు పైగా కాశ్మీరు సమస్యపై వీటో చేసి మద్దత్తును ప్రకటించింది. అదే విధంగా రష్యా శాస్త్రీయంగా భారీపరి శ్రమలలో సహాయాన్నందించు చున్నది. నెహ్రూ కున్న ప్రపంచ రాజకీయజ్ఞానం రెండు పెద్ద దేశాలతో మెలిగి తన అభివృద్ధికి సహాయం పొందాలనే విషయంలో ఎంతగానో తోడ్పడింది.

నెహ్రూ దూరదృష్టితో ఏర్పరిచిన సంబంధాలు ముఖ్యంగా పశ్చిమ దేశాల తోను, ఐరోపా సంఘ దేశాలతో ఏర్పరుచుకొన్న సంబంధాలు భారతదేశంను ఆర్థి కంగా బలపరచడమే కాక అనేక విధాలుగా నైతికంగా బలంను పుంజుకొనుటకు తోడ్పడింది. ఇదే విధానం భారత్‌ను మూడవ ప్రపంచ దేశాలకు నాయకత్వం వహించడానికి ఆస్కారం కలిగించింది.' నెహ్రూ భారతదేశ విదేశాంగ విధానం యొక్క పునాది మన నైతిక విలువలపై నిర్మించారు సైనికంగా వెళ్ళినట్లైతే మనం ఏ విధంగా శక్తి రాజకీయాలలో యిమడలేక మన నిస్సహాయ స్థితిని ఎదుర్కొన వలసి ఉండేది. కాని నెహ్రూ దూరదృష్టి, విజ్ఞత భారత దేశంకు నిర్దుష్ట సూత్రా లపై విదేశాంగ విధానంను నిర్మించి భారత్‌కు అంతర్జాతీయ వేదికలపై మన కంటు ప్రముఖ స్థానంను ఏర్పరచారు.

# 7. అలీనోద్యమం - ప్రపంచ రాజకీయాలు

అలీనోద్యమం రెండో ప్రపంచ యుద్ధానంతర పరిణామాలలో ఒకటి. ఈ ఉద్యమం మొదటి సమావేశం బెల్‌గ్రేడ్‌లో 1961లో జరిగింది. గత సంవత్సరం అంటే 1986 ఆగస్టు 26 నుంచి సెప్టెంబర్ 1 వరకు హరారేలో జరిగిన సమావేశం జరిగేనాటికి అలీనోద్యమం ఆవిర్భవించి ఇరవై అయిదు సంవత్సరాలయింది. దీనితో అలీనోద్యమం అభివృద్ధిచెందుతున్న దేశాల వర్గంగా అంతర్జాతీయ రాజకీయాలలో ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకుంది. ఈ ఇరవై అయిదు సంవత్సరాల కాలంలో అలీనోద్యమం ప్రపంచ రాజకీయాలలో పటిష్ఠమైన ఉద్యమంగా వృద్ధిపొందింది. 1960లో కేవలం ఇరవైఅయిదు దేశాల సభ్యత్వంతో బెల్‌గ్రేడ్‌లో ప్రారంభమై ప్రస్తుతం 1.500 మిలియన్ల జనాభా ఉన్న నూట ఒక్క దేశాలసభ్యత్వంతో ఒక శక్తివంతమైన ఉద్యమంగా ప్రపంచ రాజకీయాలలో తన స్థానాన్ని నిలుపుకుంది.

గడచిన కాలంలో ఈ ఉద్యమం విధానంలోను ఉద్దేశంలోను మౌలికమైన మార్పులు వచ్చాయి. మొదట ఆసియా, ఆఫ్రికా దేశాలు వలస వాదం సంకెళ్ళ నుంచి బయటపడడానికి ప్రయత్నించినందువల్ల వలసవాద వ్యతిరేకత ముఖ్య ఆదర్శంగా ఉండేది. తరవాత శాంతి, నిరాయుధీకరణసాధన, అలీన దేశాల సార్వభౌమాధికార పటిష్ఠతలు ఆదర్శాలయ్యాయి. అంతేకాక ఈ ఉద్యమం ఆర్థిక స్వాతంత్ర్య సంపాదనకు కూడ ఎక్కువ ప్రాధాన్యత నిస్తోంది.

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలు స్వాతంత్ర్యం సంపాదించిన తరవాత కూడ పూర్వం ఉన్న పశ్చిమదేశాల ఆధిపత్యమే నేటికీ ఆయా దేశాలతో ఆర్థికంగా పెత్తనం చెలాయిస్తోంది.

నూతన వలసవాదం కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలలో వలసవాద స్థానంలో చోటుచేసుకోడం అంతర్జాతీయ రాజకీయాల దృష్ట్యా అంత మంచిది కాదు. ఎందుకంటే స్వాతంత్ర్యం పొందిన వలస ప్రాంతాలు ఆర్థిక పటిష్ఠతను సాధించడం అంత సులభం కాదు. నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు

ఏదో రూపేణ పశ్చిమ దేశాలమీద ఆధారపడక తప్పడం లేదు. అలాంటి స్థితినుంచి వైదొలగడం కొరకే మధ్యమార్గమైన అలీనోద్యమాన్ని ఒక వరంగా భావించడం జరిగింది, జరుగుతున్నది. ఈ ఉద్యమంలో తమ స్వాతంత్ర్యాన్ని నిలుపుకోడానికి నూతన అంతర్జాతీయ సమతౌల్య స్థితిని ఏర్పరచడానికి కలిసికట్టుగా ప్రాంతీయంగాను, ప్రపంచ వ్యాప్తంగాను చర్చలు జరుగుతున్నాయి. అదేరీతిలో అలీనోద్యమం అంతర్జాతీయంగా అభివృద్ధిచెందుతున్న దేశాలను ఏకం చేసి యుద్ధ వ్యతిరేక తమ ప్రపంచ శాంతిస్థాపనను నొక్కి వక్కాణిస్తోంది.

కొత్తఢిల్లీలో జరిగిన అలీనోద్యమ దేశాల శిఖరాగ్ర సమావేశం అంతర్జాతీయ ఆర్థిక సంబంధాలలో అనేక సమస్యలను గుర్తించి వాటి పరిష్కారం కోసం కొన్ని ప్రతిపాదనలు చేసింది. అంతకుముందు 1985 లువాండాలో జరిగిన అలీనదేశాల విదేశాంగ మంత్రుల సమావేశం, 1986లో కొత్తఢిల్లీలో జరిగిన అలీన దేశాల సమన్వయ సంఘ సమావేశం అలీనవిధానోద్యమం ఎదుర్కొంటున్నసమస్యలను గుర్తించాయి.

ఈ సమావేశాలలో అలీనోద్యమం చేపట్టవలసిన కార్యక్రమం, మార్గాలను రాజకీయసభ నిర్ణయించింది. అవి 1. శాంతిస్థాపనకై నిర్విరామ పోరాటం జరపాలి. 2. ప్రపంచంలో అణుయుద్ధానికి వ్యతిరేకత, ఆయుధాల ఉత్పత్తి పెంపును అరికట్టడం 3. కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాల సార్వభౌమాధికారాన్ని ఆదేశాల ప్రజల స్వేచ్ఛకు భంగం కలుగకుండ చూడడం 4. మూడో ప్రపంచదేశాలను దోపిడీకి గురికాకుండ చూడడం 5. నూతన అంతర్జాతీయ ఆర్థిక సక్రమస్థితి ఏర్పాటుకు కృషి చేయాలి.

## అలీనోద్యమం – నిరాయుధీకరణ ప్రయత్నం

అలీనోద్యమం గడచినకాలంలో నిర్దుష్టమైనఅంశాలకు ప్రాధాన్యతనిచ్చింది. వాటిలో శాంతిని నెలకొల్పడం, రక్షణను పెంపొందించడం, సయోధ్య (Detente) ఏర్పడడానికి పూర్తి సహకారాన్ని అందించడం ఆయుధ నియంత్రణ, నిరాయుధీకరణకు ఇతోధికంగా కృషిచేయడం. క్షిపణులు, అణుయుద్ధం రాకుండ శాంతి, అంతర్జాతీయ రక్షణ ముఖ్య లక్ష్యంగా పెట్టుకొని ఉద్యమాన్ని కొనసాగించడం ముఖ్యమైనవి. కొత్తఢిల్లీ అలీనోద్యమ సమన్వయసంఘ సమావేశంలో అనేక సమస్యలలో అణుఇంధన భయం పెరగడాన్ని గూర్చి ఆందోళన వ్యక్తపరచింది.

అణుయుద్ధాలు, నిరాయుధీకరణ అంశాలు కేవలం నైతిక అంశాలుకావు. ఇది మానవాళి మనుగడ కొనసాగింపుకే సంబంధించింది. ఈ విషయంపై అలీనోద్యమం విశ్వవ్యాప్తంగాను, సంపూర్ణ నిరాయుధీకరణ అమలుజరిగేట్లు చూడాలంటుంది నిరాయుధీకరణ కొనసాగడానికి పూర్తి మద్దతును ప్రకటించింది. అంతేకాక అణు ఇంధన పరీక్షలను నిషేధించడం, అణురసాయన, బాక్టీరియా లాజికల్ ఆయుధాల ఉత్పత్తిని నిషేధించడం ప్రస్తుతం ఉన్న ఆయుధాల విస్తరణను అరికట్టడం, సైన్యంపై పెట్టిన, పెరుగుతున్న ఖర్చును తగ్గించడానికి ఆయాదేశాల మధ్య ఒప్పందం కుదిరేటట్లు చేయడం. కాలానుగుణంగా అణు నిరాయుధీకరణ కార్యక్రమం అన్ని దేశాలు చేపట్టడం వంటి విషయాలను కోరింది. సోవియట్ రష్యా ఈ నిర్ణయాన్ని ప్రశంసించింది. కాని పశ్చిమదేశాలు ముఖ్యంగా అమెరికా, చైనా అలీన దేశాల పిలుపును ఖాతరు చేయలేదు. అలీనదేశాల విదేశాంగ మంత్రుల సంఘం కొన్ని నిర్ణయాలను చేయడం జరిగింది. అందులో ఉపరితలం (Space) మానవులందరికి చెందిన ఆస్తి కనక దానిని కేవలం శాంతియుత కార్యక్రమానికి మాత్రమే ఉపయోగించాలి. అందరి ప్రయోజనాలకు ఉపకరించాలి. ఆయా దేశాల సాంకేతిక అభివృద్ధి ప్రాతిపదికపై ఉపరితలం అందుబాటులో ఉండాలి. ఈ విషయం చర్చించి దేశాల మధ్య ఒక సహకార ఒప్పందం కుదర్చాలని కోరింది. అమెరికా-రష్యాల మధ్య జరిగిన సహకార ఒప్పందాన్ననుసరించి ఉపరితలంలో ఏవిధమైన అణు ఆయుధాలను తయారుచేయడం, పరీక్షించడం లేదా ఆయుధాల నుంచడం నిషేధించాలని కూడా అలీనదేశాలు కోరాయి. అంతేకాక ఉపరితలంపై ఆయుధాలను పరీక్షించడం నిషేధించి ఉపరితలాన్ని ఆయుధరహిత మండలంగాచేసి, మానవ మారణహోమ ప్రమాదాన్ని నివారించాలని కూడా అలీనదేశాలు కోరాయి.

అలీన దేశాలు మొట్ట మొదటే శాంతియుత మండలాల ఏర్పాటుకు పిలుపు ఇచ్చాయి. ముఖ్యంగా మధ్యధరా సముద్ర తీర ప్రాంతం, లాటిన్ అమెరికా, హిందూ మహా సముద్రం, ఆఫ్రికా, మధ్య ఆసియా ప్రాంతాలు స్వేచ్ఛాయుత ఆయుధ రహిత మండలాలుగా గుర్తించాలని పేర్కొన్నాయి. ఇదే విషయాన్ని కొత్తఢిల్లీ రాజకీయ ప్రకటన కూడ అణుఆయుధ రహిత మండలాలను ఏర్పరచాలని పునరుద్ఘాటించింది. ఇది నిరాయుధీకరణలో ఒక ముందడుగు అని చెప్పవచ్చు. అలీన దేశ శిఖరాగ్ర సభలు తీసుకొన్న నిర్ణయాలు అంతర్జాతీయ సంస్థలకు, నిరాయుధీకరణ కమిటీలకు మార్గదర్శక సూత్రాలుగా పనిచేస్తున్నాయి. ముఖ్యంగా

ఐక్యరాజ్య సమితి దాని సంఘాలు అలీన దేశాలు ప్రతిపాదించిన సూత్రాలను దృష్టిలో ఉంచుకొని వ్యవహరిస్తున్నాయని చెప్పవచ్చు. ఉదాహరణకు అలీన దేశాల ప్రోత్సాహంతో ఐక్యరాజ్యసమితి సాధారణ సభ నిరాయుధీకరణపై ప్రత్యేక సమావేశం జరిగింది. అంతేకాక ఇటీవల కాలంలో అలీన దేశాలు ఐక్యరాజ్య సమితి సమావేశాల్లో నిరాయుధీకరణ అమలు జరగవలసిన అంశాలపై నిరంతరం ఘర్షణ పడుతూనే ఉన్నాయి. అదే రీతిలో అలీనోద్యమ దేశాలు తీసుకొన్న నిర్ణయాల ననుసరించి సోవియట్ రష్యా, తూర్పు దేశాలు వీరి కార్యక్రమాలకు పూర్తి మద్దతును ప్రకటించాయి. ఇటీవల జరిగిన సాధారణ సభ (1986) సమావేశంలో అంతర్జాతీయ వ్యవస్థాగత అంశాలు విభజితమైనాయి. అలీన, సోషలిస్టు దేశాలు ప్రపంచ పరిరక్షణము, సయోధ్యమ పటిష్ఠం చేసుకోవాలన్నాయి. కాని దాన్ని సామ్రాజ్య వాద దేశాలు వ్యతిరేకించాయి. అంతేకాక ఆయుధ పోటీని తీవ్రతరం చేయడం గమనార్హం.

నిరాయుధీకరణ అమలుకు అలీన దేశాలు తీసుకొన్న అంశాలను ప్రపంచ దేశాలు ప్రశంసించాయి. ఉదాహరణకు మూడు అలీనదేశాల నాయకులు (భారత్, అర్జెంటైనా, టాంజానియాలు) మరో మూడు శాంతికాముక దేశాలు(గ్రీసు,మెక్సికో, స్వీడన్‌లతో కలిసి) 1984 మే,లో అణుఆయుధ సంపత్తి ఉన్న దేశాలకు ఆ ఆయుధాల తగ్గింపుకు పిలుపు నిచ్చాయి. దీనికి రష్యా నుంచి అనుకూలమైన ప్రోత్సాహం లభించింది కాని పశ్చిమ దేశాలు కేవలం నోటి మాటకైన సాను భూతిని చూపలేదు కదా ఏ విధమైన సమాధానాన్ని కూడ ఇయ్యలేదు.

అదే విధంగా 1985-86 సంవత్సరంలో ఆ ఆరుదేశాల నాయకులు ప్రపంచ వ్యాప్తంగా ఆయుధ నిషేధానికి, ఆయుధాల ఉత్పత్తి నిషేధానికి, ముఖ్యంగా భూగర్భంలో జరిపే పరీక్షలు కొనసాగడంవల్ల కలిగే ప్రమాదం గురించి ప్రచారం చేశాయి. ఈ ఆరు దేశాల ప్రచార ఫలితంగా రష్యా ఏక పక్షంగా ఆగష్టు 6, 1985 నుంచి అంటే హిరోషిమాపై బాంబువేసిన దినం జరిపిన నాటి నుంచి అణు ఇంధన పరీక్షలను జనవరి 1, 1987 వరకు జరపరాదని నిశ్చయించి అమలు జరిపింది. అంతేకాక అణు ఆయుధాల మారిటోరియంకు ఈ ఆరు దేశాలిచ్చిన పిలుపుకు మద్దతును కూడ రష్యా ప్రకటించింది.

**అలీనోద్యమం దేశాల స్వాతంత్ర్య పరిరక్షణ :**

అలీనోద్యమ దృక్పథం పెత్తందారీ విధానం-దాని ఆధిపత్య ప్రభావం అభివృద్ధి చెందుతున్న దేశాలపై పడకుండ, దానికి వ్యతిరేకంగా పనిచేయడం అని చెప్పవచ్చు. 1986 ఏప్రిల్ ఢిల్లీలో జరిగిన అలీన విధాన సమన్వయ' సంఘ సమావేశంలో పాల్గొన్న విదేశాంగ మంత్రులు నికరాగ్వాపై అమెరికా చేసిన అప్రకటిత యుద్ధాన్ని వ్యతిరేకించాయి. క్యూబాలో ఉగ్రవాదాన్ని (Terrorism) అరికట్టడం అనే నెపంతో అమెరికా జరుపుతున్న కార్యక్రమాలను వ్యతిరేకించాయి. వాషింగ్టన్ ఇతరుల అంతర్గత విషయాలలో జోక్యం చేసుకోరాదని వ్యాఖ్యానించాయి. అంతేకాక అమెరికా, లాటిన్ అమెరికా దేశాల వ్యవహారాలలో జోక్యం కల్పించుకోరాదని వత్తిడి చేశాయి. ఈ సమన్వయ సంఘం అలీనోద్యమంలోని సభ్యత్వ దేశాలను, అంతర్జాతీయ సంస్థలను నికరాగ్వాకు బల సహాయం అందించాలని కోరాయి. అంతేకాక ప్రపంచదేశాల స్వయం నిర్ణయాధికారాన్ని స్వాతంత్ర్యాన్ని సార్వభౌమాధికారాన్ని వారి భౌగోళిక ఐక్యతకు భంగం వాటిల్లకుండ పరిరక్షించడం కోసం విజ్ఞప్తి చేశాయి.

అలీనోద్యమం, మధ్య ఆసియాలో ఇజ్రాయిల్ జరుపుతున్న కొత్త వలస వాదం పోకడలను వారిచర్యలను అణచి వేయాలని కోరింది. లువాండాలోను, ఢిల్లీలోనూ జరిగిన సమావేశాలలో మధ్య ఆసియా సమస్యల పరిష్కారానికి అంతర్జాతీయ సమావేశాన్ని ఏర్పాటు చేయాలని కూడ కోరింది. ఆ సమావేశంలో పాలస్తీనా విమోచన సంస్థ నాయకులకు స్థానం కల్పించాలనీ, తద్వారా మధ్య ఆసియా సమస్యలకు పరిష్కారాలను వెదకాలనీ కోరింది. అదేవిధంగా లిబియాపై అమెరికా చేసిన దాడిని వ్యతిరేకించింది. అలీనోద్యమం సభ్య దేశాలపై, ఇతర దేశాలపై దాడి చేయడంపై ఏకగ్రీవంగా తమ నిరసనను ప్రకటించాయి. ఢిల్లీ సమావేశంలో అమెరికా లిబియాపై జరిపిన దాడిని తీవ్రంగా ఖండించాయి. ఈ విషయం మీద ఐక్యరాజ్య సమితి సెక్రటరీ జనరల్‌కు ' ఇట్లాంటి చర్యలు ముందుముందు జరగకుండ చర్యలను తీసుకోవాలని విజ్ఞప్తి చేసింది.

ఢిల్లీ సమావేశం ప్రపంచంలో జరుగుతున్న ఉగ్రవాద చర్యలను కూడా నిరసించింది. అంతేకాక ఉగ్రవాద చర్యలకు పాల్పడిన వ్యక్తులను, వర్గాలను లేదా రాజ్యాలను తరతమ భేదం లేకుండా తీవ్రంగా ఆయుధ ప్రయోగం ద్వారా త్రిప్పి

కొట్టాలని ప్రతిపాదించింది. అయితే న్యాయబద్ధంగా జరిగే ప్రజాపోరాటాలకు జాతి విచక్షణ, వలసవాద వ్యతిరేకోద్యమాలకు ఆ సమావేశం చేయూతను ప్రకటించింది. దురాక్రమణ చేస్తున్న వారిని ఉగ్రవాదులకంటే ఎక్కువగా అణచివేయాలని కోరాయి. ముఖ్యంగా ఐక్యరాజ్యసమితి చార్టరు ప్రకారం దక్షిణ ఆఫ్రికా, నమీబియా, పాలస్తీనాలకు స్వయం నిర్ణయాధికారాన్ని స్వాతంత్ర్యాన్ని కల్పించాలని కోరాయి. పైన తెల్పిన ఆయా విషయాలకు సంబంధించి, అలీనోద్యమం ప్రోత్సాహం ఎప్పుడూ ఉంటుందని ప్రకటించింది. అలీనోద్యమదేశాలు తమతమ ప్రాంతాలలో ఉన్న విదేశీ సైనిక స్థావరాలను, వారి ఉగ్రవాదచర్యలను ఆ ప్రాంతాల నుంచి వైదొలగవలసిందిగా పిలుపునిచ్చాయి. హిందూ మహాసముద్ర పరివాహక ప్రాంతంలో ఉన్న మారిషస్‌ను సంపూర్ణ సార్వభౌమాధికారం కలిగిన దేశంగా ప్రకటించాలని, వాగోస్ ద్వీపసముదాయం నుంచి డిగోగార్షియా ద్వీపం నుంచి ఇతర దేశాలు తమ ఆయుధాలను తొలగించాలని,స్థావరాలను ఖాళీ చేయాలని అలీన దేశాలు విజ్ఞప్తి చేశాయి.

అలీనోద్యమం వివిధ ప్రాంతాలలో వలస వాదం వల్ల కలిగిన నష్టాలను కూడ తొలగించాలని కోరింది. ఆయా ప్రాంతాలలో వలస వాద రాజ్యాల ఆధిపత్యాన్ని పారద్రోలి.స్వాతంత్ర్యాన్ని పునరుద్ధరించాలని కోరాయి. వలస పోకడలను వివిధ రకాలైన దోపిడిని కొనసాగకుండ చూడాలని పిలుపు నిచ్చాయి. గతంలో జరిగిన వివిధ సమావేశాలలో అలీనోద్యమ దేశాలలోని మానవ వనరులను దోపిడి చేస్తున్న ట్రాన్స్‌నేషనల్ కార్పొరేషన్లను, వాటి విధానాన్ని ఖండించాయి. అదే రీతిలో నమీబియా, దక్షిణ ఆఫ్రికాలో జాత్యహంకార ప్రభుత్వం కొనసాగింపును దాని అక్రమ చర్యలను అంతమొందించాలని, ఆయా ప్రాంతాలకు స్వయం ప్రతిపత్తిని ఏర్పాటు చేయాలని అలీన దేశాలు వత్తిడిచేశాయి. అంతేకాక తమ స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న పశ్చిమ, దక్షిణాఫ్రికా ప్రజా వ్యవస్థకు మద్దతును ప్రకటించాయి. అట్లాగే అంగోలాలో, క్యూబా అంతర్జాతీయ దళం వైదొలగడానికి నమీబియా స్వాతంత్ర్యానికి ముడిపెట్టడం సమంజసం కాదనికూడ పేర్కొన్నాయి.

అలీనోద్యమం సమన్వయ సంఘం ఢిల్లీ ప్రకటనలో జాత్యహంకార ప్రిటోరియా ప్రభుత్వానికి మద్దతు తెలుపుతున్న దేశాలను నిరసించాయి. దక్షిణాఫ్రికా ప్రభుత్వం తన చుట్టు పక్కల దేశాలపై జరుపుతున్న దమనకాండను గర్హిం

ధాయి. ఈ విధమైన సమస్యలను పరిష్కరించడం కోసం సెప్టెంబర్‌లో 1986, హరారేలో సమావేశం జరిగింది. అందులో ప్రత్యేకంగ ఆఫ్రికా విషయాల సమన్వయ సంఘం ఏర్పాటు ఒక్కటే కాకుండా ఆఫ్రికా విముక్తికి సహాయకంగ ఆఫ్రికా ఫండ్‌ను భారతదేశం అధ్యక్షతన అలీన దేశాలు ఏర్పాటు చేశాయి. ఈ ఆఫ్రికా ఫండ్ నమీబియా, క్రొత్త కాలిడోనియా, పూరిటారికో, మాలవినాస్, మైక్రో నేసియా మొ॥న ప్రాంతాల స్వాతంత్ర్యం విషయంలో వెంటనే చర్యలను గైకొనాలని నిర్దేశించింది.

## అలీనోద్యమం - నూతన అంతర్జాతీయ ఆర్థిక సక్రమ స్థితి (NIEO)

కాలం గడచిన కొద్దీ అలీనోద్యమం సభ్యుల సంఖ్య పెరుగుతోంది. వారి కార్యకలాపాలు క్రొత్త పద్ధతిలో కొనసాగేటట్లు చర్యలు జరుగుతున్నాయి. అందులో అంతర్జాతీయ ఆర్థిక సంబంధాలలో వలసవాద ఆర్థికతత్వానికి స్వస్తి చెప్పి ఆర్థిక అసమానతలను రూపుమాపి నూతన అంతర్జాతీయ సక్రమ స్థితిని ఏర్పాటుచేయడం వంటివి పేర్కొనవచ్చు. ఈ దశాబ్దంలో అంతర్జాతీయంగా ఉన్న సమస్యలను ఎంచి వాటిని ప్రాంతీయంగా పరిరక్షించడానికి అలీనోద్యమం ప్రయత్నిస్తోంది. అలీనోద్యమ దేశాలు అమలులో ఉన్న పాక్షికమైన రాయితీల ద్వారానే ఆర్థిక వ్యవస్థను పునర్నిర్మించాలని కోరుతున్నాయి. అట్లా చేస్తే నూతన అంతర్జాతీయ సక్రమ స్థితికి అది తోడ్పడుతుందని ఆ దేశాలు భావిస్తున్నాయి. ప్రపంచమంతా ఆర్థికంగా ఈ సక్రమ స్థితి ఏర్పడాలని ఈ దేశాలు 1970 లోనే సూచించాయి. ఆ తర్వాత ఆర్థిక సక్రమస్థితి ఒక భావనగా ఎంపికచేసి అలీనోద్యమ కార్యక్రమంలో ఒక భాగంగా దానిని తీర్చిదిద్దారు. దానితో అలీనోద్యమం అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రాథమిక రాజకీయ వేదికగానే కాక తమ ఆర్థిక ప్రయోజనాలను సాధించుకొనడానికి ఎక్కువగా తోడ్పడుతుంది.

1983 ఢిల్లీలో అలీన దేశాల రాజ్యాధినేతల, ప్రభుత్వాధినేతల సమావేశంలో ప్రస్తుతం నెలకొన్న సక్రమంకాని స్థితి ఆధిపత్యం, ఆర్థిక విధానానికి స్వస్తి చెప్పాలని పేర్కొన్నది. అంతేకాక సమానత్వం ప్రాతిపదికగా నూతన అంతర్జాతీయ ఆర్థిక విధానాన్ని నెలకొల్పాలని నొక్కి చెప్పాయి. అభివృద్ధి చెందిన దేశాలు అభివృద్ధి చెందుతున్న దేశాలకు ప్రత్యేక రాయితీలను కల్పించవలసిన అవసరం ఎంతో ఉందని పేర్కొన్నాయి. అదే సమావేశం, పాల్గొన్న దేశాధినేతలకు అంత

ర్జాతీయ ద్రవ్య విధానంపై, ఆర్థిక సమస్యలపై అంతర్జాతీయ సమావేశాన్ని ఏర్పాటు చేయాలని సూచించింది. ఐక్యరాజ్యసమితి నలభయ్యో సమావేశంలో సభ్య దేశాలు నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు అంతర్జాతీయ ద్రవ్య పద్ధతిని పునర్వ్యవస్థీకరించవలసిన అవసరాన్ని చర్చించాయి.

అలీన దేశాలు రూపొందించిన ఈ నూతన అంతర్జాతీయ సక్రమ స్థితి, ప్రజాస్వామ్య పద్ధతి ననుసరించి అభివృద్ధి పథంలో మార్పులు రావాలని ఆశిస్తోంది. కాని ఈ నూతన అంతర్జాతీయ సక్రమ స్థితి సామ్యవాద దేశాల కార్యక్రమానికి దగ్గరగా ఉంటుంది. ఈ విషయంలో అలీన దేశాలు, సామ్రాజ్యవాద దేశాల ఉద్దేశ్యాలు ఒకటిగానే ఉన్నాయి. ప్రస్తుతం ప్రపంచంలో బహుళ జాతి సంస్థలు, అభివృద్ధి చెందుతున్న దేశాల వనరులను తీసుకొని పోవడమే కాక యుద్ధ పరికరాలను, సామగ్రిని కూడ తరలించి లాభార్జనలు చేస్తున్నాయి. అందువల్ల అభివృద్ధి చెందుతున్న దేశాలు ఋణ భారంతో కొట్టు మిట్టాడుతున్నాయి. కనక ప్రస్తుతం ఆయుధ పోటీని తగ్గించి, అణునిరాయుధీకరణను అమలుచేయడం ద్వారా ప్రపంచ శాంతిని కాపాడవచ్చు. కానీ అది ఆచరణ సాధ్యమా? అన్న ప్రశ్న ప్రశ్నగానే ఉంది. అంతేకాక అభివృద్ధి చెందుతున్న దేశాలకు ఆయుధీకరణవల్ల అభివృద్ధికి అవకాశాలు కలుగుతాయి. అందువల్ల సాంఘిక, ఆర్థిక వ్యవస్థను తీర్చిదిద్దుకోడంతో పాటు తమ రక్షణ స్వాతంత్ర్యాలకు మరింత ఎక్కువ బలం చేకూర్చుకోగలుగుతాయి అనేది యింకొక అభిప్రాయం.

## అలీనోద్యమం – పశ్చిమ దేశాల దృక్పథం

పశ్చిమదేశాలకు అలీనోద్యమంపట్ల, స్వతంత్ర రాజకీయ విధానంపట్ల, ఆర్థికాభివృద్ధి సాధిస్తున్న దేశాలపట్ల అయిష్టత, వ్యతిరేకత ఉంది. అందుచేత పశ్చిమ దేశాలు అలీనోద్యమాన్ని ఎందుకూ కొరగాని వ్యవస్థగాను, బలహీనుని చేతుల్లో ఉన్న ఆయుధంగాను, గోడమీద ఉన్న పిల్లివాటంగాను ముద్రవేశాయి. అలీనోద్యమాన్ని సామ్రాజ్యవాద వ్యవస్థకు వ్యతిరేకిగా గుర్తించి సభ్యదేశాల మధ్య చీలికల్ని తేవడానికి ప్రయత్నించాయి. అందులోని దేశాలు సోషలిస్టు దేశాల చేతుల్లో కీలుబొమ్మలని వర్ణించాయి. అమెరికా అలీనోద్యమాన్ని తప్పుడు మార్గంగా ఎంచింది. దానితో అమెరికా కొత్త ఖండాంతరవాదం (Neo-Globalism) పేరుతో తమ బలాన్ని, శక్తిని పెంపొందించు కుంటోంది. తన

సైనిక శక్తితో కొత్త వలసవాదాన్ని నిలద్రొక్కు కొనేటట్లు ఆయాదేశాలపై ఆర్థిక, సైనిక పరమైన దౌత్య, వత్తిడులను ప్రయోగిస్తోంది. ప్రపంచ ప్రజలపై అమెరికా కొనసాగించిన దండయాత్రలు కొరియా, వియత్నాం, చిలీలలో విప్లవానికి వ్యతిరేకంగా కొనసాగించినవే. ఉదా: గ్రెనడాలో అమెరికా సైన్యం, ఎల్ సాల్విడార్‌లో అమెరికా మద్దతు, హయితీ, హోండూరస్‌లలో అమెరికా కొనసాగింపు, నికరాగ్వాలో సాండినిస్టా విప్లవ ప్రభుత్వం తొలగింపుకు జరుగుతున్న కార్యకలాపాలు. ఈ దేశాలన్నీ కూడ అలీనోద్యమ దేశాలు కనక వాటిపై సామ్రాజ్యవాద దేశాలు నిరవధిక ప్రయత్నాలు కొనసాగిస్తున్నాయి.

అంతేకాక అలీనోద్యమంలోని దేశాలు తమ సంఖ్యాబలంతో ఐక్యరాజ్య సమితిని తమ వేదికగా ఉపయోగించుకున్నాయనే దురుద్దేశంకూడ ఉంది. అందుచేత ఐక్యరాజ్యసమితిని బలహీనం చేయడానికి పశ్చిమదేశాలు తమ బలగంతో కృషిచేస్తున్నాయి. 1986 సెప్టెంబరులో హరారేలో జరిగిన అలీన దేశాధినేతల శిఖరాగ్ర సమావేశం నూతన వలసవాదాన్ని విమర్శించింది దానితో పశ్చిమ దేశాలకు అలీనోద్యమం కంటగింపుగా తయారైంది. అందువల్ల ఈ ఉద్యమాన్ని ఏదో విధంగా మూకమ్మడిగా గాని, విడివిడిగాగాని దిగజార్చాలనే పాశ్చాత్య దేశాలు నిశ్చయించాయి. దానితో అమెరికా అడుగుజాడల్లో నడిచే ఇంగ్లాండ్ భారతదేశానికి వ్యతిరేకంగా ప్రచారసచట్టాన్ని కూడ చేసింది. అంతేకాక ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీలు తమ ఆయుధాలను అమ్ముకొని విపరీత లాభార్జన చేస్తున్నాయి. దానితో అభివృద్ధి చెందుతున్న దేశాలలో భయాందోళన కలుగజేస్తున్నాయి. మరొకపక్క పశ్చిమదేశాలు ఈ ఉద్యమదేశాలకు ఇస్తున్న ఆర్థిక సహాయాన్ని నిలిపివేయడం లేదా తగ్గించడమో చేసి కక్షసాధింపు చర్యలకు పాల్పడుతున్నాయి. అదేవిధంగా ఆయా దేశాల నిస్సహాయతను ఆసరాగా తీసుకొని అలీనోద్యమ దేశాలలో అంతరంగికంగాను బహిర్గతంగాను జోక్యాన్ని కల్పించుకుంటున్నాయి. అభివృద్ధిచెందిన దేశాల ట్రాన్స్ నేషనల్ సంస్థలు అలీనోద్యమ దేశాలలో, వారి జాతీయ ప్రయోజనానికి వ్యతిరేకంగా పనిచేస్తున్నాయి.

ఈ పశ్చిమదేశాలు వారిభావాలైన సమానంతరాన్ని, (**equidistance**) ఆధిపత్యాన్ని వీరిపై ఉపయోగిస్తున్నాయి. అంటే పెట్టుబడిదారి దేశాలు-సామ్యవాద దేశాల భావాలకు సమానంగ దూరంగా ఉండాలనే భావనతో; మధ్యమార్గమైన సంక్షేమరాజ్య స్థాపనకు తోడ్పాటు అందించి, ఆయా దేశాలలో తమ ఆధిపత్యాన్ని

ఏర్పరచుకొంటున్నాయి. ఇటీవల కాలంలో అలీనోద్యమం వల్ల వచ్చిన మార్పులు అంటే అన్ని దేశాలలో కాకపోయిన కొన్ని దేశాలలో వచ్చిన మార్పులను పశ్చిమ దేశాలు తమవైపుకు త్రిప్పుకోడానికి శత విధాలుగా ప్రయత్నిస్తున్నాయి. ఈ ఉద్యమంలోని కొన్ని దేశాలు అలీన విధానాన్ని పునఃపరిశీలించాలని, అది స్వేచ్ఛమైన అలీనవిధానమో, శుద్ధమైన అలీనవిధానమో, సమాంతర విధానమో తెలియని సాంఘిక-రాజకీయ వ్యవస్థలకు దూరంగా ఆధునిక ప్రపంచంలో కొనసాగుతున్న ఒక భిన్నమైన విధానం అని ప్రచారం చేస్తున్నాయి. అంతేకాక సామ్యవాదదేశాలకు దూరంగా ఉండేట్లుగా జాగ్రత్తపడుతున్నాయి. అలీనవిధానం-స్వేచ్ఛాస్వాతంత్ర్యాలపై నిర్మితమైంది కనక ఆశయాలకోసమే కొనసాగాలని ప్రచారం చేస్తున్నాయి. ముఖ్యంగా, అలీనోద్యమం మధ్య మార్గాన్ని అవలంబించి తటస్థతను, సమతౌల్యాన్ని కాపాడుతూ పెత్తందారీ విధాన వ్యతిరేకతను మార్చుకోవాలంటున్నాయి. సోవియట్ రష్యాతో ఉన్న సంబంధాలను బలహీనపరచాలని పశ్చిమదేశాలు ప్రయత్నిస్తున్నాయి. అంతేకాక అభివృద్ధి చెందుతున్న దేశాలకు సహాయపడవలసిన సమాన బాధ్యత (equi - Responsibility) ఉందని ప్రచారం చేస్తున్నాయి. వెనుకబడిన దేశాల, వెనకబడినతనాన్ని పారద్రోలి, రక్షణ కల్పించడంవల్ల పశ్చిమ - తూర్పుదేశాలకు సమానమైన బాధ్యత ఉంది అంటున్నాయి. ఈ వాదనలో భాగంగా అలీనోద్యమంలో సభ్యదేశాలైన ఆఫ్ఘనిస్తాన్, కంపూచియా, లావోస్ సమస్యలపై పశ్చిమదేశాల వాదనను సమర్థిస్తున్నాయి.

## అలీనోద్యమం - సోవియట్ రష్యా :

సోవియట్ రష్యా మొదటినుంచి అలీనోద్యమ దేశాలకు వారి ఆదర్శాలకు, శాంతియుత ఉద్దేశాలకు ప్రోత్సాహాన్నిస్తూ సన్నిహితంగానే ప్రవర్తిస్తోంది. అలీనోద్యమ సమావేశాలలో తీసుకొన్న వివిధ అంతర్జాతీయ అంశాలపై నిర్ణయాలను సమర్థిస్తూనే ఉంది. ప్రపంచ రాజకీయాలలో అలీనోద్యమ ఆశయాలను, ఉద్దేశాలను ప్రశంసిస్తూ వారి కార్యక్రమాలకు ప్రోత్సాహాన్నిస్తోంది.

అలీనోద్యమదేశాల రాజకీయ ప్రయోజనం, రష్యా ప్రయోజనాలు ఒకే మాదిరిగా ఉండడంతో అంతర్జాతీయ, శాంతి రక్షణల స్థాపనవిషయంలో ఇవి దగ్గరగానే వ్యవహరిస్తున్నాయి. ఈ రెండువర్గాలకు చెందిన దేశాలు నిరాయుధీకరణకు, వలసవాద, సామ్రాజ్యవాదాలకు వ్యతిరేకిస్తూ, జాతీయోద్యమాలకూ

స్వాతంత్ర్యోద్యమాలకు మద్దతునిస్తున్నాయి. రష్యా అంతర్జాతీయ ఆర్థిక సంబంధాలను పునర్నిర్మించడంలో ప్రాథమిక సహాయసహకారాలను అందిస్తోంది.

పెరుగుతున్న ప్రపంచ సామ్యవాదపద్ధతిని, జాతీయ విమోచనోద్యమాలను దృష్టిలో ఉంచుకొని అలీనోద్యమం దానియుక్యోద్దేశాలను అంతర్జాతీయంగ వృద్ధి చేసుకుంటున్నది అల్లే అగ్రరాజ్యాల పెత్తనాన్ని కూడ వ్యతిరేకిస్తున్నది. సోవియట్ రష్యా కమ్యూనిస్టు పార్టీ అలీనోద్యమ దేశాలతో సహకారాన్ని పెంపొందించుకుంటోంది. రష్యా కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలతో స్నేహం సహకారం నెరపడానికి, దాన్ని బలపరచడానికి కమ్యూనిస్టు పార్టీ ఎక్కువగా కృషి చేస్తోంది. ఆయా దేశాలలో అది దాని స్థిరత్వానికి కూడ కృషి చేస్తోందని ఒక వాదం కూడా ఉంది. అందువల్ల రష్యా ఆఫ్ఘనిస్తాన్‌లో సైన్యాన్ని ఉంచినా అలీన దేశాలు విమర్శించకుండ కేవలం వైదొలగాలని సలహా మాత్రమే ఇచ్చాయి. కాని ఏ సమావేశంలోనూ రష్యా విధానానికి వ్యతిరేకంగా ప్రతిపాదనలు చేయలేదు. అంటే రష్యానుంచి అలీనోద్యమదేశాలు వ్యక్తిగత ప్రయోజనాలను ఆశించడంవల్ల ఆ సైనిక చోద్యాన్ని ఖండించలేదు అని స్పష్టమవుతుంది. దీనివల్ల, అలీనోద్యమంలోని దేశాలకు ఆ ఉద్యమం ప్రాథమిక సూత్రాలపై వారికి ఎంత గౌరవం ఉందో విశదమవుతుంది. అంటే ఆ దేశాలు ఉద్యమ లక్ష్యసాధనకంటే తమ తమ ప్రయోజనాలకే ఎక్కువ ప్రాధాన్యత నిస్తున్నాయని తెలుస్తుంది. కనక ఈ ఉద్యమం నిష్పక్షపాత ధోరణిని శకించక తప్పదు. ఒక వర్గం మరొక వర్గంవైపుకు మళ్ళినపుడు ఆ దేశాలు ప్రపంచ రాజకీయాలతో తమ ప్రాథమిక విలువల్ని కోల్పోక తప్పదు. కనక ఇలాంటి చర్యలకు బాహాటంగా పాల్పడకుండడం ఈ ఉద్యమం మొత్తానికి శ్రేయోదాయకం, లేనియెడల మిగతా ఆదర్శాలమాదిరిగానే ఈ అలీనోద్యమంకూడా కాల గర్భంలో కలిసిపోయే ప్రమాదం ఉంది.

**ముగింపు :**

ఏదిఏమైనా అలీనోద్యమం అంతర్జాతీయ రాజకీయాలలో ఒక శక్తివంతమైన వ్యవస్థగా అవతరించింది అంతేకాక ప్రపంచ రాజకీయాలలో మూడో వర్గంగా పనిచేస్తూ ప్రపంచ ప్రజలను యుద్ధముఖం నుంచి దూరంచేస్తూ ప్రపంచ శాంతి, రక్షణలకు ఇతోధికంగా సహాయం చేస్తోంది. ప్రపంచ రాజకీయాలలో ఉన్న ఘర్షణలను,ఉద్రిక్తతలను తగ్గించి చిన్న చిన్న దేశాల సంరక్షణ,శ్రేయస్సు

లకు ఈ ఉద్యమం ఒక మార్గాన్ని ఏర్పరచింది. ఈ అలీనోద్యమం ప్రపంచ దేశాలలో ఉన్న ద్వైపాక్షిక విరుద్ధ పరిస్థితులను పోగొట్టలేక పోయినా ప్రపంచం మొత్తంగా ఆయుధీకరణను, సైనిక చర్యలను తీవ్రస్థాయికి చేరకుండా తగ్గించి ఆయా దేశాలలో ఆత్మస్థైర్యాన్ని పెంపొందించడానికి తోడ్పడుతుంది. కనక అలీనోద్యమం తమ స్థాయికి తగిన విధంగా ప్రపంచ రాజకీయాలలో నిలకడ ఉండడానికి తోడ్పడుతుంది. ఇలాంటి ఉద్యమం కలకాలం కాకపోయిన విజయవంతంగా కొనసాగాలని ఆశిద్దాం.

## సంప్రదించిన రచనలు :


1. K. P. Misra Quest for International Economic order in the Indian ocean (New Delhi allied, pub 1987)
2. K. P. Misra. Non-alignment : Frontiers and Dynamics, New Delhi. Vikhas pub. 1986)
3. Krishna Gopal, Non-alignment and Power Politics- A Documentary studies (New Delhi, V.I. pub 1983)
4. S. C. Gaugal. Non-alignment and Third world: Convergence and divergencies. International Studies (New Delhi) Vol. 20, No. 1-2
5. Fidel castro, The Economic & Social Crisis : A Report to 7th NAM Conference (New Delhi, PPH, 1983)
6. Seventh NAM Reports, The Hindu March, 1983.
7. Eighth NAM Reports, The Hindu, October, 1986.
8. M. A. Zagarshah, India and Super Powers (New Delhi, Vikhas pub, 1986)
9. J. W. Burton, International Relations (New Delhi, Sterling pub, 1963.)

# 8. ప్రచ్ఛన్న యుద్ధానంతరం-అలీన విధానం

అలీన విధానం ఒక దేశం ఏ సైనిక వర్గంకు చెందకుండ స్వయం నిర్ణయాధికారం కలిగి స్వతంత్ర్య విదేశాంగ విధానంను కలిగి ఉండుటయే. అంతేగాక ప్రచ్ఛన్న యుద్ధానికి దూరంగా ఉండి అగ్రరాజ్యాల ఆధిపత్యంను వ్యతిరేకిస్తూ స్వతంత్రంగా ప్రపంచ రాజకీయాలలో వ్యవహరించుటయే. 1980వ దశకపు చివరి సంవత్సరాలలో ప్రపంచరాజకీయ వ్యవస్థలో విప్లవాత్మకమైన మార్పులు సంభవించాయి. అందులో ముఖ్యంగా చెప్పుకొనదగిన మార్పు ప్రపంచ రాజకీయాల నుండి ప్రచ్ఛన్న యుద్ధం వైదొలగి నూతన సంబంధాలు ఏర్పడడం. అగ్రరాజ్యంగ సోవియట్ రష్యా తన స్థానంను వదలుకొని అంతర్గతంగా అధ్యక్షుడు గోర్బాచేవ్ నాయకత్వాన పెరిస్త్రాయిక, గ్లాస్‌నాస్ట్ విధానం ద్వార నూతన మార్పులు ప్రవేశపెట్టబడినాయి. అమెరికాయే నేడు ఏకైక అగ్రరాజ్యమైంది. కాని, అధికారం, నియంత్రణ తన వర్గ దేశాలలో తగ్గిపోయింది. పశ్చిమ జర్మనీ, తూర్పు జర్మనీ కలయిక ఏకైక జర్మనీ ఏర్పడి ఐరోపాలో నూతన సంబంధాలు ఏర్పడినాయి

అదే విధంగా గత నలభై సంవత్సరాల నుండి ప్రత్యేక గుర్తింపును పొందిన అలీన విధానంను సుమారు 102 దేశాలు కలిసికొని సాగిస్తున్నాయి. నేడు ప్రచ్ఛన్న యుద్ధం తొలగిపోవడంతో నేటి అలీన విధానం స్థితిగతులు ఏమిటి? ఎంతవరకు తన స్థానంను నిలబెట్టుకొన గలదు? ఏ విధంగా తన లక్ష్యాలను నెరవేర్చగలదు? అంతేగాక అలీన విధానం యొక్క ప్రధాన లక్ష్యం ప్రచ్ఛన్న యుద్ధానికి దూరంగా ఉండుటయే కదా! ఆ ప్రచ్ఛన్న యుద్ధానంతరం ఈ విధానం ఏ లక్ష్యాలలో ముందుకు కొనసాగుతుంది.

అలీన విధానం ప్రచ్ఛన్న యుద్ధానంతరం ప్రపంచ రాజకీయాలనుండి తొలగడంలేదు. అది నూతన ప్రాణంను పోసుకొని నూతన లక్ష్యాలతో ప్రచ్ఛన్న యుద్ధానంతర రాజకీయ వ్యవస్థలో తన నిజమయిన పాత్ర నిర్వహించగలదు. అలీన విధానం ద్వైపాక్షిక స్పర్ధలకు అతీతం. ఎందుకంటే ద్వైపాక్షికంగా వివిధ దేశాల సంబంధాలను గనుక పరిశీలించినట్లయితే అలీన దేశాల సభ్యదేశాలతో

అనేక భేదాలున్నాయి. అందుకనే ఇటీవల జరిగిన అలీన దేశాల విదేశాంగ మంత్రుల సమావేశంలో ద్వైపాక్షిక విభేధాలకు వ్యతిరేకం. అన్ని సభ్యదేశాలు అంగీకరించాయి. ఎందువలనంటే పాకిస్థాన్ విదేశాంగ మంత్రి కాశ్మీరు సమస్యను ప్రస్తావించినపుడు ఆ సమస్యను గూర్చి ఏ దేశం పట్టించుకొనలేదు. అదే విధంగా మధ్య ఆసియా దేశాలలో అనేక రాజ్యాల మధ్య ద్వైపాక్షిక విబేధాలున్న అలీన విధానం యొక్క దీర్ఘ కాలిక లక్ష్యాలయిన సామ్రాజ్య విధానంకు, వలస వాద విధానంకు, ఆర్థిక ఆధిపత్యంకు, నల్ల జాతీయులపై కొనసాగిస్తున్న అపార్థెయిడ్‌కు వ్యతిరేకత, సైనికాధిపత్యంకు వ్యతిరేకంగా పోరాడడం వాటి లక్ష్యాలుగా విశదీక రించడం జరిగింది. అదే విధంగా 'నామ్' విదేశాంగ మంత్రుల సమావేశంలో వారి ఐక్యతను, ఉద్యమం పట్ల వ్యక్తపరచడం జరిగింది.

**అలీన విధానం—ప్రపంచ రాజకీయాలు :**

అలీన దేశాల విదేశాంగ మంత్రుల సమావేశంలో ప్రపంచ రాజకీయాలలో వచ్చిన మార్పులు ప్రచ్ఛన్నయుద్ధం అంతరించడం, అగ్రరాజ్యాల మధ్య సయోధ్య, జర్మనీల ఏకీకరణ, రష్యా ఇతర ఐరోపా దేశాలలో వచ్చిన మార్పులును ఆహ్వా నించాయి. మధ్య ఆసియా దేశాలలో జాతీయవాదం, బాల్టిక్ దేశాలలో జాతీయ వాదంను రేకెత్తించడం ఏకపార్టీ ఆధిపత్యం నుండి వైదొలగి, తూర్పు ఐరోపా దేశాలు మిశ్రమ ఆర్థిక వ్యవస్థను హర్షించాయి. అదే విధంగా అమెరికా యొక్క సైనిక వ్యవస్థ పెంపుదల మూలంగా అనేక ఆర్థిక లోటుపాటులు ఏర్పడి అమెరికా తన ఆధిపత్యం వలన లాభాలును పొందే దేశం నేడు అన్నింటికంటే అప్పులున్న దేశంగా మారడంతో తన నియంత్రణలో పునాదులు సడలినాయి.

ఈపై మార్పులతో అలీన విధానం ప్రపంచ రాజకీయాల పాత్రను సైనిక విధానంకు, ప్రచ్ఛన్న యుద్ధానికి వ్యతిరేకతను విడనాడి;- ఆకలి దరిద్రం పార ద్రోలడం, అనారోగ్య పరిస్థితులను రూపుమాపడం, మానవ సంక్షేమాల అభివృద్ధి వైపు తమ దృష్టిని మళ్ళించాయి. వీటి ద్వార ప్రపంచ మానవ కళ్యాణానికి కృషి చేయడం లక్ష్యంగా పెట్టుకొన్నాయి.

ఇటీవల వచ్చిన రాజకీయ మార్పుల ఫలితంగా, దక్షిణాశియా దేశాలలో ఇండియా యొక్క పాత్రగాని అలీన విధానం ఆవశ్యకత పెరిగిందే కాని తగ్గలేదు. ఎందుకంటే పాకిస్తాన్, అమెరికాకు ఇదివరకులాగ అవసరంలేదు. ఎందుకంటే

అమెరికా, రష్యాల, మధ్య ప్రచ్ఛన్నయుద్ధం, అధికారం కొరకు పోటీ పడక పోవ డంతో పాకిస్తాన్ అవసరత అమెరికాకు తగ్గింది దానితో సైనిక వ్యయంను పాకిస్తాన్‌కు యిచ్చుటలో ఎన్నో ఆంక్షలను విధించుచున్నది. అంతేకాక ఇటీవల గల్ఫ్ సమస్యతో అమెరికాకు ఇండియా యొక్క పాత్ర అవసరత ఏర్పడింది. సంభాషణలు కొనసాగించడంలోను, అమెరికా ప్రతిపాదించిన బహుముఖ సైనిక చర్య ఐక్యరాజ్య సమితి సేనల ఆధ్వర్యంలో నిర్వహించాలంటే ఇండియా-దాని అలీన దేశాల మద్దత్తు ఎంతో అవసరం. అంతేకాక మారుతున్న రాజకీయాల దృష్ట్యా రాజకీయ రంగంలో అలీన దేశాల యొక్క ప్రాధాన్యత ఎంతైన ఉంది. అమెరికా గల్ఫ్ ప్రాంతంలో తమ ప్రయోజనంను కాపాడుకొనవలె నంటే ఐక్య రాజ్య సమితిలో తమ ప్రతిపాధనలు నెగ్గాలి. అంటే అలీన దేశాల మద్దత్తు అవ సరం. కనుక ఏ విధంగా చూచిన అలీన విధానపాత్ర పెరుగుతుంది.

కనుక ఇండియా తన అలీన దేశాలలో స్థానం నిలబెట్టుకొనవలెనంటే గల్ఫ్ ప్రాంతంలో యుద్ధం రాకుండ శాంతియుతంగా పరిష్కారంను కనుగొనవలసిన ఆవశ్యకత ఎంతైన ఉంది.

## అలీన విధానం - ఇరాక్-కువైట్ ఆక్రమణ సమస్య :

అలీన విధానం ఇరాక్ కువైట్‌పై జరిపిన కబళింపు చర్యను ఎదుర్కొనడం కత్తిమీద సామువంటిది. ఐక్యరాజ్యసమితి యొక్క వత్తిడి వలనైతే నేమి, తన పాత్ర ప్రాధాన్యతను నిలబెట్టుటకైతేనేమి అలీన విధాన దేశాలు మొట్టమొదటి సారిగా ఇరాక్—కువైట్‌పై జరిపిన దురాక్రమణ కబళింపు చర్య మాకు అంగీకారం కాదని ప్రకటించాయి. న్యూయార్క్‌లో 100 అలీనదేశాల విదేశాంగ మంత్రులు పై విధంగా ప్రకటన గావించారు. అందులో ఇరాక్ ఆక్రమించిన కువైట్ నుండి వెంటనే వైదొలగడం, కువైట్ న్యాయబద్ధమయిన ప్రభుత్వంను తిరిగి పునరుద్దరిం చడం. కువైట్ యొక్క భౌగోళిక ఐక్యతను, సార్వభౌమాధికారంను పరిరక్షించ ధము. అన్ని దేశాలు ఐక్యరాజ్య సమితి యొక్క ప్రతిపాదననుసరించి ఇరాక్ వెంటనే కువైట్ నుండి వైదొలగడంను సమర్థించుచున్నాయి. అంతేకాకుండ ఇరాక్ జరిపిన దురాక్రమణను అన్ని అలీనదేశాలు తీవ్రంగా వ్యతిరేకించు చున్నాయని ప్రకటించాయి.

అంతేకాకుండ అలీన దేశాల చైర్మన్ యుగోస్లోవియాను ఇరాక్ సమస్యను

శాంతియుతంగా పరిష్కరించడానికి ఐక్యరాజ్యసమితి ప్రతిపాదన అమలు పరచ డానికి సహాయపడవలసినదిగా కోరాయి. దీనితో అలీనదేశాలు ప్రపంచ రాజకీయాల మార్పు దృష్ట్యా ఈ చర్యను తీసుకొనుటతో చాల ముందంజ వేసిందని చెప్పవచ్చును. అదే విధంగా అమెరికా కేవలం ఇరాక్ విషయంలోనే ఐక్యరాజ్య సమితి ప్రతిపాదనలను అమలు చేయడానికి/జరపాలని కోరుతుంది. యిదివరకు ఇజ్రాయిల్, పాలస్తీనీయులపై కొనసాగించిన హత్యాచారాలపై ఇంత పట్టు పట్టడం లేదని అనుమానం వస్తుంది. కనుక అమెరికా తన ఇజ్రాయిల్‌పై దృక్పథంతో మార్పు వచ్చిందని చెప్పవచ్చు. కాని ఈ అలీన విధానంను అమలు ప్రస్తుత పరిస్థితులలో చాల ప్రముఖపాత్ర వహించు తుందనడం సత్యం దూరం కాదు.

## అలీన విధానం - ఆర్థిక సమస్యలు :

అలీన విధానం యొక్క ముఖ్యోద్దేశ్యము ఆర్థిక వలస వాదంకు, నూతన వలసవాదంను వ్యతిరేకించుటకంటే ఆర్థిక సహాయం అనే పేరుతో ఆయా దేశాలను, అదుపులో పెట్టుకొనడంనకు వ్యతిరేకం. ద్వైపాక్షికంగా విదేశీ సహాయం, సాంకేతిక పరిజ్ఞానంను పొందడం సమాన ప్రాతిపదికపై ఒప్పందంను కుదుర్చు కొనటం చేయవచ్చును. కాని అలీన విధానంను అనుసరిస్తున్న దేశాలు చాల వరకు ఆర్థికంగా స్వతంత్ర్యం లేని దేశాలు కనుక ఆర్థిక సహాయం పేరుతో ఏదో వైపు మొగ్గు చూపడం సహజం.

ఇటీవల లాటిన్ అమెరికా అలీన దేశాలు స్వతంత్ర్య విదేశాంగ విధానం స్వయం సమృద్ధితో కూడిన ఆర్థిక విధానంను గూర్చి ఎక్కువగా చెప్పుచున్నాయి. బ్రెజిల్, మెక్సికోలు వాటి ఆర్థిక వ్యవస్థను, వ్యాపారంను ఉత్తర అమెరికా ఆర్థిక వ్యవస్థలతో ముడిపడి ఉన్న దేశాలు కూడ స్వతంత్ర ఆర్థిక వ్యవస్థ, విదేశాంగ విధానంను గూర్చి మాట్లాడుచున్నాయి. ఏది ఏమైన అలీన దేశాలు సహజ వనరులు సమృద్ధిగా వున్న వాటిని వినియోగించుకొనే స్థితిలో లేవు. ఏదో విధంగా ఆర్థిక పెత్తందారీ విధానంనకు తలయొగ్గి తమ ఆర్థిక స్వేచ్ఛను కాపాడుకొనలేక పోతున్నాయి. అలాంటి స్థితినుండి బయటపడాలంటే పరస్పర వైషమ్యాలును పక్కకు పెట్టి కలిసి కట్టుగా ఆర్థికాభివృద్ధికి కృషి చేసిననాడు పూర్తి ఆర్థిక స్వతంత్ర్యాన్ని పొందగలవు.

## అలీన విధానం - ఐక్యరాజ్య సమితి :

నేడు ఏర్పడిన ప్రపంచ రాజకీయ పరిస్థితుల దృష్ట్యా ఐక్యరాజ్యసమితి నూతన పాత్రను పొందింది. ఎందుకంటే రెండు వర్గ రాజకీయాలలో వైషమ్యాలు వైదొలగి బహుముఖ సంభాషణలు, చర్చలకు ప్రాధాన్యత లభించింది. దానితో ప్రపంచ దేశాలన్నీ అంగీకరించిన సంస్థ ఐక్యరాజ్య సమితియే. గతంలో దీని నిర్ణయాధికారాలు, అమలు చేయుటలో ప్రతి కూలతలను, వర్గ రాజకీయాలను ఎదుర్కొనెడిది. వాటి బలం వలన ఏ దేశంపై ఆంక్షలు విధించడం జరిగిందో ఆ దేశం, వర్గంయొక్క మద్దతు ఉండుట వలన అమలు జరిపేది కాదు; కాని నేడు ఐక్యరాజ్య సమితి బలంను పుంజుకొంది. కనుక అలీన విధానం కూడా తన పాత్రను మరోసారి పరిశీలించుకొని ప్రస్తుత పరిస్థితుల కనుకూలంగా మార్చుకొన వలయును.

దీనినే ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి అలీనదేశాల విదేశాంగ మంత్రుల సమావేశంలో మాట్లాడుతూ ప్రస్తుతం అంతర్జాతీయ రాజకీయ వ్యవస్థలో వస్తున్న మార్పులను చాలెంజ్ తో ఎదుర్కొన వలసిన అవసరం ఉందన్నారు. అదే విధంగా దేశాలు ఎదుర్కొంటున్న సమస్యలకు శాంతియుతమైన నిజంగా అమలు పరచదగిన పరిష్కార మార్గంను బహుదేశాలతో కూడిన ఆర్థిక సంభాషణలను, జాతీయ ప్రయోజనంలను పునః వ్యవస్థీకరించుకోవడం, ద్వైపాక్షిక ప్రాంతీయ సమస్యల పరిష్కారంకు మార్గం అన్వేషించాలన్నారు.

అదే విధంగా అలీన విధానం పై విషయాలను సాధించడానికి ఎప్పటినుండో కృషిచేయుచున్నది. కనుక ఇంకా సమర్థవంతమైన మానవ వ్యవహారాలను పరిష్కరించి పెద్ద పాత్ర నిర్వహించ వలసిందన్నారు. కనుక నేడు అలీన దేశాలు ఐక్యరాజ్య సమితి నిజమైన అంతర్జాతీయ సంస్థ ప్రతిపత్తిని సంతరించుకొన్నది గనుక చిన్నదేశాల రక్షణ వాటి పీడనలను తొలగించడానికి ఎక్కువుగా పాటు పడవలసి ఉంది.

## అలీన విధానం - నూతన అధ్యాయం :

ప్రచ్ఛన్న యుద్ధానంతరం అలీన విధానంకు నూతన దృక్పధం, లక్ష్యాలను ఏర్పరచుకొంది. అది అలీన దేశాలలో పేదరిక నిర్మూలం, ఆరోగ్య సదుపాయాలను కల్పించడం ఆర్థిక పటిష్టత్వంకు కృషి చేయడం. ఈ లక్ష్యాలను సాధించడానికి

దక్షిణ–దక్షిణ దేశాల మధ్య సహకారంను పెంపొందించి సమస్యల పరిష్కారంకు కృషి చేయడం. అదే విధంగా దక్షిణ దేశాలమధ్యనున్న పరస్పర అనుమానాలను తొలగించడం. ఈ దేశాలలో నున్న సహజ వనరుల నుపయోగించి వారి సమస్యలను పరిష్కారంకు కృషిచేయడం. అభివృద్ధి చెందిన దేశాల మధ్య పరస్పర సహాయం. సహకారాలను పెంపొందించడం-నూతనంగా ఏర్పడిన వ్యాపార వర్గాల మధ్య సమన్వయం చేకూర్చడం ఆయా అలీన దేశాల మధ్య సాంకేతిక సహకారంను పెంపొందించి సాంకేతిక మార్పిడి కోసం కృషి చేయుట,అలీన దేశాల మధ్య యిచ్చి పుచ్చుకొనడంను వృద్ధి చేయడం, ఆయా దేశాల మధ్య మానవ వనరులకు సంబంధించిన అంశాలను గూర్చి చర్చించి సరియైన సమాధానంను కనుగొనేలా చూచుట.

అన్నింటికంటే ముఖ్యంగా అలీనదేశాలు వాటి అంతర్గత సమస్యలు, సాంఘిక సమస్యలను చక్కబెట్టుకొనవలసిన అవసరం ఎంతైన ఉంది. అదే రీతిలో వాటి మధ్యనున్న ద్వైపాక్షిక వైరుధ్యాలను వదలిపెట్టి చుట్టుప్రక్క దేశాలతో మంచి సంబంధాలను పెంపొందించు కొనవలయును. మరో ముఖ్యమైన అంశం ఏమంటే అలీన దేశాలు తమ యొక్క రక్షణ వ్యయంను నియంత్రణ చేయడం ఆయుధాల మీద హెచ్చించు చున్న ఖర్చును పూర్తిగా తగ్గించవలసి ఉంది. ఆ వ్యయంను అభివృద్ధి కార్యక్రమాలవైపు మళ్ళించి ఆర్థిక పురోభివృద్ధిని సాధించాలి. రాజకీయంగా అలీనదేశాలు తమ పాత్రను శ్రద్ధతో నిర్వహించవలసి ఉంది. ఎందుకంటే ఇటీవల ఇరాక్-కువైట్‌ను కబళించడం అలీనవిధానంకు పెద్ద గొడ్డలి పెట్టు అయింది. పరస్పర రక్షణ విషయాలు రాజకీయచర్చల ద్వారా తీర్చడం ఎంతైన అవసరం. ఇరాక్-కువైట్‌పై జరిపిన చర్యను చాల సున్నితంగా పరిష్కరించ వలసిన అవసరం ఉంది. ఎందువలనంటే ఈ చర్య వలన ముందు ఈ దేశాలే ఆర్థిక వత్తిడులకు గురి అయ్యాయి. మొత్తం ఈ దేశాలకు లభించుచున్న ఆయిల్‌లో మూడు వంతులు గల్ఫ్ దేశాల నుండి లభిస్తుంది గనుక సమస్య నుండి అటు తొలగిన యిటు తొలగిన దెబ్బతినేవి మూడవ ప్రపంచ దేశాలు కనుక ఈ సమస్య పరిష్కారంలో అలీన దేశాలలో ఇండియాకు ఒక స్థానం ఉంది. ఆ స్థానంను వినియోగించి సమర్థవంతంగా పరిష్కార మార్గంను అన్వేషించవలసింది. ఇండియా అశాశ్వత సభ్యురాలుగా జనవరి 1992 నుండి ఐక్యరాజ్య సమితి రక్షణ సంఘంలో చేరుతుంది. ఈ కువైట్ సమస్యను అమెరికా యుద్ధం ద్వారా సరిచేయాలని

చూస్తుంది. అలాంటి పరిస్థితులలో గల్ఫ్ ప్రాంతంలో యుద్ధం రాకుండ చూడడం అన్ని వర్గాలకు శ్రేయస్కరం. ఆ సమస్యను బహుముఖ చర్చల ద్వారా, ఐక్య రాజ్యసమితి మధ్యవర్తిత్వం ద్వారా పరిష్కరించవలసిన బాధ్యత ఇండియా-దాని అలీన దేశాలపై ఆధారపడి ఉంది

**ముగింపు :**

అలీనదేశాలు ఈ మారుతున్న కాలంలో తమ యొక్క స్థానంను, పాత్రను సమర్థ వంతంగాను పంచ రాజకీయాలలో నిలబెట్టుకొనవలసిన పరీక్షా సమయం వచ్చింది. కనుక నిరూపించు కొనవలె ముఖ్యంగా అలీన దేశాలు మానవ సమస్య లను పరిష్కరించడాని ఆయుక్త మవ్వవలయును. వీటితో పాటు ఈ దేశాల యొక్క స్వతంత్ర్య విదేశాంగ విధానంను నిలబెట్టు కొనుటకు కృషి చేయాలి.

ఇదే ఆశయాలతో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ 1940 లలో,1950 లలో కృషి చేయడానికి ప్రయత్నించారు. కాని ప్రచ్ఛన్న యుద్ధం తీవ్రత వలన ఆ ఆశయాలను పూర్తిగా సాధించ లేక పోయారు. నేడు ప్రచ్ఛన్న యుద్ధం వాటి ఛాయలు మటుమాయం అయ్యాయి, అవుతున్నాయి. కనుక అలీన విధానం తమ ఆశయాల సిద్ధికొరకు గట్టిగా ప్రయత్నించ వలసిన ఆవశ్యకత ఎంతైన ఉంది.

# 9. మారుతున్న ప్రపంచ రాజకీయాలలో అలీనోద్యమం

ప్రపంచం తొందరగా మారిపోతుంది. కాని దాని కనుగుణంగా అలీనోద్యమం సూత్రాలలో మార్పులు చెందలేదు. అలీనోద్యమం మారిన ప్రపంచ రాజకీయాలలో స్థానంలేదని బూజుపట్టిన సూత్రాలని, ఆశయాలకు విలువలేదని అంటున్నారు. ఇది సమంజసం కాదు. వీటిలో నిజంలేదు. అలీనోద్యమం యొక్క నైతిక విలువలపై దెబ్బలు కొట్టడానికి సామ్రాజ్యవాద ప్రచార శక్తులు చేస్తున్న క్రమానుగత దుష్ప్రచారం. సామ్రాజ్యవాదపు విషవాయుల వేడి అలా అనిపిస్తుంది. కాని అలీనోద్యమం, ప్రపంచదేశాలు తమ విదేశాంగ విధానంలో స్వతంత్ర్యం కావలనుకుంటాయో, స్వతంత్ర నిర్ణయాల గైకొనడానికి, గుర్తింపుకు కృషి చేసినంత కాలం అలీనోద్యమంకు చావులేదు. ఎల్లప్పుడు సజీవంగానే ఉంటుంది. కాని ఎలాంటి వాటికైన ఏదో కొంతకాలం చంద్రునికి పట్టిన గ్రహణంలాగా మరుగున పడవచ్చును. అందుకే పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ తన దూరదృష్టితో ప్రపంచం వైరుధ్యాలతో, కక్షలు, కార్పణ్యం, అపనమ్మకంతో నడుస్తూనే ఉంటుంది. అదే రీతిలో ప్రపంచదేశాలన్నియు దగ్గరవుతూ సహాయ సహకారాలను పెంపొందించుకుంటాయన్నారు. అదేవిధంగా అలీనోద్యమం 'శాంతి అనే ప్రాంతం' (The Area of Peau) మీద ఆధారపడింది. ప్రపంచమంతా రష్యా, అమెరికాలతో సహా శాంతియుత సహజీవనంవైపు నడుస్తున్నాయన్నారు. అలీనోద్యమం ప్రపంచ వివిధ దేశాలు స్వాతంత్ర్య కాంక్షతో తమ విదేశీ విధానంను కొనసాగించినంత కాలం అభివృద్ధి చెందుతున్న దేశాలు స్వతంత్ర్యాన్ని, హోదాను, గుర్తింపును కాపాడుకొన్నంత కాలం ఈ అలీనోద్యమం జీవిస్తుంది.

### అలీనోద్యమం – ముఖ్య ఆశయాలు :

అలీనోద్యమం అవసరత ప్రపంచ రాజకీయాలలో లేదంటున్నారు. కాని అసమంజసం. మనం దాని ముఖ్యాశయాలను గూర్చి పరిశీలించిన అలీనోద్యమం యొక్క అవసరత తెలుస్తుంది. అలీనోద్యమ ముఖోద్దేశ్యం స్వయం ప్రతిపత్తి,

అంతర్జాతీయ సంబంధాలలో స్వతంత్ర్యంగా వ్యవహరించడం కీలకమైనవి. ఈ లక్ష్యాలు ప్రతి సార్వభౌమాధికారంలో యిమిడి ఉంటాయి. ఇక్కడ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అంతర్జాతీయ ఆదర్శంగా పెట్టకుండ స్వాతంత్ర్యంను కాపాడుటకు కావలసిన ఆయుధంగా పరిగణించారు.

1946 సెప్టెంబర్ 7న నెహ్రూ మాట్లాడుతూ 'మనం సాధ్యమైనంతవరకు శక్తి రాజకీయ వర్గాలకు దూరంగా వుండడం ఎందుకంటే ఒక వర్గం మరొక వర్గంను ఎదుర్కొనడానికి ఏర్పడినవిగా గత రెండు ప్రపంచయుద్ధాలలో చూసాం. ఇవే వర్గాలు మరల ఎప్పుడైన మారణహోమం జరుపడానికి వెనుకాడవు. కనుక వర్గ రాజకీయాలకు దూరంగా ఉండి, ఇండియా ప్రయోజనాలను కాపాడుకొన వచ్చునన్నారు. ఇక్కడ అలీన విధాంను తన సొంత ప్రయోజనాలను కాపాడు కొనుటకు కావలసిన విధానంకాని మరొక దేశం యొక్క ఆలోచన ఆదర్శాలకు లోబడి ఉండటానికి ఏర్పడినది కాదంటారు.'

నెహ్రూ ద్వైపాక్షిక ప్రపంచ రాజకీయాలు అంతమొందుతాయని తన దూర దృష్టితో ముందే ఊహించ గలిగారు. అందుకే అలీనోద్యమం సెక్రటేరియట్‌ను ఏర్పరచడానికి, అలీనోద్యమం మూడవశక్తిగా అనడంను వ్యతిరేకించారు. 1946 సెప్టెంబర్ 7 నెహ్రూ ప్రపంచం ఎన్ని వైరుధ్యాలు, వ్యతిరేకతలు, అంతర్గత సంఘర్షణలున్నదగ్గర సంబంధాలను ఏర్పరుచుకొని 'ప్రపంచ' కామన్‌వెల్త్‌ను ఏర్పరుచుకొంటాయని ఆశించారు. దీనికొరకే స్వతంత్ర్య భారతదేశం కృషి చేయాలి. ఆ ప్రపంచం స్వేచ్ఛా, సహకారం స్వతంత్ర ప్రజలు ఒక వర్గం మరొ వర్గంను దోచుకొనకుండ వర్గరహిత ప్రపంచం ఏర్పడాలని కలలు గన్నారు.

**అలీన విధానం – పరిణామం :**

అలీనోద్యమం గ్రుడ్డి నమ్మకమైతే కాదు. ఇది మనిషి లేదా దేశం యొక్క మనస్తత్వంకు సంబంధించినది. మనిషి లేదా దేశం ఎలాంటి పరిస్థితినైన ఎదుర్కొనడానికి ఉపయోగపడే సాధనం.

అలీనవిధానం ప్రతి అంశాన్ని కూలంకషంగా లాభ నష్టాలను బేరీజు వేసుకొని ప్రవర్తించే వాస్తవ విధానం. అలీన విధానంను గూర్చి నెహ్రూ కొలంబియా

విశ్వ విద్యాలయం 1949లో మాట్లాడుతూ' ఎప్పుడైన ఎక్కడైన అన్యాయం జరిగినప్పుడు ఇండియా తటస్థంగా ఉంటదన్నారు. ఇది బుద్ధుడుపయోగించిన మధ్యమ మార్గం కూడాను. ఈ మధ్యమ మార్గమే నెహ్రూను పెట్టుబడిదారి వ్యవస్థకు, కమ్యూనిజంను ఎదుర్కొని స్వతంత్ర్యంగా నిలబడగలగడానికి చూపించిన మార్గం. కమ్యూనిస్టు–పెట్టుబడిదారుల మధ్య సయోధ్య కుదర్చడానికి సాయుధం అయింది.

1918 మొదటిసారిగా లోకమాన్య బాలగంగాధర్ తిలక్ అలీన విధానంను గూర్చి ఇండియా ఏ వర్గంవైపు మొగ్గుచూపదు. అటు సోషలిస్టు రష్యావైపుగాని, ఇటు గెలిచిన మిత్రరాజ్యాల పక్షానగాని ఉండదని చెప్పారు. మేడమ్ బికాజి కామా ఇతర ఇండియా ప్రతి నిధులు ఫ్రాన్సు దేశాధినేత క్లెమెన్స్యాని అప్పటి నానాజాతి సమితిలో స్వతంత్ర సభ్యురాలుగా వున్న ఇండియాకు స్వాతంత్ర్యం గ్రేట్ బ్రిటన్ నుండి యిచ్చేలా చూడడానికి కలిసినపుడు క్లెమెన్స్యా 'ఇండియాకు స్వతంత్ర్యం యిచ్చిన యెడల అటు సోవియట్ రష్యా పక్షంలో జాయిన్ అయ్యే అవకాశం ఉందని తన అనుమానంను వ్యక్తపరచారు. అప్పుడు శ్రీతిలక్ మిగతా నాయకులు మిత్రరాజ్యాలకు ఇండియా శక్తి రాజ్యాలకు, అగ్రరాజ్యాల వైరుధ్యాలకు దూరంగా ఉంటామని హామీ యిచ్చారు. ఆనాటి నుండి అలీనవిధానం ఇండియా జాతీయ జీవనం ఐక్యంకు ప్రజల యొక్క సత్శీలతకు ప్రతీక అయింది.

1948 మార్చి 8 న నెహ్రూ అలీనోద్యమం గూర్చి మాట్లాడుతూ నేటి పరిస్థితుల దృష్ట్యా మనం తక్కువ నష్టాలున్న దాన్ని ఎన్నుకొనడం మంచిది మనం ఎప్పుడు తక్కువ నష్టాలను కలిగిన దానిని ఎన్నుకొంటాము. పరిస్థితుల దృష్ట్యా బలవంతంగా ఈ వర్గాన్నో ఆ వర్గాన్నో సమర్థించుట జరుగుతుంది. అప్పుడు సామ్రాజ్యవాద దేశం వైపే మొగ్గు చూపవచ్చును. అలాంటి స్థితిలో తక్కువ నష్టాన్ని కోరుకొందాము. నెహ్రూ మనం ఎంతగానో బ్రిటీషు సామ్రాజ్య వాదంను వదలివేయడానికి ఎంతగానో మాట్లాడం కాని దాన్ని సంకెళ్ళ నుండి బయట పడలేక పోతున్నామన్నారు. ఈ విషయం నెహ్రూ సమగ్ర దృష్టిని చెప్పుకొనవచ్చును. ఏ విధానంనైనా నీవు విదేశాంగ విధానం అంశాలలో అవలంబించిన మనం ఆలోచించవలసింది మనకు అధిక ప్రయోజనాన్ని చేకూర్చుతుందా లేదా చూచి ఎన్నుకోవాలంటారు. అస్థిర దృక్పథయే మనకు కావలసిన ఆర్థిక సహాయంను పశ్చిమ దేశాల నుండి ఆయుధాలను సోవియట్ రష్యా నుండి పొందడం జరిగింది ఆయన నూతన వలస వాదంనకు లోబడకుండ దృఢ నిశ్చయంను తీసుకొన్నారు. కాని

కొందరు నాయకులు సుకార్నో ఇండొనేషియా, న్రూకోమా మరి కొందరు ఈ నూతన వలస వాదంకు లోబడినారు. నేదివరకు ఒకరికి లోబడకుండ అలీనో ద్యమం కొనసాగుతుందంటే చెప్పుకొనదగిన అంశం.

## ఇండియా - అలీన విధానం స్థితి :

ఇండియా విదేశాంగ విధానం నేటికి అన్ని రాజకీయ పక్షాలు మూకమ్మడి అంగీకారం మీదవే సాగుతుంది. 1977-79 లో కేంద్రంలో మొదటి ప్రతిపక్ష ప్రభుత్వం ఏర్పడినపుడు భారత విదేశాంగ విధానంలో ఎలాంటి మార్పులు రాలేదు. కాని 'వాస్తవమైన' అనే మాటను చేర్చికొన సాగించారు. అందరు అంగీకరించిన విదేశాంగ విధానం 40 సంవత్సరాల స్వాతంత్ర్య భారతదేశం కొనసాగిస్తుంది. అంతర్గతంగా, బహిర్గతంగా రాజకీయపక్షాలలో అనేక భేదాలు, భిన్న అభిప్రాయాలున్న విదేశాంగ విధానంలో అన్ని రాజకీయ పక్షాలు, వర్గాల ప్రజలు ఒకే అభిప్రాయంతో అలీన విధానంను అంగీకరించుచున్నారు. 1989-91 కాలంలో కాంగ్రేసేతర రాజకీయ పక్షం అధికారంలోకి వచ్చింది. అయినా భారత రక్షణ విదేశాంగ విధానం గతంలో కొనసాగిన విధానాలను కొనసాగించారు. గత సంవత్సర కాలం నుండి విదేశాంగ విధానమునకు యివ్వవలసిన ప్రాధాన్యత యివ్వలేదు. అయినా కూడ ఏర్పరిచిన విలువలు, ఆచారాలు నుండి వైదొలగకపోయిన కొన్ని పరిస్థితులలో అలీనోద్యమ సూత్రాలను, ఆచారమును మరచి యుద్ధంలో పాల్గొనిన అమెరికా విమానాలకు ఇంధనం యిచ్చే అవకాశం కలుగచేసి కీలకమైన అపరాధం చేశారు. దానితో అమెరికాకు కొన్ని విషయాలలో దగ్గరయినాము. కాని అలీన విధానంకు మచ్చ ఏర్పడింది. గతంలో ఇండియా యెప్పుడు యుద్ధకాలంలో ప్రవర్తించలేదు.

మారుతున్న ప్రపంచ రాజకీయ పరిస్థితులతో ఇండియాకు జరుగవలసినంత మంచి జరుగలేదు. ఎప్పుడైతే మార్పులు ఏర్పడినాయో ఇండియా సత్వరమే మధ్యవర్తిత్వ విధానం నుపయోగించి అంతర్జాతీయ సంఘర్షణల పరిష్కారంకు చర్చలను ఏర్పాటుచేయడంలో ఉత్సాహాన్ని చూపేది అదికరువైంది. ఈ స్థితి అంతర్గత నిశ్చత లేకపోవడం జరిగిందని చెప్పవచ్చును. అందుకే ఇండియా చొరవతో గల్ఫ్ యుద్ధంను ఆపడానికి చేయవలసిన ప్రయత్నంలో ఉత్సాహం చూపలేదు.

అంతేకాక ప్రభుత్వం నుండి సాధారణ సూచనలు లేకపోవడం వలన అంతర్జాతీయ సమస్యల పరిష్కారంలో సరియైన పాత్రను నిర్వహించలేక పోయింది.

భారతదేశం ద్వైపాక్షిక ప్రపంచ రాజకీయాలలో కొనసాగించిన పాత్రకు రాజకీయ గౌరవంను పొందింది. కాని 1989 తర్వాత ప్రపంచ రాజకీయాలు ఏకైక అగ్రరాజ్యం ఆధ్వర్యంలో కొనసాగుతున్నాయి. దీనితో అలీనోద్యమం మందగొడిగా సాగుతుంది. కనుక ఈ స్థితి నుండి బయట పడాలంటే భారతదేశం నూతన ఉత్తేజంతో అలీనోద్యమం యొక్క స్థితిని కార్యదీక్షత, అవసరత చాటి చెప్పవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఇండియా తన స్వతంత్ర విదేశాంగ విధానం కొనసాగించుకొంటు మిగత మూడవ ప్రపంచ దేశాలతో కలిసి అలీనోద్యమం పటిష్టతకు కృషి చేయాలి.

## అలీనోద్యమం - ప్రస్తుత స్థితి :

అలీనోద్యమం 1990లో ఉత్తేజం తగ్గింది. ప్రచ్ఛన్న యుద్ధానంతరం విదేశాంగ విధానంలో స్వప్రయోజనం ముఖ్యమయింది. బెల్‌గ్రెడ్ సమావేశంలో జి-15 దేశాల వర్గాన్ని అలీనోద్యమం నుండి సృష్టించబడింది. ఈ జి-15 దేశాల జూన్ 15, 1990లో కౌలాలంపూర్ సమావేశం జరిపాయి. కాని ఏ విధమయిన ఫలితాలను సాధించలేదు. ఈ అలీనోద్యమంను అందరు మర్చిపోయారా అనిపిస్తుంది. ఎందుకంటే జి-5 దేశాల సంభాషణలు (అభివృద్ధి చెందిన దేశాల వర్గం) అలీనోద్యమం గూర్చి ప్రస్తావన కూడ ఎత్తలేదు. అంటే అలీనోద్యమం యొక్క పటిష్టత, అవసరత తగ్గిందనిపిస్తుంది. దక్షిణ దేశాల కమీషన్ తన ఆశయాలను సాధించడంలో విఫలమయింది. దక్షిణ-దక్షిణ దేశాల మధ్య ఇప్పటి వరకు ఏ సంభాషణలు కొనసాగించలేదు.

ఇటీవల గల్ఫ్‌యుద్ధం ఆపడానికి, యుద్ధవిరమణకు తగినంతగా కృషి చేయనంత మాత్రాన అలీనోద్యమం యొక్క ప్రాథమిక సూత్రాలకు, దానియొక్క అంతర్జాతీయ పాత్రతకు ఏ విధంగా నష్టం కాదు. ఈ ఉద్యమం యొక్క స్థితిగతులు అంతర్జాతీయ, రాజకీయార్థిక సక్రమ స్థితిని నెలకొల్పడానికి చేసే ప్రయత్నంపై ఆధారపడి ఉంటుంది. ఇంతవరకు 102 దేశాలు ఈ ఉద్యమంలో చేరాయంటే దానికున్న సమర్థతను తెలియజేస్తుంది. గతంలో అలీనోద్యమం ఐక్యరాజ్య సమితితో బయట నిర్వహించిన పాత్ర ఎన్నో విషయాలు చరిత్రలో

నున్నాయి.కాని నేటిమార్పులు రావడంవలన సంకోచిత స్థితిలో సమర్ధవంతంగా పని చేయలేదు. కనుక తన గత చరిత్రను దృష్టిలో నుంచుకొని ముందు తను చేయ వలసిన కార్యక్రమమును ఎన్నుకొని పనిచేయవలసిన అవసరం అలీనోద్యమంకు చాల ఉంది

## అలీనోద్యమం - ఇండియా _ చైనా :

ప్రచ్ఛన్న యుద్ధం రష్యా అమెరికాల మధ్య అంతరించడంతో న్యూక్లియర్ నిరాయుధీకరణ ఏర్పడింది కాని రష్యా - చైనా లాంటి దేశాలలో అంతర్గత - బహిర్గత రంగాలలో చాల మార్పులు సంభవించాయి. స్టాలిన్‌లు, మావో-సె-టుంగ్‌లు-నెహ్రూ అలీనోద్యమంను చూచి నిరుత్సాహం చెందారు.మావో-సె-టుంగ్ ఏదో ఒక వర్గం వైపు ఉండాలి కాని మూడో వర్గం అంటు ఉండదన్నారు, నేడు ప్రపంచమంతటిలో మార్పు వచ్చింది చైనీయుల ఆలోచనలో కూడ మార్పులు వచ్చాయి. చైనా కూడ జవహార్ నెహ్రూ యొక్క అలీన విధానంను గూర్చి ఆలోచించునట్లు కనిపిస్తుంది.

1987 మార్చి 5 చైనా పీపుల్స్ కాంగ్రెస్‌లో మాజీ ప్రధాని శ్రీ జియోవో జియాంగ్ 10 సంవత్సరాల ప్రణాళికను సమర్పిస్తూ, చైనా ప్రపంచ విషయాలలో లాభనష్టాలను బేరీజు వేసుకొంటు తన విధానాలను, ఆశయాలను బట్టి స్వతంత్ర్యం గానే వ్యవహరిస్తుందన్నారు. ఈ విషయాలపై మంచి చెడ్డలను ననుసరించి చైనా నడుచుచున్నదా?లేదా అనే విషయం ఈ పద్ధతి ప్రపంచంలో శాంతి,మిత్రత్వంను, సహకారంను పెంపొందించుచున్నదా? అనే అంశాలను నిర్ణయించి వాస్తవ దృష్టితో చైనా వ్యవహారించుతుంది. చైనా ఏ అగ్రరాజ్యంతో కాని, మరి ఏ ఇతర మిత్ర దేశాలతో కాని ఏ విధమయిన పొత్తుపెట్టుకోదని స్పష్టం చేశారు. ఇటీవల ప్రధాని శ్రీ లీఫెంగ్ ఇవే ఆశయాలను పునరుద్ఘాటిస్తూ అన్ని అంశాలను పరిశీలించి చైనా స్వాతంత్ర్య విదేశాంగ విధానమును అవలంబించు చున్నదన్నారు. అంతేకాక ప్రధాని లీఫెంగ్ పంచశీల సిద్ధాంత సూత్రాలను శాంతియుత సహజీవనం, పెత్తం దారీ, అధికార రాజకీయాలకు వ్యతిరేకత, ప్రతిదేశం తనకు కావలసిన సాంఘిక వ్యవస్థను ఎన్నుకోవడం, ఆర్థిక ఆదర్శాలను కలిగి ఉండుట, నూతన అంతర్జాతీయ సక్రమ స్థితిని ఏర్పరించాలని పేర్కొన్నారు. ఇలాంటి స్థితిలో ఇండియా-చైనా కూడ ఒకే ఆశయాలను కలిగియున్నాయి. ఒకే అంశాలమీద పని చేయాలనుకుంటు

న్నాయి కనుక తమ ఆశయాల సాధనకు కలిసికట్టుగా పనిచేసిన యెడల ప్రపంచంలో నూతన స్థితిని సృష్టించ వచ్చును.

**ముగింపు :**

ప్రపంచంలో బహుముఖ, ద్వైపాక్షిక, ఏకైక అగ్రరాజ్యమున్నను అలీనోద్యమం యొక్క కొనసాగింపు స్వతంత్ర్య విదేశాంగ విధానం కొనసాగినంత కాలం కొనసాగుతుంది. ఎప్పుడు సమతౌల్య అధికారంను ప్రపంచ రాజకీయాలలో వ్యతిరేకిస్తుంది. అంతర్జాతీయ సహకారంను, సహకార స్థితిని, ప్రజాస్వామ్యం అంతర్జాతీయ రాజకీయాలను ప్రోత్సహిస్తుంది అలీనోద్యమం. అలీనోద్యమం యొక్క సారాంశం కేవలం రెండు అధికారల మధ్య సమతౌల్యం ఏర్పరచడమే కాదు. పటిష్టమయిన శాంతియుత ప్రజాస్వామ్య అంతర్జాతీయ రాజకీయ స్థితిని నెలకొల్పుటయే.

ఈ ఆశయాలను సాధించడంలో మధ్యమ మార్గంలో ఉండే ప్రస్తుతం అలీనోద్యమం ప్రపంచ దేశాలమధ్య నూతన అంతర్జాతీయ ఆర్థిక సక్రమస్థితిని నెలకొల్పడం,దక్షిణ- ఉత్తర దేశాలమధ్య సమానంగా వనరుల పంపిణి, దక్షిణ-దక్షిణ దేశాలమధ్య సంబంధాలను పెంపొందించడం, మొదలయిన ఆశయాలు అగ్రరాజ్యాల అధికార కాంక్షచే వెనుకబడినాయి. వీటి సాధనకొరకు అలీనోద్యం గట్టిగా కృషి చేస్తుంది. ఇంకా బహుళజాతి సంస్థల శక్తి, అభివృద్ధి చెందుతున్న దేశాలలో చొరబడి వ్యాపార పెట్టుబడులను వృద్ధిని అరికట్టాలి. మానవ పరిసరాల కలుషితం మానవ సమస్యలను అలీనోద్యమం కొనసాగినపుడే పరిష్కరించబడతాయి. అలీనోద్యమం ప్రపంచ స్థితిని సక్రమస్థితిలో యేర్పరచడానికి కృషి చేస్తుందని ఆశిద్దాము.

# 10. పశ్చిమోత్తర సరిహద్దు - ఇండియా రక్షణ

నేడు ఇండియా రక్షణలో పశ్చిమోత్తర సరిహద్దు ప్రముఖ స్థానంను కలిగి ఉంది ఇదే సరిహద్దు ప్రాంతం నుండి నేటికి ఇండియా రక్షణపై సవాళ్ళను ఎదుర్కొంటుంది, ఎందుకంటే ఇరుగు దేశమయిన పాకిస్తాన్ అణు ఇంధన దేశం కావడం. ఆ దేశానికున్న ఆయుధాల రేంజ్‌లోనే మనరక్షణ స్థావరాలుండడం, ఇండియా అరక్షణ స్థితిని కలిగి ఉంది అంతేకాక మన దేశంలో జరిగే అనిశ్చిత, హింసాయుత కార్యక్రమాల వెనుక పాకిస్తాన్ హస్తం వుందనడం అనేక అంశాలును మన రక్షణావసరాల దృష్ట్యా తెలుసుకొనవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది.

ఏ దేశ భద్రతయైన ఆ దేశం యొక్క చుట్టుప్రక్కల సరిహద్దులు, భౌగోళిక స్థితిపైన ఆధారపడి ఉంటాయి. ఇండియా యొక్క సరిహద్దులను గనుక పరిశీలించి చూచినట్లయితే ఉత్తరాన పెట్టనిగోడలవలె హిమాలయ పర్వతశ్రేణి మిగతా మూడువైపుల వ్యాపార, వాణిజ్య సంబంధాలకనువుగా సముద్రలున్నాయి. ఇట్లాంటి సదుపాయాలున్న దేశం ఇండియా అవ్వడం, ఎంత అదృష్టమో. కాని పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతం పురాతన కాలం నుండి 'అరక్షణ' ప్రాంతంగా ప్రతికాలంలోను ఈ పశ్చిమోత్తర సరిహద్దు ప్రభావం ఇండియా రక్షణ, రక్షణ వ్యయంపై ప్రభావాన్ని చూపుతున్నది.

అందుకే ఇండియా యొక్క పశ్చిమోత్తర సరిహద్దును "కీలకమయిన సరిహద్దు" (**Strategic Border**) అని అంటారు. ఎందుకంటే ఇండియాకు పురాతన కాలం నుండి ఈ సరిహద్దు నుండే వాణిజ్య, వ్యాపార సంబంధాలు భూమార్గలుండేవి. అంతేగాక ఇండియాకు వచ్చిన అనేక జాతులు, వర్గాలు, ఈ మార్గం గుండానే వచ్చారు. ఇండియాపై ఎన్నోసార్లు దండయాత్ర జరిగింది. అందుకే అశోకుడు కాలం నుండి నేటికి కూడ ఈ పశ్చిమోత్తర సరిహద్దు నుండే అనేక అరక్షణ స్థితి స్థితిని ఎదుర్కొనవలసి వస్తుంది. అంతేకాక ఈ సరిహద్దులను కాపాడుకొనుటకు అనేక విధాలుగా ప్రయత్నం చేయుచున్నాము. ఈ పశ్చిమోత్తర సరి

హద్దు ప్రాముఖ్యతను ఈ సరిహద్దు నుండి ఎదుర్కొంటున్నా సమస్యలను మొదటి నుండి ఏ విధంగా ఉంది, ప్రస్తుతం ఏ విధంగా ఉంది అనేది పరిశీలించుదాం.

మన పురాతన కాలం నుండి ఈ పశ్చిమోత్తర సరిహద్దు ద్వారా మనకు ఈజిప్టు మెసపుటోమియా, సంస్కృతులతో సంబంధాలు ఉండేవి. అంటే అతి పురాతన నాగరికతలలో ఈజిప్టు, చైనా, హిందూ నాగరికతలు ప్రసిద్ధి కెక్కాయి. అలెగ్జాండర్ దండయాత్రల వద్ద నుండి ఈ సింధూనది ఆవల నుండి మనదేశంకు సంబంధాలున్నాయి. ఈ ప్రాంత రాజులు అనైఖ్యతావసరంగా తీసుకొని మన దేశంపై దండెత్తడం జరిగింది. అదే విధంగా కుషానులు యవనులు, పార్థియనులు ఈ ఉత్తర భూభాగం గుండానే ఇండియాకు వచ్చి ఇక్కడ పాలకులుగా స్థిరపడి పోయారు. ఆ ఇరానీ, తురానీకి చెందిన రాజులు, 7వ శతాబ్దానికి చెందిన మహ్మద్ బిన్ కాశీమ్ కూడా ఇండియాకు ఇటు వైపు నుండి వచ్చి, ఇండియాకు ఇటువైపు నుండి వచ్చి, ఇండియాను ఆక్రమించు కొనడం జరిగింది. అదే విధంగా మధ్య యుగాంతంలో బాబరు తన దేశంలో ఓడి పోయిన ఇండియాపై దండెత్తి విజయం సాధించి ఇండియాలో స్థిర పడ్డారు.

ఆ విధంగానే మంగోలియా పాలకులు రక్షణను ఎప్పుడు సవాలు చేస్తుండే వారు. అదే విధంగా ఈ సరిహద్దును రక్షించు కొనుటకు మధ్యయుగంలో ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. ఈ ప్రాంతపు రాజపుత్ర రాజులు ఎపుడు విదేశీ దండ యాత్రలను ఎదుర్కొన వలసి ఉండేది. ఒక్కొక్కసారి విదేశీ రాజులకు లొంగి పోయి బంగారం, వైఢూర్యాలను చెల్లించు కొనేవారు లేదా విదేశీ పాలకులకు సామంతులుగా కప్పం చెల్లించేందుకు అంగీకరించేవారు.

ఆధునిక యుగంలో బ్రిటిషువారు ఇండియాను ఆక్రమించుకొన్నాక ఉత్తర తూర్పు ప్రాంతం ఏజెన్సీ (NEFA) ప్రాంతాన్ని పరిరక్షించు కొనడానికి చాల వ్యయప్రయాసలకు ఎదుర్కొనడం జరిగింది. పశ్చిమోత్తర సరిహద్దు రక్షణలో బ్రిటిషువారు ఆఫ్ఘనీయులతో మూడుసార్లు పోరాడవలసి వచ్చింది. వారు ఈ సరిహద్దును చాలా ప్రమాదకర మైనదిగా గుర్తించి దానిని నిలబెట్టుటకు ప్రయత్నించారు. పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతంను కాపాడు కొనుటకు లేదా పరిరక్షించు కొనుటకు బ్రిటిష పాలకులు ఇండియా, పశ్చిమాసియా లేదా సోవియట్, రష్యాల

మధ్య ఒక చిన్న రాజ్యంను ఏర్పరచడం జరిగింది. అదే ఆఫ్ఘనిస్తాన్. ఈ ఆఫ్ఘ నిస్తాన్‌ను అటు పశ్చిమాసియా రాజ్యాలు గాని ఇటు బ్రిటిషువారు కాని ఆక్రమించ కుండా దానిని అట్లానే ఉంచారు. ఈ విధానంనకు బఫర్ స్టేట్ (Buffer state) సిద్ధాంతంగా ప్రపంచ రాజ్యాల పరిరక్షణ విధానంగా గుర్తించ బడింది. బ్రిటిషు వారు ఇండియాను పరిపాలించి నంత కాలం ఇదే సిద్ధాంతంను అవలంబించారు. ఈ ప్రాంతంలో ఏ రాజ్యం కూడా ఆఫ్ఘనిస్తానును ఆక్రమించడానికి ప్రయత్నించ లేదు.

బ్రిటిషువారు ఇండియాను వదలి పోవునపుడు కూడా ఇదే పశ్చిమోత్తర ప్రాంతంలో సరిహద్దు సమస్యలను ఎమర్కొనేది అదే సమస్య సమస్యగానే వదలి పోయారు. ఎందుకంటే స్వాతంత్ర్యంతోనే ఇండియా-పాకిస్తాన్‌లుగా విడిపోయి నపుడు ఒక నిర్దుష్ట సరిహద్దులను ఏర్పరచ కుండానే వారికి వచ్చినప్పుడు ఎట్లా వుందో వారు పోయేటప్పుడు తమ యొక్క వారసత్వంగా వస్తున్న సరిహద్దు సమ స్యలు తాత్కాలికంగా నైన పరిష్కరించక వదలి పోయారు. దానితో ఇండియా పాకిస్తాన్‌గా ఏర్పడి కూడా ఆనాటి నుండి నేటివరకు ఈ పశ్చిమోత్తర సరి హద్దును ఇండియా రక్షణకు ముప్పు వాటిల్లే ప్రమాదం తొంగి చూస్తూనే ఉంది. ఇండియా-పాకిస్తాన్‌లుగా విడిపోయినపుడు అప్పటి వరకు సోదరులుగా ఉన్నా వారు, శత్రువులుగా మారారు. దానితో అప్పట్లో ఉండే సరిహద్దు సమస్యయే నేటికి ఈ దేశాల మధ్య సమస్యగానే కొనసాగుతుంది

దీనికి కారణం అప్పటివరకు ఉపఖండంగా కొనసాగి పంపకం వలన ఏర్ప డిన విభేదాలు వలన శత్రువులయ్యారు. ఆ విధంగా ఈ ప్రాంత పరిరక్షణ నిమిత్తం రెండు దేశాలు చాలా కోట్ల రూపాయలు హెచ్చించుతూ రక్షిత పథకాలు చేపడు తున్న ఇంకా సమస్య సమస్యగానే కొనసాగుతుంది దీనికి కారణం ఇండియా- పాకిస్తాన్‌గా విడిపోయినప్పుడు బ్రిటిషువారు స్పష్టంగా సరిహద్దులు పేర్కొన లేదు. ఈ రెండు దేశాల మధ్య రెడ్ క్లిఫ్‌లైనుంది.

ఇండియా నుండి బ్రిటిషువారు వైదొలగినపుడు ఈ రెండు దేశాల మధ్య పంపక విషయంలో వైషమ్యాలు ఏర్పడ్డాయి. అవి అప్పటి వరకు కొనసాగు తున్నాయి. ఇండియాలోని రాజులు తమ ఆస్తులను వదలి పాకిస్తాన్‌కు పోవడం జరిగింది. జునాఘడ్ ప్రాంతం ఇండియాలో నున్న పాలకులు చివరకు పాకిస్తాన్‌కు

పోయారు. అట్లా చాలా మంది అటు యిటు మారడం జరిగింది. అట్లానే కాశ్మీరు పాలకుడు శ్రీహరిసింగ్ తన రాజ్యాన్ని ఇండియన్ యూనియన్‌లో కలిపాడు కాని అక్కడి కొందరు ప్రజలు దాని అంగీకరించమన్నారు. వారికి పాకిస్తాన్ మద్దతు నిస్తూ 1948 లోనే ఇండియాపై దండయాత్ర చేసింది. దానిని ఇండియా విజయవంతంగా త్రిప్పికొట్టింది. కాని పాకిస్తాన్ ఆక్రమణలో కొచ్చిన ఇండియా యొక్క కొంత భూభాగంను అజాద్ కాశ్మీరు పేరుతో పాకిస్తాన్ క్రింద ఉంది. అప్పుడు 1948 లో జవహర్‌లాల్ నెహ్రూ ఈ విషయమై ఐక్యరాజ్య సమితి సాధరణ సభకు నివేదించి పరిష్కారం చూడ్డంతో ఆ సమస్యపై ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలో కాశ్మీరులో ప్రజలు అటు పాకిస్తాన్ లేద ఇండియా వైపు మొగ్గు చూపుతున్నారా? లేద అనే అంశంపై ఐక్యరాజ్య సమితి కాశ్మీరు సమస్యాసంఘం కాశ్మీరులో ప్రజాభిప్రాయంను నిర్వహించ మంది.

కాని నెహ్రూ కాలం నుండి కాశ్మీరు సమస్యపై నేటి ప్రజాభిప్రాయ సేకరణను నిర్వహించడానికి ఇప్పటి వరకు అంగీకరించ లేదు. కాశ్మీరు ఇండియాలో అంతర్భాగమని ఆ సమస్య ఇండియా సార్వభౌమాధికారంకు సంబంధించింది. కనుక తను అంతర్గతంగా పరిష్కరించుతామని ఇండియా అంటుంది కాని పాకిస్తాన్ ఐక్యరాజ్య సమితి లోను మరి అంతర్జాతీయ సదస్సుల్లోను కాశ్మీరు సమస్యను లేవనెత్తుతుంది. దానికి ఇండియా తన స్వంత సమస్యని సమాధానం చెపుతుంది.

ఈ ఆక్రమిత కాశ్మీరు, కాశ్మీరు సమస్య ఈ పశ్చిమోత్తర సరిహద్దు వైపు పాకిస్తాన్-ఇండియాలు ఎప్పుడు ఘర్షణ పడుతూనే ఉన్నాయి. అప్పుడప్పుడు ఘర్షణ పడుతూనే ఉన్నాయి. అప్పుడప్పుడు సమస్యలు ఈ రెండు దేశాల మధ్య వస్తూనే ఉన్నాయి. ఈ కాశ్మీరు సమస్యపై ఒక ఒప్పందం కుదిరిన కాశ్మీరు అంతా మాదేనంటూ 1965 లో పాక్ ఇండియాపై దండయాత్ర చేసి ఓడిపోయింది. కాని కాశ్మీరు పాకిస్తాన్ ఆక్రమణలో నున్న దాన్ని వదలడం లేదు. అంతేకాక పశ్చిమోత్తర సరిహద్దు రక్షణకు గత 44 సంవత్సరాలుగా కొన్ని వందల కోట్లు హెచ్చించడం జరిగింది. అంతేగాక 1971లో పాకిస్తాన్ ఇండియాలు, బంగ్లాదేశ్ రక్షణపై యుద్ధం జరిగింది. అప్పుడప్పుడు సమస్యపై చర్చ కొనసాగింది.

పాకిస్తాన్ చాలాసార్లు ఈ ప్రాంతంలో తన పెత్తనం చెలాయించుటకు

గతంలో చైనా–ఇండియా మంచి సంబంధాలు లేనపుడు పాకిస్తాన్–చైనా సంబంధాలు పెట్టుకొని 'కారాకారస్' మార్గంను తెరచి వాణిజ్య సంబంధాలు పెట్టుకొని ఇండియాకు వ్యతిరేక చర్యలకు పాల్పేడేది. అంతేగాక అగ్రరాజ్యాల దక్షిణ ఆసియా రాజకీయాల్లో భాగంగా పాకిస్తాన్‌కు సైనిక సహాయం చేసింది. దానితో మొదటి నుండి ఇండియా వ్యతిరేక ధోరణులు చేపట్టింది. దానితో ఇండియా అనేక సార్లు ఈ పశ్చిమోత్తర సరిహద్దుల్లో సైనిక కవాతుల పేరుతో సైన్యాన్ని మోహరించి యుద్ధ వాతావరణం ఏర్పడేది. అట్లా గత 42 సం॥రాలుగా కొనసాగుతుంది. అంతేగాక ఈ పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రమైన పంజాబ్‌లో కూడ ఈ ఉగ్రవాదులు 1985 నుండి అనేక తీవ్రవాద కార్యకలాపాలకు పాల్పడుతూ పంజాబ్‌లో అనేక రకాలుగా హింసా, మారణ కాండకు తలపడడం జరుగుతుంది. దీనికంతకు ముఖ్యకారణం ఇండియా ఈ పశ్చిమోత్తర సరిహద్దును సరిగా అంటే శ్రద్ధత చేపట్టడం లేదని తెలుస్తుంది.

అదే పొరుగురాజ్యం అయిన పాకిస్తాన్ ఇండియాలో అల్లర్లు, తీవ్రవాదుల కార్యకలాపాలకు పాల్పడే వ్యక్తులకు, సంస్థలకు భౌతిక, సైనిక సహాయం నిస్తూ ఆశ్రయం కల్పిస్తున్నది. అదే విధంగా అగ్రరాజ్యమైన అమెరికా యొక్క 7వ ఫ్లీటును కరాచీకి సమీపంలో అరేబియా సముద్రంలో మోకరించడం, అమెరికా నుండి పాకిస్తాన్ అత్యాధునిక ఆయుధాలైన యఫ్-16 బాంబర్లను సేకరించి తన రక్షణ పటిష్టతను పెంచుకోవడంతో దాని కనుగుణంగా ఇండియా కూడా తన సైనిక స్తోమతను పెంచుకోవడానికి పోటీ పడుతూ ఇండియాలో పేదరికం వున్న మిగ్–21, మిరాజ్–1000 లను ఇండియా సమకూర్చు కొంటుంది. అంతేగాక మరొక తీవ్రరక్షణ ప్రమాదం ఇండియా ఎదుర్కొనేది ఏమంటే మన పొరుగుదేశం పాకిస్తాన్ రహస్యంగా అణు ఇంధన సౌకర్యదేశంగా రూపొందడంతో ఇండియా మరి ఆ రక్షణ స్థితిని ఎదుర్కొనవలసిన పరిస్థితి తీవ్రతర మైంది. అంతేగాక ఇండియాలో నున్న అణుఇంధన స్థలాలు పొరుగుదేశం రక్షణ జోన్ లోపల ఉండడంతో మరింత ఆందోళన చెందవలసి వస్తుంది. దానితో ఇండియా పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతం చాలా అరక్షణ స్థితిని ఎదుర్కొను చున్నది.

ఎందుకంటే ఇండియా రక్షణ అంతా ఈ పశ్చిమోత్తర సరిహద్దు మీద ఆధారపడింది. ఇట్లా ఆ రక్షణ పరిస్థితులు ఎదుర్కొనుట వలన రక్షణ బడ్జెట్‌ను

పెంచడం, ఆయుధాల దిగుమతులు చేసుకొనడం ఉద్రిక్తతలు నెలకొనడం మొదలైన అవాంఛనీయ సంఘటనలు ఇండియా ఎదుర్కొంటుంది.

ఇటీవల కాలంలో కూడా ఇండియా ఈ ప్రాంతంలో భద్రతా ఏర్పాట్లును బాగా పెంచింది. మరొక్క హర్షించదగిన విషయం ఏమంటే ప్రస్తుతం ఈ ఆసియాలో చాలా వరకు అంతర్జాతీయంగా ప్రచ్ఛన్న యుద్ధం సైవొలగడం, అగ్రరాజ్యం భావన తొలగిపోవడం ప్రక్కనున్న రష్యాలో అనేక పరిణామాలు ఏర్పడడంతో ఈ ప్రాంతం అరక్షణ స్థితి సడలింది. అదేవిధంగా ఇండియా—చైనాల మధ్య నున్న తూర్పోత్తర సరిహద్దు సమస్య ఇటీవల చైనా ప్రధాని లీఫెంగ్ పర్యటనతో పరిష్కారంకు చేరువులో ఉంది. ఈ విధంగా పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంత రక్షణను పెంచి అచ్చటి పరిస్థితులను గమనించి గట్టి బందోబస్తూ ఏర్పాటు చేయవలసిన అవసరం ఉంది. దేశం స్వాతంత్ర్యం సార్వభౌమాధికారంకు ముప్పు వాటిల్లే స్థితి ఈ ప్రాంతం నుండే ఉంది. కనుక ఈ పశ్చిమోత్తర సరిహద్దును కాపాడుకోవలసిన అవసరం ఇండియా కుంది.

# 11. హిందూ మహాసముద్ర ప్రాంతం శాంతి మండలం: ఇండియా ప్రయోజనాలు

హిందూ మహాసముద్ర జలాలపై ఎవరి ఆధిపత్యం కలిగి ఉంటారో వారి ఆధిపత్యం ఆసియా దేశాలపై కొనసాగుతుంది. ఈ సముద్రం మొత్తం ఏడు సముద్రాలను కలిపే కీలక ప్రాంతం 21వ శతాబ్దపు ప్రపంచం భవిష్యత్తు ఈ సముద్ర జలాలపైనే నిర్ధారణ అవుతుందని - అంతర్జాతీయ రాజకీయ కీలక అధ్యయన వేత్త ఆర్ఫ్రెడ్ మోహాన్ అన్నారు. మూడవ ప్రపంచ యుద్ధం గనుక వస్తే, ప్రపంచ భవిష్యత్తు హిందూ మహాసముద్ర జలాలపైన నిర్ణయించబడుతుంది. అనేది చాలా వరకు వాస్తవంగా కనిపిస్తుంది. ఈ హిందూ మహాసముద్రం పసిఫిక్ అట్లాంటిక్ తరువాత మూడవ సముద్రం. ఈ ప్రాంతం ఈ జలాలపై నుండి అనేక ప్రాంతాలను కలుపుతూ మార్గాలున్నాయి. అంతేకాక ప్రపంచ వాణిజ్య మార్గాలను కలుపుతున్న సూయజ్ కాలువ ఈ సముద్రం నుండే మొదలవుతుంది. హిందూ మహాసముద్రం ప్రపంచంలో నున్న అన్నింటికంటే విలువైన ఖనిజ సంపదను కలిగి ఉంది.చిత్రమేమంటే హిందూ మహాసముద్ర తీర ప్రాంతాలన్నియు రెండవ ప్రపంచ యుద్ధానంతరం బ్రిటిషువారు తమ ఆధిపత్యంను వదలు కొన్నాకనే చాలా దేశాలు స్వాతంత్ర్యాను పొందాయి. అంటే బ్రిటిషువారు కొన్నివందల సంవత్సరాలు ఈ సముద్రంపై ఆధిపత్యం కలిగి వున్నారు. పశ్చిమ దేశాలు కూడ ఈ సముద్ర ప్రాంతంలో ఆధిపత్యం కొనసాగించి ఈ ప్రాంతాలను వలసలుగా చేసి పిప్పి పిండి చేశాయనుట సత్య దూరం కాదు. బ్రిటిషువారు 1945 తరువాత ప్రపంచంలో ముఖ్యంగా తమ సముద్రాధి పత్యంను వదలు కొనడంతో స్వాతంత్ర్యం పొందిన నూతన దేశాలు తమ అభివృద్ధి కొరకు తటస్థ విధానంను అవలంబించాయి.

ఈ ప్రాంత దేశాలు శాంతికాముక దేశాలైన హిందుమహాసముద్రం కీలకమైన దవడంవలన ప్రచ్ఛన్నయుద్ధంతోను వాణిజ్య,వ్యాపారరంగాలలో పోటీలుపడి నిరంతరం అలజడులకు, యుద్ధాలకు గురికావలసి వస్తుంది. అందుకే 1971 లో ఐక్యరాజ్య సమితి ప్రతిపాదనచేసి హిందూ మహాసముద్రం శాంతి మండలంగా

కొనసాగాలని కోరాయి. ఈ ప్రాంతంలో నేటికి పరిస్థితి ఉద్రిక్తతలతోనే కొనసాగు తుంది. ఈ ప్రాంత దేశాలు శాంతిని కోరుకొంటున్న శ్రీలంకలో ఉగ్రవాదం, తూర్పు ఆసియా దేశాలలో అస్థిరతతో కొనసాగుతున్నాయి- ఎందుకంటే నూతన స్వాతంత్ర్యం పొందిన దేశాలు గత వలసవాద దేశాలే కనుక వారి అభివృద్ధి ఈ జలాల శాంతియుత స్థితిపై కొనసాగుతుంది. ఏ విధంగా హిందూ మహాసముద్రం శాంతిని నెలకొల్పగలవు? వాటి ఆశయాలేమిటి? వాటి స్థితిగతులు ఎందుకు హిందు మహాసముద్ర తీర ప్రాంత దేశాలు శాంతిని కోరుకొంటున్నాయి. ఏ ఏ ప్రయ త్నాలు చేస్తున్నాయి. ఈ ప్రాంతంలో పెద్ద దేశమైన ఇండియా ప్రయోజనా లేమిటి? ఆర్థికస్థితి, రాజకీయాలను గూర్చి చర్చించడం జరిగింది.

## హిందూమహా సముద్రం - భౌగోళిక స్థితి:

హిందూ మహాసముద్రం మూడు ఖండాలను ఆసియా, ఆఫ్రికా, ఆస్ట్రే లియాలను చుట్టుకున్నది. ఈ ప్రాంతంలో పర్షియన్ గల్ఫ్, ఎర్ర సముద్రంలు న్నాయి. తూర్పువైపున హిందూ మహాసముద్రం ఆస్ట్రేలియాను వేరుచేయుచున్నది. ఉత్తర భాగాన ఆసియా ఖండ ప్రాంతాలు, ఇండియా ఉపఖండం బాగా ఉత్తర భాగాన అరేబియా సముద్రం, బంగాళాఖాతంగా విభజించబడ్డాయి. దీని పరివాహక ప్రాంతం 10,000 కిలోమీటర్లుంది.

హిందూ మహాసముద్రం ఆనుకొని ఇండియా, పాకిస్థాన్, ఇరాన్, అరేబి యాన్ పెనిన్సులా, పశ్చిమ ఆఫ్రికా, ఆస్ట్రేలియా, ఇండోనేషియా, మలయా,- దక్షిణాన అట్లాంటిక్ మహాసముద్రాలున్నాయి. హిందూ మహాసముద్రం భౌగోళిక- పరిస్థితులను బట్టి చూస్తే ఈ ప్రాంతం చాలా ప్రధానమైనది. మధ్యధరా సముద్రం రెడ్ సముద్రం, పెర్షియన్ గల్ఫ్‌లు ఈ ప్రాంతంనకు పశ్చిమ దేశాలు చొరబడ కుండాను, ఐరోపా దేశాల యొక్క రాజకీయ, ఆర్థిక, సైనిక, మిలిటరీ, సాంస్కృ తిక ప్రభావం ఈ ప్రాంత దేశాలపై ప్రత్యక్షంగా పడకుండా చేస్తుంది.

ఈ ప్రాంత దేశాలను ఒకయూనిట్‌గా పరిగణించలేము. ఎందుకంటే చాలా భిన్నమైన బేధాలున్నాయి. ముఖ్యంగా జాతి, మత, సాంఘిక, సాంస్కృతిక, రాజకీయాలలో భిన్న వైవిధ్యాలున్నాయి. ఇన్ని వైవిధ్యాలున్నా ఈ ప్రాంత దేశాలు తమ ప్రయోజనాలను కాపాడు కొనుటకు ఐక్యంకాక తప్పడంలేదు. ఈ ప్రాంత దేశాలతో చాలా మత వైవిధ్యాలు ఇస్లాం, హిందూ, బుద్ధిజమ్, క్రైస్తవ మతాలతో

నున్నవి. భౌగోళికంగా తీసుకొంటే ఇవి అన్నీ ఒకే యూనిట్‌గా చెప్ప వచ్చును. ఆర్థికంగా ఇతర వ్యవస్థల పరంగా చూచినట్లయితే విదేశి సహాయంపైన ఆధార పడినవే. దీనికి కారణం 16వ శతాబ్దపు నుండి ఈ ప్రాంతదేశాలుపై పశ్చిమదేశాలు ఆధిపత్యం వహించి వారియొక్క సంపదలను, వనరులను కొల్లగొట్టాయి దాంతో నేటికి కూడా మూలధనం, సాంకేతిక పరిజ్ఞానం కొరకు విదేశీ సహాయంపై ఆధార పడి యున్నాయి. భౌగోళికంగా కీలక స్థానం అగుటచే ఈ ప్రాంతం శాంతి యుతంగా ఉండాలనుకోవడం వీరి చేతుల్లోలేదు.

## హిందూమహాసముద్రం-చారిత్రక స్థితి :

చారిత్రకంగా తీసుకొన్న యెడల హిందూమహా సముద్రం చాలా పురాతన కాలం నుండి వ్యాపార— సాంస్కృతిక సాంగత్యంను కలిగింది. క్రీ॥పూ॥ నుండి క్రీ॥శ॥ 5వ శతాబ్దపు వరకు ఇండియా నావికాధిపత్యంను కలిగియుంది. క్రీ॥శ॥ 6నుండి 7వ శతాబ్దంవరకు సమిత్రా[నేటి ఇండోనేషియా] ఈజలాలపైన ఆధిపత్యం కలిగిఉంది ఇదేకాలంలో ఇండోనేషియా ప్రజలు ఆఫ్రికా ఖండంచేరి మడ్‌సాగర్‌లో స్థిరనివాసం ఏర్పాటుచుకున్నారు. ఇస్లాం పుట్టుకతో అరబ్బులు, పెర్షియనులు ప్రాంతంలోకి వచ్చారు. ఆ తరువాత చైనీయులు పూర్తి ఆధిపత్యంను సోమారియా-అరేబియా పెనున్సులా ప్రాంతంలో కలిగి ఉండేవారుఅంటే క్రీ॥శ॥ 1200-1433 వరకు హిందూ మహాసముద్రం చైనీయుల పూర్తి ఆధిపత్యంలో కొనసాగింది. [ఆగస్టే టౌసెయింట్] 1498లో వాస్కోడి గామా కాలికట్ ప్రాంతం చేరిన తరువాత ఈ హిందూ మహాసముద్రపు ఆధిపత్యం పశ్చిమ ఐరోపా దేశాలవారిచేతు లలోకి వెళ్ళింది.

పోర్చుగీసువారి క్రింద నుండి బ్రిటిషువారి క్రింద వచ్చింది. ఈ కాలంలో హిందూ మహాసముద్ర తీర ప్రాంతంలోని వనరులపై సముద్రాధిపత్యంతో నియంత్రణ చేయగలిగారు బ్రిటిషువారు ఇండియా హిందూమహాసముద్రాధిపత్యం కలిగి మొదటి పారిశ్రామిక దేశంగా అభివృద్ధిచెందింది. మొదటి ప్రపంచ యుద్ధంకు ముందు బ్రిటిషువారు, ఫ్రాన్సు, రష్యాలతోకలిసి ఈ ప్రాంత దేశాలైన ఇండియా, పెర్షియన్ గల్ఫ్, దక్షిణాసియా దేశాలలో తమ ఆధిపత్యం సుస్థిరపరచుకొన్నారు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం బ్రిటన్‌యొక్క అధిపత్యం సడలింది. దానితో

బ్రిటీషువారు ఆర్థికంగా దెబ్బతినడంతో పశ్చిమ దేశాలు ఆర్థిక,రాజకీయ అస్థిరతతో ఈ ప్రాంత దేశాలకు స్వాతంత్ర్యం సిచ్చాయి.

ఎప్పుడైతే ఈ సముద్ర ప్రాంతం నుండి బ్రిటిషువారు వైదొలగినారో ఈ ప్రాంతంలో 'అధికార వెలితి' ఏర్పడింది. 1947లో ఉపఖండం విభజించ బడడంతో చైనా, జపాన్, రష్యాలు హిందూమహాసముద్రంపై ఆధిపత్యం కొరకు పోటీపడసాగాయి. సోవియట్ రష్యా హిందూమహాసముద్రంపై ఆధిపత్యం కొచ్చింది. ఈ కాలంలోనే అమెరికా-రష్యా ఈ ప్రాంత ఆధిపత్యం కొరకు పోటీపడినాయి. అందులో చాలావరకు ఈ దేశాల మధ్య యుద్ధాలు పరస్పర వైరుధ్యాలకు గురి అయినాయి. కాని 1989లో రష్యా తన ఆధిపత్యం వదలుకొనడంతో ఎదురులేని అగ్రరాజ్యంగా అమెరికాయే అయ్యింది. తన ప్రయోజనాలను కాపాడు కొనుటకు ఎలాంటి చర్యకైన వెనుకాడడంలేదు. అందుకు నిదర్శనం గల్ఫ్ ప్రాంతంలో అమెరికా ప్రయోజనాలకు ఐక్యరాజ్య సమితిని కూడగట్టుకొని ఈ ప్రాంతంలో తనకు విరోధియైన ఇరాక్‌పై యుద్ధంచేసి తన ప్రయోజనాలను కాపాడుకొంది.

## హిందూమహాసముద్రం-అగ్రరాజ్యాల ఆగడాలు:

రెండవ ప్రపంచ యుద్ధానంతరం బ్రిటిషువారి నావికాధిపత్యం హిందూ మహాసముద్రంలో అంతమవ్వడంతో 'శక్తి కొరత' ఏర్పడింది. ఆ తర్వాత ప్రపంచ దేశాలు ప్రచ్ఛన్న యుద్ధంలో మునిగిపోయాయి. కొన్ని ఈ ప్రాంత దేశాలు మాజీ పాలకదేశాలను అంటిపెట్టుకొంటే, ఇండియా అలీన విధానంను అవలంబించడం దానితో చాలా దేశాలు అలీనోద్యమంలో చేరాయి.

ముఖ్యంగా అగ్ర రాజ్యాలు ఈ ప్రాంతంలో ఆధిపత్యం చెలాయించడానికి కారణం నిలకడ స్థితి లేకపోవడం. ఈ ప్రాంత దేశాల ఆంతరంగిక వ్యవహారాలలో చొరబడి ఆ దేశంయొక్క పరిపాలనను నియంత్రణ చేయగలగడం. ఇండియా అలీనదేశంగా ఉండి 1955లో బాండింగ్ సమావేశం జరిపి ఆఫ్రో-ఆసియా దేశాలును కలిసికట్టుగా ఉండేలా చేసింది. కాని పాకిస్తాన్ అమెరికా చెప్పు చేతల్లోకెళ్ళడం ఇండియాలోని కాశ్మీరు సమస్యను అంతర్జాతీయసమస్యగా చేయడం ఇండియా—పాకిస్తాన్ వైరుధ్యం అంతం లేకుండా కొనసాగుతూనేఉంది. చైనా-రష్యాల మధ్య ఏర్పడిన బేధాలు వలన చైనా-పాకిస్తాన్‌కి మద్దతు యివ్వడం, రష్యా

ఇండియాకు సహాయం చేస్తుంది. అమెరికా,చైనీయులు, పాకిస్తాన్‌కు మద్దతునివ్వడం ఇండియా-పాకిస్తాన్‌నుండి వత్తిడి ఎదుర్కొనడంకు తనను తాను రక్షించుకొని అనేక పథకాలు వేయడం జరుగుతుంది. దీనితో ఎప్పుడూ ఈ ప్రాంతం వత్తిడి, వైషమ్యాలకు గురికావడం జరుగుతుంది.

అదే విధంగా శ్రీలంక అలీనదేశం అయినా రష్యా, చైనా, పాకిస్తాన్, అమెరికాల నుండి సమంగా సహాయంను పొందుతుంది. కాని అంతర్గతంగా జాతి ద్వేషానికి గురియై అస్థిరతను ఎదుర్కొనడంతో ప్రపంచంలో నుండే అన్ని ఉగ్ర వాద శక్తుల సహాయం ఈ దేశంలోని అస్థిరతవాదులకు దొరకడంతో ఎప్పుడు అంతర్గత సమస్యలతో సతమతమవుతుంది. ఎసియన్ దేశాలు [ఇండోనేషియా-మలేషియా, థాయిలాండ్, సింగపూర్] కూడ రష్యా, చైనాల ప్రభావంకు లోనవు తూనే వున్నాయి.

బ్రిటిషువారు మధ్య ఆసియా నుండి వైదొలగడంతో ఇరాన్ ఈ ప్రాంతంలో ఆధిపత్యం కొనసాగించింది. రష్యానుండి ఇరాన్ సహాయంను పొందేది. ఇరాన్ తరువాత విధానంను మార్చుకొని అమెరికా సహాయంను పొందడంతో ఇరాక్ రష్యా మిత్రుడుగా ఇరాన్‌తో సంబంధాలు త్రెంచుకొంది. ఇరాన్ కేంద్రీయ సంధి వ్యవస్థలో చేరి ఈ ప్రాంతంలో అన్ని దేశాలకంటే తన ఆయిల్ ధనంతో ఆయు ధాలను సంపాదించింది. 1978లో ఇరానులో షా నాయకత్వం అంతరించడంతో మత తత్వరాజ్యంగా ఏర్పడింది. 1979-89 వరకు ఇరాక్-ఇరాన్‌లు యుద్ధం చేశాయి.

ఇరాక్ రష్యా మద్దతుతో అనేక ఆయుధాలను సంపాదించింది దానితో ఇరాక్ తనఆధిపత్యం కొనసాగించడం మొదలయింది. అది అమెరికాకు నచ్చలేదు. ఇరాక్ అనాలోచితంగా మరో స్వతంత్ర్యదేశం కువైట్‌ను ఆక్రమించింది. ఇదే అవ నుగా అమెరికా కువైట్ మద్దతుపేరుతో ఇరాక్ ఆధిపత్యంను తొలగించింది.

రష్యా 1968 నుండి హిందూమహాసముద్రములో తన ఆధిపత్యం పెంచు కొంది. సంవత్సరానికి 21 యుద్ధనౌకలనుండి 5000 వరకు ఈ ప్రాంతంలో నుం చింది. రష్యా 30 వెస్సల్సు పైగా హిందూ మహా సముద్రంలో నుంచింది. సొమాలియా, ఎమెన్, ఇండియా, ఇండోనేషియాలలో తమ సైనిక షిప్‌లనుం చింది. అదేవిధంగా అమెరికా తన మిలటరీనౌకలు బాంగ్లాదేశ్, ఇజ్రాయిల్, పెర్షి యన్ గల్ఫ్‌ప్రాంతంలో పాకిస్తాన్, డిగోగార్షియాలోనున్నది. అమెరికా తన స్థావ

రాలను బలపరచుకొంటుంటే రష్యా తన ఆధిపత్యమును, స్థావరాలను వదులు కొంటుంది.

## డిగోగార్షియా:

డిగోగార్షియా హిందూమహాసముద్రంకు హృదయంలాంటిది. దీనిపై అమెరికా తనపూర్తి ఆధిపత్యంను కలిగింది. ఇక్కడనుండే గల్ఫ్యుద్ధంలో అమెరికా ముఖ్యమైన యుద్ధవ్యూహాన్ని నిర్వహించింది బ్రిటిషువారి ఆధిపత్యంక్రింద ఉండేది. 1964లో దీనిపై అమెరికా ఆధిపత్యం 1966 లో సంపాదించింది. అమెరికా ప్రచ్ఛన్నయుద్ధంలో రష్యా, చైనాలకు వ్యతిరేకంగా చర్యలు కొనసాగించడానికి డిగోగార్షియాను పూర్తిగా అత్యాధునిక ఆయుధాలతో అమర్చింది. 1973 లో కమ్యూనికేషన్‌లను అమర్చింది. దీనితో 34 కి॥మీ॥ డిగోగార్షియా హిందూమహాసముద్రంలో అమెరికా స్థావరాలయిన ఫిలిప్పైన్స్‌లో క్లార్క్ఫీల్డు, సుబిక్‌ఖాతం [Subic Bay]లు పాకిస్తాన్‌లోని కరాచి, పెషావర్‌స్థావరాలు అత్యాధునిక కమ్యూనికేషన్ల లింకుతో కలుపబడింది. దీనితో ఈ ప్రాంతదేశాలకు రక్షణకు ప్రతిబంధకం ఏర్పడింది.

డిగోగార్షియాను గూర్చి 1974 లోనే అమెరికా పెంటగన్ ప్రత్యేకాధికారి అడ్మిరల్ జిమ్మోవెద్ సెనెట్ కమిటీముందు 'హిందూమహాసముద్రం సైనిక ఆధిపత్యంను ప్రదర్శించడానికి మంచికేంద్రంగా' పేర్కొన్నాడు. ఈ ప్రాంతంతో అమెరికా ఆధిపత్యంను నెలకొల్పడానికి ప్రధాన కేంద్రంగా గుర్తించింది. 1971 లో అమెరికా 7వ ఫ్లీటు ఈ ప్రాంతంలో ప్రవేశించి పర్యవేక్షించడానికి కేంద్రీకరించబడింది. 1980 లో అమెరికా బందీలను ఇరాన్‌నుండి విడించడానికి బాగా ఉపయోగపడింది 1987లో సైచిలన్‌లోను, 1989లో మిలిటరీ తిరుగుబాటును అమెరికా అణచడానికి ఉపయోగపడింది. డీగోగార్షియా అమెరికా బందీలను ఇరాన్ నుండి విడిపించడానికి బాగా ఉపయోగపడడంతోపాటు మధ్యఆసియాలో తనప్రయోజనాలను కాపాడుటకు బాగా ఉపయోగపడింది. డిగోగార్షియా అమెరికాకు మిలటరీ పరంగానేకాక అమెరికా ఆధిపత్యంను నెలకొల్పడంకు లించ్‌ఫెన్‌లాగా ఉపయోగపడుతుంది.

ఈ ప్రాంతదేశాలన్ని రక్షణకు ప్రతిబంధకం ఏర్పడింది. దానితో ఈతీరే

ప్రాంతాలదేశాలు కలిసి హిందూమహాసముద్రప్రాంతంలో ఉద్రిక్తతలను తొలగించ డానికి కృషిచేయాలని నిశ్చయించి 1971 లో శాంతి మండలంగా గుర్తించాలని కోరాయి.

## హిందూమహాసముద్రం-శాంతిమండలం;

రష్యా-అమెరికాల హిందూమహాసముద్రంలో ప్రయోజనాలకై పోటీ పడ దంతో ఈ ప్రాంతం దేశాలలో శాంతి భంగం ఏర్పడుతుంది. దీనితో అలీనదేశాలు ఈ ప్రాంతంను తటస్థప్రాంతంగా మార్చాలని ప్రయత్నం సాగించాయి. శ్రీలంక ఈ ప్రాంతంలో కేంద్రస్థానంను కలిగిఉంది. అయినా బలహీనమయింది. అస్థిర త్వాన్ని ఎదుర్కొనడంతో హిందూమహాసముద్రం తీరప్రాంతం శాంతిమండలంగా కొనసాగాలని అలీనదేశాలు, ఐక్యరాజ్యసమితిలో ప్రతిపాదించింది. 1964 లో కైరో అలీనదేశాల సమావేశంలో హిందూమహాసముద్ర ప్రాంతంను "అణుయింధన లేని ప్రాంతంగా గుర్తించాలని పేర్కొంది"

1970 మూడవ అలీనదేశాల 'లుసాకా' సమావేశంలో మొదటిసారిగా హిందూమహాసముద్రప్రాంతంను శాంతియుతమండలంగా గుర్తించాలని పేర్కొంది. 1971 కామన్‌వెల్తు దేశాల అధిపతుల సమావేశంలో శ్రీలంక హిందూమహాసము ద్రంను శాంతియుత మండలంగా ప్రకటించాలని ఈ దేశాలలో శాంతిని నెలకొల్పా లని కోరింది. ఎందుకంటే డిగోగార్షియాలో తమ సైనికస్థావరాలను, సంపత్తిపెంచు తుంది. కనుక శాంతి కరువైందని పేర్కొంది.

ఐక్యరాజ్యసమితి సాధారణ సభ 26వ సమావేశంలో 1971 లో హిందూ మహాసముద్రంను శాంతిమండలంగా గుర్తించాలని కోరడం ప్రకటన చేయించింది. దీనితో అగ్ర,పెద్దరాజ్యాలు ఈ ప్రాంతంలో ఆయుధాల స్థావరాలను ఏర్పరచడం నిలిపివేయాలని ఆయాదేశాలతో చర్చలు జరపాలని ప్రతిపాదించింది. 27 వ ఐక్య రాజ్యసమితి సాధారణసమావేశంలో కూడ ఇదేప్రతిపాదనను చేయించి తాత్కాలిక సంఘంను ఏర్పాటుచేసి ఆ ప్రాంతంలో ఏ విధంగా నష్టం వాటిల్లుతుందో అంచనా వేయాలని చెప్పింది. 1973లో అన్ని అంశాలతో ఒక రిపోర్టు సమర్పించింది. 28వ సమావేశంలో ఈ ప్రాంతంలో పెద్దదేశాలు ఏ ఏ ప్రాంతంలోనున్నాయి. రిపోర్టును కార్యదర్శికి నివేదించింది. ఆ రిపోర్టులను అధ్యయనంచేసిన తర్వాత 28 సమావే శంలోనే ఈ ప్రాంతంలోని దేశాలను చుట్టుప్రక్కల దేశాలు ఈ హిందూమహాసము

ద్రంను శాంతిమండలంగా కొనసాగేటట్లుచూడాలని కోరింది. అప్పటినుండి అగ్ర రాజ్యాలు బాహాటంగా తమఆశయాలనెరవేర్చుటకు తమ వ్యూహరచనలను చేస్తూనే ఉంది. అగ్రరాజ్యాలు రెండు తమప్రయోజనాలను ఈ ప్రాంతంలో వదలుకోనంత వరకు శాంతిమండలంగా కొనసాగడంజరుగదు. కాని ఈ ప్రాంతదేశాలలో అరక్షణ, అస్థిరతకు ఈ హిందూమహాసముద్రంలోని సైనిక మోహరింపుకు దగ్గర సంబంధం ఉంది. అంతర్జాతీయంగా అనేక అస్థిరత్వం సృష్టించే ముఠాలు ఈ ప్రాంతంలో చీకటి వ్యాపారంను, ఆయుధాల స్మగ్లింగ్‌ను, మత్తుమందుల చీకటి వ్యాపారం భారీయెత్తునచేస్తూ ఆయాదేశాల ప్రభుత్వాలను పడగొట్టడం తమకు అనుకూలమైనవారిని అధికారగద్దెమీద కూర్చుండబెట్టడం జరుగుతుంది. ఈప్రాంతంలో శాంతిసమాధానంను ఏర్పరచకపోయినట్లయితే ఈ ప్రాంతంలో అస్థిరత్వం కొనసాగుతూనే ఉంటుంది.

## హిందూమహాసముద్రం-ఇండియాప్రయోజనాలు:

ఇండియా అలీనదేశం కనుక శాంతిమీద ఎక్కువ నమ్మకం. శాంతి ఏర్పడడం అభివృద్ధిపెరుగుతుంది. అభివృద్ధిపెరగడంవలన దేశంలో స్థిరత్వం ఏర్పడుతుంది. అంతర్జాతీయంగా ఆ దేశంయొక్క హోదా పెరుగుతుంది. హిందూమహాసముద్రపు పరివాహకప్రాంతంలో ఇండియా పెద్దదేశం. ఇండియా నౌకాదళంకూడ సైనికంగా మిగతాదేశాలకంటే అమెరికా, రష్యాల తరువాత మూడవది. అమెరికా, రష్యాలు తమప్రయోజనాలను హిందూమహాసముద్రంలో పెంచుకొనడంతో ఇండియా 20 సం॥రాల నావికా ప్రణాళికను రూపొందించుకున్నది.

ఇండియా నావికాధిపత్యం ఈ ప్రాంతంలో కొనసాగుతుంది. ప్రభుత్వం నౌకాదళంలో ఎక్కువ షిప్‌లు కావాలని తగినన్ని ఆధునిక నావికా యుద్ధవిమాన వాహనాలు సమకూర్చుకొన్నది. సుమారు 150 ఆధునిక యుద్ధనౌకలున్నాయి. దీనితోపాటు తగినంతగా ఆధునిక నౌకా కమ్యూనికేషన్‌లు, రేడార్లు మరమ్మత్తు సౌకర్యాలున్నాయి. హిందూమహాసముద్రంలో ఇండియా పెద్దనౌకాధిపత్యం కలిగిన దేశంగా గుర్తించబడింది. ఇండియా శాంతికాముకదేశం కనుక ఏ దేశంను సైనిక పరంగా నౌకాసామగ్రిని చేకూర్చుకొనవలసిన అవసరంలేదు. ఈ ప్రాంతంలో దక్షిణ ఆఫ్రికాతో మినహా అన్నిదేశాలతో శాంతియుత సంబంధాలున్నాయి. కాని నౌకాదళంను సమకూర్చుకొనుటలో ముఖ్యోద్దేశ్యం వివిధరకాలైన శత్రుదాడులను

ఎదుర్కొనడానికి, ప్రత్యక్షంగా, పరోక్షంగా హిందూమహాసముద్ర ప్రాంతంను పరిరక్షించుకొనుటకు ఈ ప్రాంతంలో ఎప్పుడైన అగ్రరాజ్యాలయొక్క ప్రవేశాన్ని అరికట్టడానికి కావలసి ఉంటుంది.

ఇండియా-అమెరికా-రష్యాలతో మంచిసంబంధాలున్నాయి. ఈసంబంధాలు ఎప్పుడైనా చెడిపోయి యుద్ధంవస్తుందనికాదు. కాని ఇండియా ముఖ్యోద్దేశ్యం బల మైన నౌకావాహిని అన్నిదేశాలకు తెలుసుకొనేలా హిందూమహాసముద్రంలో నుంచడం, హిందూమహాసముద్రంలో మోహరించియున్న అగ్రరాజ్యాలయొక్క సైన్యం ఎప్పుడైనా ఏ విధమైన తిరుగుబాటులకు దిగకుండేటట్లు అప్రమత్తంగా ఉంచడం.

ఇటీవలకాలంలో ఇండియా హిందూమహాసముద్రంలో రెండుపథకాలను చేపట్టింది. అవి ఇండియా సముద్రతీరప్రాంతంనుండి ఖనిజసంపదను వెలికితీయడా నికి కావలసిన సాంకేతికపరిజ్ఞానంను సమకూర్చుకొంది. ప్రపంచంలో సముద్ర పరివాహక తీరప్రాంతంనుండి ఖనిజలవణాలను వెలికితీయు దేశాలలో ఇండియా ఆరోవది. మూడవ ప్రపంచదేశాలలో మొదటిదేశం అయింది. ఇండియా సముద్ర జలాలనుండి ఖనిజసంపదను వెలికితీయు దేశాలలో ఒకటిగా నూతన అంతర్జాతీయ తీరప్రాంతాల చట్టంచే గుర్తించబడింది.

ఇండియాకు సుమారు 1,50,000 చదరపు మైళ్ళ సముద్ర తీరప్రాంతంలో తన యొక్క ఆపరేషన్స్‌ను కొనసాగించవచ్చును. ఇండియా యొక్క సముద్రాభి వృద్ధిశాఖ, జాతీయ సముద్రాభివృద్ధి సంస్థలు సముద్రతీర ప్రాంతాలు గుర్తించడం, ఆపరేషన్స్‌కు తగిన ప్రాంతాలను గుర్తించి హిందూ మహాసముద్ర తీరప్రాంతంలో ఖనిజ సంపదను వెలికి తీయడానికి తోడ్పడుచున్నవి. ఈ స్థితిలో ఇండియా ముఖ్యమయిన వ్యాపార, ఆర్థిక వనరుల పరిధి కాపాడుకొంటుంది.

అదే విధంగా ఇండియా ఏర్పరిచిన అంటార్కిటికాలో సముద్ర తీరప్రాంతం ప్రయోజనాలను కాపాడుకొనడం. ఇండియా అంటార్కిటికా ప్రాంతానికి మూడు సార్లు విజయవంతంగా యాత్రలను జరిపి తన స్థావరాలను దక్షిణ గంగోత్రిగాను ఏర్పరచింది. ఆ స్థావరంలో శాశ్వత శాస్త్రీయ పరిశోధన పరికరాలను అమర్చింది. 10,000 అడుగుల విమానం దిగడానికి అనువుగా ప్రాంతంను నిర్మించింది. దీని ద్వారా డైరెక్టుగా విమానాలను వెళ్ళరావడానికి తగిన సౌకర్యాలను ఏర్పరచుకొంది.

ఇండియా అంటార్క్టికా ఒప్పందపు సలహా సంప్రదింపుల వర్గంలో చేరింది. దీనితో ఇండియా యొక్క వాణిజ్య-శాస్త్రీయ ప్రయోజనాలను, అంటార్క్టికా సంపదను కాపాడు కొనవచ్చును. ఇండియా హిందూమహా సముద్ర ప్రాంతంలో అంటార్క్టికాలో ప్రయోజనాలు కేవలం శాస్త్రీయ, వాణిజ్య పరమయినవి. వాటిని పరిరక్షించవానికి ఇండియాకు తగిన నౌకాశక్తి అవసరం.

ఇండియా హిందూమహా సముద్రంలో అగ్రరాజ్యాలతో సైనికపరంగా లేని ప్రయోజనాల కొరకు సమన్వయం ఏర్పడచుకొంటుంది. అగ్రరాజ్యాలు ఎప్పు డయినా ఇండియా ప్రయోజనాలను అరికట్ట వచ్చు కనుక తగిన అప్రమత్తతో మెలగవలయును. అందువలన ఇండియా తనయొక్క నౌకాబలంను వృద్ధి చేసు కొనుట ఎంతైన అవసరం.

హిందూమహా సముద్రం సైనికంగా వత్తిడిని కలిగిన ప్రాంతం. అమెరికా యొక్క 6-7వ ప్లీటులు యితర సైనిక సామాగ్రి డిగోగార్షియాలోనే మోకరించి యున్నాయి. కనుక దీని పరివాహక ప్రాంతాలు అమెరికా ప్రయోజనాలను కని పెడుతూ అప్రమత్తంగా ఉండాలి. అంతేకాక ఈ ప్రాంతంలో 1971 ఐక్యరాజ్య సమితి ప్రతిపాదనను హిందూమహా సముద్రం శాంతియుతంగా ఉండాలి అనేది అమలు చేయవలసిన ఆవశ్యకత ఎంతయిన ఉంది. లేని యెడల ఆయుధపోటీ చివరకు తమ స్వాతంత్ర్యంను కోల్పోవలసిన స్థితి ఏర్పడుతుంది. అదే విధంగా ఈ ప్రాంతంలోని సమస్య పరిష్కారంకు చాల ఉన్నాయి. వాటిలో పాలస్తీనీయుల సమస్య. పశ్చిమాసియాలో శాంతి సమాధానంతో స్థిరత్వంను నెలకొల్పుట ఆసియా ఆఫ్రికా దేశాలు స్వతంత్ర్యం ప్రజల హక్కులను కాపాడవలసుంది. అంతేకాక మారిన ప్రపంచ సంబంధాలలో హిందూమహా సముద్ర ప్రాంతాలకు తీవ్రనష్టం కలిగే ప్రమాదం ఉంది. ఎందుకంటే ద్వైపాక్షిక అగ్రరాజ్యాలు-ఇప్పుడు కేవలం ఏకైక అగ్రరాజ్యం అమెరికాయే అయింది కనుక ఈ ప్రాంతంలో అమెరికా అత్యాధునిక ఆయుధాలను సమకూర్చింది. కనుక ప్రతిదేశం రవ అంతర్జాతీయ చర్యలను లాభనష్టాలను బేరీజు వేసుకొని అప్రమత్తంగా లేనియెడల తమ స్వాతం త్ర్యతను కోల్పోయే ప్రమాదం వుంది. ఆ ప్రమాదం వాటిల్లకపుండే ఐక్యరాజ్య సమితి ప్రతిపాదనంను అమలు చేయడానికి ఈ ప్రాంత దేశాలు వత్తిడి చేయవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది.

# 12. ఇండియా - పాకిస్తాన్ సంబంధాలు

భారత ఉపఖండం ఇండియా-పాకిస్తాన్‌గా 1947 ఆగస్టులో విడిపోయింది. అప్పటివరకు ఒకటిగా జీవనం కొనసాగించిన వారు రెండు దేశాలుగా చీలి పోయాయి. అయినా వీటిమధ్య సత్సంబంధాలు నెలకొల్పడానికి ఆనాటి నెహ్రూ ప్రభుత్వం కృషి చేసిందికాని ఏవైతే మత కారణాలతో భరతఖండ దేశాలు విడి పోయాయో వాటినే కొనసాగిస్తూ పరస్పర విరుద్ధ వైఖరిని కొనసాగిస్తున్నాయి.

స్వాతంత్ర్యం పొందిన వెంటనే భూభాగాల పంపకం విషయంలో రెండు 1948లో యుద్ధానికి తలపడ్డాయి. కాని ఇండియా దానిని త్రిప్పి కొట్టింది. అప్పుడు ఈ రెండుదేశాలమధ్య రెడ్‌క్లిఫ్‌రేఖను ఏర్పాటుచేశారు. అయినా 1948లో ఆక్రమించు కొన్న కాశ్మీరును అజాద్ కాశ్మీరుగా ఉంది. అంతేగాక ఇండియా 1950కి చిన్న చిన్న రాజ్యాలన్నింటిని భారతదేశంలో కలిపివేయడం జరిగింది. అంతేగాక యీ రెండింటి మధ్య విరోధభావం కొనసాగడానికి 40 సం॥రాలుగా వ్యతిరేక సంబంధాలు కలిగి ఉండడానికి కారణాలు.

భిన్న మతాలుకు ప్రాతినిధ్యం వహించడం,ఆసియా రాజకీయాలలో పాకిస్తాన్ అగ్రరాజ్యాల చేతుల్లో పావులా తయారవడం. ఆసియా రాజకీయాలలో భారతదేశం ప్రతిభ, సభావాలను చూపినట్లయితే తన స్వీయం రక్షణకు భంగం వాటిల్లుతుందనే పాకిస్తాన్ వాదన. ఇండియా 1974లో అణుఇంధన శక్తి పొందింది. పాకిస్తాన్‌కు లేదనే తపన, కొన్ని ముస్లిం రాజ్యాలుకు నాయకత్వం వహించాలనే ఆకాంక్షతో పాకిస్తాన్‌కు ధనమాన సంరక్షణలు అందించడం, పాకిస్తాన్ ఇండియాలోని మత వాదులకు ప్రోత్సాహాన్నందించడం జరుగుతుంది. ముఖ్యంగా పంజాబ్‌లోని ఖలిస్తాన్ వాదులకు, కాశ్మీరులోని ఏర్పాటు వాదులకు చేయుతనిచ్చి ఇండియాలోను అల్లకల్లో లము సృష్టించడంలో తోడ్పడడం వంటివి ఒక యెత్తు. అయితే 1947 ఉపఖండ విభజన వలన తల ఎత్తిన సరిహద్దు సమస్య ఇంకొక యెత్తు. యిందులో కాశ్మీరు సమస్యను 1948లో ఐక్యరాజ్య సమితికి ఇండియా అనాలోచితంగా తీసుకెళ్ళడం. ఆ తరువాత ఐక్యరాజ్యసమితి ప్రతినిధులతో కూడిన కమిటీని నియమించడం. కాశ్మీరులో ప్రజాభిప్రాయం ద్వారా భవిష్యత్తును నిర్ణయించమనడం కాశ్మీరులో

ప్రజాభిప్రాయం ద్వారా భవిష్యత్తును నిర్ణయించడం ఇప్పటివరకు ఏ విధమయిన పరిష్కారం కాశ్మీరుపై కుదరడంలేదు.

**కాశ్మీరు సమస్య :**

అదే కాశ్మీరు సమస్యను ఇండియా–పాకిస్తాన్ దేశాలమధ్య యీ నలుబది సంవత్సరాలనుండి వైరంనకు, దిగడానికి. అంతర్జాతీయ సభలలో, సమావేశాల లోను పాకిస్తాన్ కాశ్మీరు సమస్యను లేవనెత్తడం జరుగుతుంది. ఐక్యరాజ్యసమితి కౌన్సిల్‌లో 21 సార్లకు పైగా లేవనెత్తడం అది వీగిపోవడం జరిగింది. మిగతా అంతర్జాతీయ మీటింగులలో, సమావేశాలలో కాశ్మీరు సమస్యను లేవనెత్తడం ఇండియా దాన్ని వ్యతిరేకించడం ఎన్నోసార్లు జరిగింది.

యీ కాశ్మీరు సమస్య దేశవిభజనతో యీ రెండు దేశాల మధ్య యింకా అంటే 1992లో కూడా కొనసాగుతుంది. ఎందుకంటే కాశ్మీరు సమస్య పూర్తిగా ఇండియా సమస్య 1948లో కాశ్మీరు సంస్థానాధిపతి రాజామాన్‌సింగ్ ఇండియాలో చేరడానికి మొగ్గు చూపాడు. తను హిందువు. అక్కడ జనాభా మెజారిటీ అంటే 77 శాతం ముస్లింలు. 1948లో నెహ్రూ వాస్తవిక దృక్పథాన్ని అవలంబించి సైన్యంను పంపి ఆక్రమించుకోవలసింది. 1947 ఇండో–పాక్ ఘర్షణల తరువాత నెహ్రూ దాన్ని అనాలోచితంగా ఐక్యరాజ్యసమితికి నివేదించడంతో ఐక్యకమిటీ కాశ్మీరులో ప్రజాభిప్రాయాన్ని నిర్వహించమంది. కాని నేటికి ఇండియా నిర్వ హించలేదు. ఎందుకంటే అది ఇండియా అంతర్గత సమస్య. ఆనాడే శ్రీ పటేల్ సంస్థానుల విలీనంలో కాశ్మీరును కలిపి ఉన్నట్లయితే నేడు యీ సమస్యను ఎదు ర్కొనవలసి ఉండేది కాదు. అప్పటితో పాకిస్తాన్ ఇండియా బద్ధ వ్యతిరేకత.చైనా, సెంటో (CENTO) దేశాలతో దగ్గర సంబంధాలను పెట్టుకొంది.

1965లో కాశ్మీరును ఆక్రమించడానికి పాకిస్తాన్ మరొక ప్రయత్నం చేసింది. అప్పుడు పాకిస్తాన్ పూర్తిగా విఫలమయింది. ఇండియా–పాకిస్తాన్‌లమధ్య స్నేహసంబంధాలు నెలకొనడానికి 1966లో తాష్కెంట్‌లో సోవియట్ రష్యా మధ్యవర్తిత్వంలో శాంతి సమావేశం యేర్పాటు చేయడం జరిగింది. రెండు దేశాలు తమ సమస్యలను పరిష్కరించు ఒప్పందంను కుదుర్చుకొన్నాయి. కాని పాకిస్తాన్

ఇండియా సయోధ్యతో మెలగేదికాదు. దీనికి పాకిస్తాన్‌లో స్థిరమైన ప్రజాస్వామ్య ప్రభుత్వం లేకపోవడం కారణం కావచ్చును. ఏవో కొద్ది రోజులుతప్ప ఎప్పుడు సైనిక ప్రభుత్వం కొనసాగించేది. జనరల్ యాహ్యాఖాన్ తరువాత వచ్చిన వారు కూడా ఇండియాతో సత్సంబంధాలును ఏర్పరచడానికి ప్రయత్నించకుండ ఉండ డంతో అట్లానే విరుద్ధ వైఖరితో కొనసాగాయి. అదే విధంగా కాశ్మీరు సమస్యను ప్రతి సమావేశంలో ఇండియాకు వ్యతిరేకంగా లేపడంజరిగేది. ఈ రెండు యుద్ధం చేయం అని ఒప్పందం కుదుర్చుకోవడానికి అటు అగ్రరాజ్యాలు పాకిస్తాన్‌కు అమెరికా మద్దత్తు, ఇటు ఇండియా రష్యాకు దగ్గరగా ఉండడంతో రెండిటి మధ్య అగాధం పూడ్చడానికి ఇరువైపుల వారు ప్రయత్నించలేదు. భూట్టో అధికారంలోకి పాకిస్తాన్‌లో వచ్చాక కూడ ఈ వైఖరి కొనసాగింది. అప్పట్లో అంతర్జాతీయంగా ప్రచ్ఛన్న యుద్ధం తీవ్రస్థాయిలో ఉన్నప్పుడు పాకిస్తాన్ ఇండియాపై అబండాలు వేయడం జరిగింది. అదే సమయం పాకిస్తాన్‌లో అరాజకత్వం చేసిన ప్రభుత్వ వర్గాలుకు వ్యతిరేకంగాను తూర్పు పాకిస్తాన్‌కు స్వాతంత్ర్యం కావాలని కోరాయి. దానికి పాకిస్తాన్-ఇండియాల మధ్య సంబంధాలు నిర్ణయించడంలో కాశ్మీరు సమస్య అత్యంత ప్రాధాన్యత వహిస్తుంది. నేటికి ఈ సమస్య కొరగాని కొయ్యలా తయా రయింది. అదే విధంగా పాకిస్తాన్ ఇండియాకు వ్యతిరేకంగా అమెరికాకు తోడ్ప డము కరాచి అరేబియా సముద్రాలలో స్థావరాలను ఏర్పరచుకోవడం ఇండియా రక్షణకు ప్రతిబంధకంగా తయారయింది.

బాంగ్లాదేశ్ స్వాతంత్ర్యం విషయంలో ఇండియాతోడ్పాటును అన్ని దేశాలు ప్రశంసించాయి. కాని పాకిస్తాన్ ఇండియా బాంగ్లాదేశ్ స్వాతంత్ర్యంకు మద్దత్తు నిచ్చిందనే సాకుగా తీసుకొని 1971లో ఇండియాపై దాడిచేసింది. అప్పుడు ఇండియా దానిని త్రిప్పికొట్టింది. పాకిస్తాన్‌కు సహాయంగా 7th ఫ్లీటును ఇండియాకు వ్యతిరేకంగా బంగాళాఖాతంకు పంపింది. అదే స్థితిలో ఇండియా తూర్పు పాకిస్తాన్‌లో శ్రీ ముజిబుర్ రెహమాన్‌కు మద్దత్తు యుద్ధంలో దిగి పాకిస్తాన్‌ను ఓడించింది. అప్పుడు శ్రీమతి ఇందిరాగాంధీని బాగా పొగిడారు. ఆ తరువాత ఇండియా పాకిస్తాన్‌ల మధ్య శాంతి స్థాపనకొరకు సిమ్లా ఒప్పందంను 1972లో చేసుకోవడం జరిగింది. ఈ ఒప్పందంలో ఇండియా-పాక్‌ల మధ్యనున్న సరిహద్దు రక్షణ సమస్యలను చర్చల, సంప్రదింపులు, మధ్యమ మార్గం ద్వారా పరిష్క

రించుటకు అంగీకరించాయి. బాంగ్లాదేశ్ స్వతంత్ర దేశంగా 1971 డిశంబర్‌లో ఏర్పాటుచేశారు. ఉపఖండంలో మూడు దేశాలైనాయి.

1972 సిమ్లా ఒప్పందం తరువాత పాకిస్తాన్, ఇండియా సంబంధాలు కొన సాగించిన వారి వారు ఆయుధాలును సమకూర్చుకోవడం, ప్రచ్ఛన్న యుద్ధానికి తల పడడం, సరిహద్దు ప్రాంతంలో రెండుదేశాలమధ్య ప్రయోజనలకు విరుద్ధంగా ఉగ్ర వాదులకు సహాయపడడం కాశ్మీరులో అల్లరు సృష్టించడం జరిగింది. అయినా యిండియా, పాక్‌లమధ్య వాణిజ్య వ్యాపార సంబంధాలు మాములుగానే కొనసాగు తూనే ఉన్నాయి.

1974లో ఇండియా పొకారాన్ ప్రాంతంలో అణు ఇంధన పరిక్ష జరిపి అణు ఇంధనం శక్తి కలిగిన 6వ దేశం అయింది. అప్పటి నుండి పాకిస్తాన్ మనో భావం భయం పడుతున్నట్లు చెప్పి అమెరికానుండి పశ్చిమ దేశాలనుండి ఆర్థిక, రక్షణ సహాయంను పొందింది. అంతేకాక అమెరికా అరేబియా సముద్ర ఏరియా లోను రష్యా అగ్రరాజ్యాన్ని ఎదుర్కొనకానికి పాకిస్తాన్‌ను వాడుకోవడం జరిగింది. అంతేకాక పాకిస్తాన్,ఆఫ్ఘన్ గెరిల్లాలుకు సహాయపడుతూ అమెరికా ప్రయోజనాలను పరిరక్షించుతుంది. ఆఫ్ఘన్ గెరిల్లాలకు పాకిస్తాన్‌కు అన్నివిధాలుగా మద్దతునిచ్చింది. ముస్లిం దేశాలకు పాకిస్తాన్‌ను అణుఇంధన దేశంగా తీర్చిదిద్దడానికి అనేకవిధాలుగా ఆర్థిక సహాయంను అందించాయి. అదేవిధంగా సౌదీఅరేబియాలోని అణు స్థావ రాలపై ఇజ్రాయిల్ దాడిచేసి పాడుచేశాయి 1982లో అప్పట్లో పాకిస్తాన్ రహ స్యంగా అణు ఇంధనంను సమకూర్చు కొనుటకు అన్ని విధాలుగా పాకిస్తాన్ కృషి చేస్తుంది. 1988కి పాకిస్తాన్‌కు అణుబాంబు ఉన్నట్లు ఊహాగానాలు ఉన్నాయి.

పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్ అంతర్గత సమస్యలలో జోక్యం చేసుకొనడం ఇండియా ఆఫ్ఘనిస్తాన్ శరణార్థులకు ఆశ్రయం కల్పించి తమ తమ ప్రయోజనాలను కాపాడు కొంటున్నాయి. అదే విధంగా పాకిస్తాన్ -ఇండియా-చైనాలు తమ సరి హద్దు సమస్యలను పరిష్కారంకు చర్చలు జరుపుతుంటే పాకిస్తాన్ చైనాతో ఆక్ర మిత కాశ్మీరు నుండి చైనా రవాణా మార్గం కల్పించి చైనాతో దగ్గర సంబంధాలు పెట్టుకొని తన ప్రయోజనాన్ని కాపాడుకొంటుంది.

పాకిస్తాన్‌లో 1988 లో జరిగిన ఎన్నికలలో బలహీన ప్రభుత్వం ఏర్పడ డంతో ఇండియాపై కాలు దువ్వడం జరుగుతుంది. అదే రీతిలో 1989 ఇండియాతో

సాధారణ ఎన్నికల నంతరం కేంద్రంలో బలహీనమైన సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడటంతో పాకిస్తాన్ తన విద్రోహ చర్యలను మరింత అధికం చేసింది. ఎప్పుడైతే కాశ్మీరులో కమ్యూనల్ అల్లర్లు చెలరేగినాయో అదే అదను తీసుకొని పాకిస్తాన్-ఇండియాపై వత్తిడి తెస్తుంది. సైన్యంనకు కావలసిన అన్ని ఏర్పాట్లు చేసుకొంటుంది. ఈ యుద్ధ వాతావరణం ఏర్పడానికి సన్నిహిత కారణం ఫిబ్రవరి 1990 లో పాకిస్తాన్ ప్రధాని శ్రీమతి బెనజిర్ భుట్టో కాశ్మీరును విముక్తి చేయడానికి 1000 సంవత్సరాల యుద్ధం కొనసాగిస్తామని ప్రకటించింది. అంతేకాక దీనికి ప్రతిగా భారత ప్రధాని శ్రీ విశ్వనాథ ప్రతాప్ సింగ్ పాకిస్తాన్-ఇండియాతో 1000 గంటలు యుద్ధం చేయగలదా? అని ప్రశ్నించడంతో యింకా యుద్ధ ఉద్రిక్తతా వాతావరణం ఎక్కువయ్యాయి. పాకిస్తాన్ ఇండియాలో చేస్తున్న చర్యలలో ఉగ్రవాదులకు శిక్షణ, ఆయుధ సామాగ్రిని అందించడం అల్లకల్లోలం సృష్టించడం. కాశ్మీరు ఉగ్రవాదులను పెంచి పోషించడం అనేక రకాలుగా ఇండియాలో అస్థిరత్వానికి ఆజ్యం పోస్తుంది.

## ఇండియా-పాకిస్తాన్- సైనిక సామర్థ్య సమతౌల్యస్థితి

| ఇండియా | — | పాకిస్తాన్ |
|---|---|---|
| 12,60,000 | (1) మొత్త సైన్యం శక్తి | 5,20,000 |
| 11,00,000 | (2) పదాది దళం | 4,80,000 |
| 3,150 | (3) యుద్ధ టాంకులు | 1,750 |
| 3,860 | (4) ఆర్టిలరీ | 1,500 |
| 600 | (5) భూమిపై నుండి వదిలే వాయు క్షిపణులు | 244 |
| 1,10,000 | (6) వాయుసేన | 25,000 |
| 744 | (7) యుద్ధ విమానాలు | 451 |
| 152 (10 ఎక్కువ బరువు మోయు M1-26 హెలికాప్టర్లు) | (8) హెలికాప్టర్లు | 20 (ఒకటి రవాణా చేయు ఫైటు) |
| 1×6 | (9) ట్రాన్సుపోర్టు విమానాలు | 51 |
| 50,000 | (10) నౌకాదళం | 15,000 |

| | | |
|---|---|---|
| 2 | (11) విమానాలను మోయు నౌకలు | 0 |
| 17 | (12) సముద్ర అంతర్గాములు | 6 |
| 5 | (13) సముద్ర డిస్ట్రాయర్లు | 7 |
| 20 | (14) ఫ్రిగెట్స్ | 10 |
| 9 | (15) కార్వెట్స్ | 0 |
| 13 | (16) మిస్సైల్ క్రాఫ్ట్సు | 8 |

నేడు రెండు దేశాల వద్ద అనేక విధాలుగా సాంకేతిక పరిజ్ఞానంలో ఎన్నో మార్పులు వచ్చాయి. కనుక యుద్ధం చేస్తే 1971 కంటే క్వాలిటీలో తేడా ఉంటుంది. రెండు దేశాలు విదేశాల నుండి నూతన సాంకేతిక పరిజ్ఞానంను దిగుమతి చేసుకొంటున్నాయి. రెండింటికిని ఒక దానిపై ఒకటి (హిట్) కొట్టేవి ఉన్నాయి. కమ్యూనికేషన్లలో కూడ ఎన్నో మార్పులు వచ్చాయి.

1990లో ఇరాక్-కువైట్‌ను కబళించడం అమెరికా కువైట్‌కు మద్దతుగా అమెరికా గల్ఫ్ ప్రాంతంలో యుద్ధం చేయడం మొత్తం ఇస్లాం దేశాలకు గొడ్డలి పెట్టులాంటిది. అదే సమయంలో ప్రచ్ఛన్న యుద్ధం అంతరించడం, రష్యా అగ్ర రాజ్య స్థానాన్ని కోల్పోవడం అనేక మార్పులు వచ్చాయి. దానితో పాకిస్తాన్ ఇరకాటంలో పడింది. ఎందుకంటే పాక్ అమెరికా నుండి నిధులు తక్కువైనాయి. దానితో పాక్ ఆర్థికంగా ఇబ్బందుల్లో పడింది. ఎప్పుడు ఉద్రిక్తతా వాతావరణంలో కొనసాగడం పాకిస్థాన్‌కు యిష్టం. ఇప్పుడు అమెరికా గల్ఫ్‌లో తన పలుకుబడిని పెంచుకోవడానికి ప్రయత్నించుతుంది.

1982 నుండి ఇండియా-పాకిస్తాన్‌లో దక్షిణాసియా దేశాలలో సభ్యులు రాంద్రు. సార్క్ దేశాల మధ్య సాంకేతిక సాంస్కృతిక, విద్యా మార్పిడులను చేసుకొంటున్నాయి. అయినా ఇండియా దక్షిణాసియా ప్రాంతంలో ఆధిపత్యంకు కృషి చేస్తుందని పాకిస్తాన్ ఆరోపించడంతో సార్క్ నీరు గారి పోతుంది. సమర్థవంతంగా అనుమానాలు లేని సమన్వయ సహకార సంఘంగా కొనసాగడం లేదు. అంతేకాక ఇండియా, పాక్‌లు సుహృద్భావంతో కృషిచేయ వలసి ఉంది.

యిట్లా పాకిస్తాన్-ఇండియాలు తమ మిలిటరీ స్థావరాలను ఆయుధాలను పెంచుకొంటు పోతున్నాయి. దీనికంతటికి కారణం ఇండియాపై అనుమానమేనని పాకిస్తాన్ అంటుంది. కాని అది నిజం కాదు. సరిహద్దు ప్రాంతాలలో ఉద్రిక్తతలను

ఏర్పరచి అమెరికా, పశ్చిమ దేశాల నుండి ఆర్థిక సహాయంను పొందడం ఆన వాయితీ అయింది పాకిస్థాన్‌కు.

ఇండియా-పాక్‌లు భిన్నమతాలుండడం వలన ఒకరి నొకరు పై దుమ్మెత్తి పోయడం జరుగుతుంది. అదే విధంగా ఇండియాలో ఏమి జరిగిన పాకిస్తాన్ మత పరంగా ప్రకటనలు చేయడం మంచిదికాదు.

ఇటీవల పాకిస్థాన్ 1992 జూన్‌లో ఆఫ్ఘనిస్తాన్‌లో మామూలు పరిస్థితులు నెలకొంటున్న తరుణంలో సింధూ రాష్ట్రంలో అల్లర్లు జరుగడం, దానికి ఇండియా ప్రోత్సాహం ఉందంటం హాస్యాస్పదం కదా! అయినా ఇండియా దౌత్య కార్య కర్తలు పాకిస్తాన్‌లో రహస్య కార్యకలాపాలు జరుపుతున్నారనే కారణాలతో ఇండియా దౌత్యవ్య వర్తను హింసించడం తీవ్ర పరిణామాలకు దారితీస్తుంది.

అట్లా కాకుండా ఇండియా-పాకిస్తాన్‌లు యిరుగు పొరుగు దేశాలు సామ రస్యంతో కొనసాగ వలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

# 13. ఇండియా - చైనా సంబంధాలు

నేటి ప్రపంచ రాజకీయ వ్యవహారాలలో ఇండియా - చైనా సంబంధాలకు చాలా ప్రాముఖ్యత ఉంది ఎందుకంటే ప్రపంచ రాజకీయాల నుండి ప్రచ్ఛన్న యుద్ధం నిష్క్రమణ. గల్ఫ్‌యుద్ధం తరువాత ఆసియా రాజకీయాలలో అనేక మార్పులు సంభవించడం, సోవియట్ రష్యాలో కమ్యూనిస్టుపార్టీ అధికారంను కోల్పోవడం, ప్రపంచ అగ్రరాజ్యాల పోటీ నుండి రష్యా వైదొలగడం. అమెరికా ఏకైక అగ్రరాజ్యం కావడం, మధ్య ఆసియా రాజకీయాలను అమెరికా ఆదేశించ డమూ. ఐక్యరాజ్య సమితి శాంతి ప్రతిపాదనలలో అమెరికా తనమాట చెలాయించు కోవడం, మూడవ ప్రపంచ దేశాల ఆర్థిక పరాధీనతను ఆసరగా తీసుకొని అమెరికా అన్ని రంగాలలోను, అన్ని ప్రాంతాలలోను తన అధిపత్యం నెలకొల్పుటకు ప్రయత్నించుచున్నది - అభివృద్ధి చెందుతున్న దేశాలు అప్పులతోను, తమ వ్యాపారపు లోటులతోను కొట్టుమిట్టాడుతున్నాయి. ఇలాంటి పరిస్థితులలో ఈ దేశా లకు ఒక అండగా నిలవడానికి ఒక దేశం కాని, వ్యవస్థగాని ఉన్నట్లయితే ఊరట కలిగిస్తుంది. అంతేకాక అంతర్జాతీయ నూతన సక్రమ స్థితిని నెలకొల్పడానికి (New International Order) చైనా-ఇండియాలు అంతర్జాతీయ రాజకీయా లలో కలిసికట్టుగా వ్యవహరించడానికి ఇండియా—చైన సంబంధాలు మెరుగవ్వాలి.

ఈ రెండు దేశాలు నూతన అంతర్జాయ సక్రమస్థితిని నెలకొల్పడానికి కృషి చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. అదే విధంగా ఈ తరుణంలో ఇండియా-చైనా సంబంధాలు మెరుగుపడితే కొంతవరకు ఆసియా ఐక్యరాజ్యసమితి లలో తమ పలుకుబడిని పెంచుకోవడానికి ఆస్కారం కలుగుతుంది. తమ ప్రాంత రాజకీయాలలోను, ద్వైపాక్షికంగా చాలమేలు కూరే అవకాశం ఉంది. అంతేకాక ఇండియా-చైనా సంబంధాలు మెరుగుపడడం వలన మూడవ ప్రపంచ దేశాలకు అంతర్జాతీయ రాజకీయాలలో వారిస్థానం పటిష్టమయ్యే అవకాశం ఉంది.

## పూర్వపరాలు :

ఇండియా-చైనా సంబంధాలు 1947 నుండి పరిశీలించినట్లయితే 1958 వరకు

మంచిగానే కొనసాగాయి. ఇండియా-చైనా విషయంలో ఐక్యరాజ్య సమితిలో మద్దతు నివ్వడం, ఆసియా రాజకీయాలలో ప్రాముఖ్యతను వహించాయి. 1954 లో ఇండియా-చైనాల మధ్య మైత్రి ఒప్పందం 'పంచశీల' పై సంతకాలు చేయడం, భారత ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, చైనా ప్రధాని చౌ-ఎన్-లైల మధ్య పరస్పర సంబంధాలు బాగానే కొనసాగాయి. కాని ఈ భాయి భాయి సంబంధాలు అట్టే కాలం నిలువలేదు. నెహ్రూ తన విధానాలకు కట్టుబడి అంటే ఎక్కడైతే స్వతంత్ర పరిరక్షణకు పోరాటం జరుగుతుందో ఆయా దేశాలకు ఇండియా మద్దతు నిస్తుంది. అదే సూత్రంపై టిబెట్‌ను చైనా కబళించడానికి ప్రయత్నించినప్పుడు ఇండియా టిబెట్‌కు మద్దతు నిచ్చింది. అంతేకాకుండ చైనా టిబెట్‌ను ఆక్రమించి నప్పుడు టిబెట్ నేత శ్రీ దలైలామా ఇండియాను ఆశ్రయించడం, ఇండియా దలై లామాకు రాజకీయాశ్రయం కల్పించింది. దానితో ఇండియా-చైనాల మధ్య స్నేహం బద్ధ విరుద్ధంగా మారింది 1962 లో చైనా ఇండియాపై దండయాత్ర చేసి హిమాలయ ప్రాంతపు సరిహద్దులలో వేలాది కిలోమీటర్ల ఇండియా భూ భాగాన్ని ఆక్రమించింది. ఆనాటి నుండి నేటి వరకు ఈ సరిహద్దు ప్రాంతంలో ఆక్రమణలతో ఇండియా-చైనాల మధ్య కొరకురాని కొయ్యిలా ఎటు తేలని సమస్యగా మారింది.

1962 నుండి 1975 వరకు ఇండియా-చైనాల మధ్య దౌత్య సంబంధాలు లేవు. 1976 భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ నాయకత్వాన ఆమె చొరవతో దౌత్య సంబంధాలు పునరుద్ధరించబడ్డాయి. దౌత్యవేత్తలు మార్పిడి, కార్యాలయా లను తిరిగి ఏర్పరచుకోవడం జరిగిందే తప్ప అసలు నిర్దుష్ట సంబంధాలు ఏర్పడ లేదు. 1979 లో జనతా ప్రభుత్వ హయాంలో చైనాతో సంబంధాలు పెంచుకోవా లనే ఉద్దేశ్యంతో అప్పటి విదేశాంగమంత్రి శ్రీ అతల్‌బిహారీ వాజ్‌పేయి చైనాను సందర్శించారు. కాని ఆయన చైనా సందర్శనలో ఉండగనే ఇండియా చైనాల మధ్య సరిహద్దు ప్రాంతంలో ఘర్షణలకు తలపడడంతో ఆయన తన పర్యటను మధ్యలోనే ముగించుకొని తిరిగిరావడం జరిగింది.

ఆ తర్వాత శ్రీమతి ఇందిరాగాంధీ అధికారంలోకి వచ్చాక మరల చైనా-ఇండియా సంబంధాలు నెలకొనడానికి కొన్ని చర్యలు తీసుకొన్న అవి ఫలించ లేదు. కాని 1988లో శ్రీ రాజీవ్‌గాంధి ప్రధానిగా చైనాలో పర్యటించడంతో వాస్త వంగా ఇండియా-చైనాల మధ్య సంబంధాలు ఏర్పడడానికి అవకాశం ఏర్పడింది.

శ్రీ రాజీవ్‌గాంధీ చొరవతో చైనా-ఇండియాల మధ్య వ్యాపార, వాణిజ్య సంబంధాలు ఏర్పడడానికి ఆస్కారం కలిగింది. అప్పుడే ప్రపంచ వ్యాప్తంగ ప్రచ్ఛన్న యుద్ధం అంతరించేతరిలో ఉండడం, సోవియట్ రష్యా అధికారం క్షీణించడం ప్రారంభమైంది. అదే సమయంలో ఇండియా-చైనాల మధ్య మామూలు పరిస్థితులు నెలకొల్పడానికి ప్రచ్ఛన్నయుద్ధంకు స్వస్తి చెప్పవలసిన ఆవశ్యకత ఏర్పడింది. చైనా ప్రధాని డెంగ్‌జియావోపెంగ్ ఇండియా ప్రధానుల మధ్య, 30 సంవత్సరాల నుండి సరిహద్దు సమస్య పరిష్కారంకు ఒక అవగాహన ఏర్పడింది.

## సరిహద్దు సమస్య - జాయింట్ కమిటి :

ఈ రెండు దేశాల మధ్యవున్న సరిహద్దు సమస్య పరిష్కారం కేవలం రాజకీయ పరిష్కారం ద్వారానే కుదురుతుంది. నేటి పరిస్థితుల్లో ఇండియా-చైనాల మధ్య చర్చలు ద్వారాను వివాదంకు స్వస్తి చెప్పి ద్వైపాక్షిక సంబంధాలు పెంచుకొని అంతర్జాతీయ సమస్యలపై ఒక అవగాహనకు రావలసి ఉంది.

దీని కొరకై ఇండియా - చైనాలు ఒక జాయింట్ వర్కింగ్ గ్రూప్‌ను వీరి సమస్యల పరిష్కారంకు చర్చలు కొనసాగించడానికి నియమించింది. ఈ సంఘం ఇప్పటివరకు మూడుసార్లు సమావేశం అయింది. ఒకసారి చైనాలోను; రెండోసారి ఇండియాలోను సమావేశ జరిపింది. సెప్టెంబర్ 1990లో కొత్త ఢిల్లీలో జరిగిన సమావేశంలో కొన్ని నిర్ణయాలు తీసుకొన్నది. 1. ఇండియా-చైనా సరిహద్దు లైన్‌వద్ద ఎంతెంత సైన్యంను ఇరువర్గాలు మోకరించింది అంచనా వేయాలి. 2. ప్రస్తుతం వున్న ట్రూప్స్ సామర్థ్యంను, సంఖ్యను తగ్గించాలి. 3. శాంతి స్థాపనకొరకు రెండు దేశాలు ఉంచిన సైన్యంను తొలగించాలి. 4. కాలానుగుణంగా రెండు దేశాల సైన్యాధిపతులమధ్య మీటింగులు ఏర్పరచి ఘర్షణలు జరుగకుండ చూడాలి. ఈ అంశాలను చైనా సూత్రప్రాయంగా అంగీకరించిన వాస్తవంగా అంగీకరించినట్లు కనబడుటలేదు. అయినా ఇండియా - చైనాల మధ్య అవగాహన, శాంతి, సమాధానంల ఏర్పాటుకు ఒక మార్గం ఏర్పడింది.

అంతేగాక ఈ రెండుదేశాలమధ్య చర్చలు ప్రారంభమయ్యాక ఘర్షణలు తక్కువయ్యాయి. ఇదే స్థితిని రెండు దేశాలమధ్య మరింత అవగాహనవైపు నడి

పిస్తుంది. నేటి ప్రపంచ పరిస్థితులలో ఈ రెండు దేశాలు ఒక ఒప్పందంకు రావాలి.

## ఇండియా - చైనాల వ్యాపారాభివృద్ధి :

ఎప్పుడైతే చైనా, ఇండియాలమధ్య సుహృద్భావ వాతావరణం ఏర్పడిందో ఈ రెండు దేశాలమధ్య సంబంధాలు వివిధ రంగాలలో గత 5 సంవత్సరాలనుండి మెరుగయ్యాయి. రెండు దేశాలమధ్య వ్యవసాయం, శాస్త్ర, సాంకేతిక, కళలు, సాంఘిక శాస్త్ర రంగాలలో ప్రతినిధి బృంధాలు సందర్శించడం జరిగింది. అంతే గాక మొట్టమొదటిసారిగా రెండుదేశాల సైనిక ప్రతినిధి బృంధాలు ఇరుదేశాలను సందర్శించాయి. తద్వాత ఘర్షణలు తక్కువైనాయి. అదే స్థితిలో 1989లో ఇండియా - చైనాలమధ్య, ద్వైపాక్షిక వ్యాపారం మొత్తం $271.19 మిలియన్ల డాలర్లు. చైనా ఇండియాకు $168.71 మినియన్ల డాలర్లు ఎగుమతులు, ఇండియా నుండి చైనాకు దిగుమతులు $ 102.71 మిలియన్ల డాలర్లు. ఇండియా ద్వైపాక్షిక వ్యాపారంలో $97.71 మిలియన్ల డాలర్లు లోటు ఉంది. రెండు దేశాలమధ్య వ్యాపార లావాదేవీలు 1000 మిలియన్ల రూపాయలకు పెంచే లాగున చర్యలు తీసుకోవడం జరిగింది.

1991 ఫిబ్రవరిలో ఇండియా విదేశాంగమంత్రి చైనాను సందర్శించినపుడు రెండు దేశాలమధ్య సరిహద్దు వ్యాపారంను పునరుద్దరించాలనే నిర్ణయం తీసుకొన డము. అదే విధంగా షాంగైలోను బొంబాయిలోను కన్సలేట్ జనరల్‌ను ఏర్పాటు చేయడానికి నిర్ణయం తీసుకొనబడింది.

## పరస్పర సంబంధాల వృద్ధి :

ఈ రెండు దేశాల మధ్య పరస్పర సంబంధాల కొరకు అనేక చర్యలు తీసుకొనడం జరిగింది. దీని ఫలితంగా చైనా ఉప ప్రధాని మే 1990 లోను, 1990 మార్చిలోను చైనా విదేశాంగ మంత్రి సందర్శించారు. అదేవిధంగా భారత విదేశాంగ మంత్రి 1991 ఫిబ్రవరిలో చైనా పర్యటన జరిపారు. ఈ సందర్భంగా ద్వైపాక్షిక సంబంధాలు వివిధ రంగాలలో వృద్ధి చెందడానికి అనుకూల పరిస్థితులు ఏర్పడాయి. ముఖ్యంగా సరిహద్దు సమస్య శాంతియుత చర్చలుద్వార పరిష్కారం కావాలన్నారు.

ఈ రెండు దేశాలమధ్య నలభై సంవత్సరాల దౌత్య సంబంధాలు ఏర్పరచుకొన్న సందర్భమును ఏప్రిల్ 1990 నాడు పాటించాయి. భారత డిప్యూటీ ప్రధాన మంత్రి శ్రీ దేవీలాల్ 1990 ఏప్రిల్‌లో చైనాను సందర్శించి ముఖ్యంగా వ్యవసాయ రంగంలో సహకార ఒప్పందంను కుదుర్చుకున్నారు. ఇరువురి జాతీయ, అంతర్జాతీయ ప్రయోజనాలను దృష్టిలో నుంచుకొని సరిహద్దు సమస్యను పరిష్కరించాలన్నారు. వ్యవసాయరంగంలో హైబ్రిడ్ వరిసాగు, సమగ్ర చేపల పెంపక పరిజ్ఞానం, ప్రత్తి విత్తనాల ఉత్పత్తి, మెట్ట వ్యవసాయపుసాగు, డైరీల అభివృద్ధి వివిధ రకాలయిన నూతన ప్రయోగాలకు కావలసిన సాంకేతిక పరిజ్ఞానం అందించుకొనడానికి ఒప్పందం కుదుర్చుకోవడం జరిగింది.

## సరిహద్దు సమస్య :

ఇండియా-చైనాల మధ్య సంబంధాలకు అడ్డంకు కలిగిస్తున్న అంశం సరిహద్దు సమస్య. ఈ విషయంలో రెండు దేశాలు చాలా నిదానంగా వ్యవహరిస్తున్నాయి. రెండు దేశాలు ఈ సమస్యా పరిష్కారంకు వస్తున్నాయి. కాని తమ తమ అంతర్జాతీయ ప్రయోజనాలు పరిష్కారం కుదరనివ్వడంలేదు. చైనా అరుణాచల్ ప్రదేశ్ విషయంలో తన దృక్పథంను మార్చుకొనడంలేదు. చైనావారు అరుణాచల్ ఇండియాది కాదంటారు. ఈ విషయంలో సరిహద్దు సమస్య జటిలమవుతుంది. అదే విధంగా ఇండియా-చైనా-పాకిస్తాను సంబంధాలను దృష్టిలో ఉంచుకొని చైనాతో సరిహద్దు సమస్యకు పరిష్కారమార్గం ఆలోచించాలి. కనుక ఇలాంటి స్థితిలో రెండు దేశాలు సరళ విధానం అవలంబించి పరిష్కార మార్గంను రాజకీయంగా కుదుర్చుకోవాలి. ప్రచ్ఛన్న యుద్ధం అంతరించడంతో ప్రపంచ రాజకీయాలలో చైనా ప్రాధాన్యత తగ్గింది. అమెరికా చైనాకు అన్ని విధాలా ఆర్థిక సహాయంను అందించుతోంది. చైనా తైనామెన్ ప్రజాస్వామ్య సంఘటన తరువాత అమెరికాకి దగ్గరై ఏ విధంగానూ అమెరికాకు వ్యతిరేక చర్యలకు పాల్పడడంలేదు.

ఇట్లాంటి స్థితిలో ఇండియా-చైనాలు తమ స్థానంను నిలబెట్టుకొనడానికి తమ మధ్య స్పర్థలను విడనాడి మైత్రి సంబంధాలు ఏర్పరచుకోవాలి.

## రాజకీయ అవగాహన :

ఈ రెండు దేశాల మధ్య సంఘర్షణలు తక్కువయినాయి. ఇదేస్థితి మరింత

అవగాహన పురోభివృద్ధిపై పు నడిపించాలి. అది చైనా-ఇండియాల మధ్య రాజకీయ అవగాహన అవసరం. రాజకీయ అవగాహనున్న యెడల సరిహద్దు మిగతా సమస్యలకు సులభంగా పరిష్కారం ఏర్పడుతుంది. అట్లాంటి పరిష్కారం కుదరాలంటే దేశాధినేతల మధ్య అంతర్జాతీయ అవగాహన పెరగాలి. ఇట్లాంటి స్థితిలో ఇండియా-చైనా సంబంధాలు మెరుగుపడుట వలన అంతర్జాతీయ రాజకీయాలలో కొంత స్థిరత ఏర్పడడానికి అవకాశం కలదు.

ఇండియా-చైనాలు నూతన అంతర్జాతీయ సక్రమస్థితిని నెలకొల్పుటకు సిద్ధమే. అమెరికా అధ్యక్షుడు బుష్ యిచ్చిననూతన అంతర్జాతీయ సక్రమ స్థితి కూడా ఒకటే కనుక ఈ రెండు దేశాలు మధ్య సఖ్యత అంతర్జాతీయ స్ఫూర్తినిచ్చి తృతీయ పంచదేశాలకు నూతన స్థితికి మంచి అవకాశం ఏర్పడడానికి ఆస్కారం ఉంది. కాని చైనా సోవియట్ రష్యాలో మార్పులు ఎటువైపు తిరుగుతాయి. రష్యా నిలదొక్కుకోగలదా? లేదా? అనేదానిపై చైనా యొక్క పాత్ర ఆధారపడి వుంది. రష్యా తనస్థానానికి తిరిగి చేరుకోగలిగితే చైనాకు లాభం లేకపోతే నేటి పరిస్థితులలో అమెరికాకు అక్కర్లేదు. రష్యా ప్రచ్ఛన్న యుద్ధ అంతంతో తన స్థానాన్నే కోల్పోయింది. చైనాపై వత్తిడి పెరిగింది.

నేటి బహుళ సమతౌల్యస్థితి సైనిక పరంగా ఏకైక రాజ్యం, జర్మనీ, జపాను, ఆర్థిక పటిష్టవంతమైన దేశాలుగా ప్రపంచ రాజకీయాలలోకి తిరిగి వచ్చాయి. ఈ రెండు ఫ్రాన్సు, జపాను పెద్ద రాజ్యాల స్థానం పొందాయి. అదే విధంగా ఇజ్రాయిల్, దక్షిణాఫ్రికా, ఇండియాలు ప్రాంతీయంగా ప్రభావమును కలిగియున్నాయి. ఇట్లాంటి స్థితిలో చైనా స్థానం ఏమిటో నిర్ణయించుకోవాలి. ఇట్లాంటి ఏకాంత చైనాస్థితి ఇండియాతో స్నేహసంబంధాలకు ఎక్కువగా దారిచూపుతుంది. కనుక అదే రీతిలో చైనా-పాకిస్తాను మధ్య సంబంధాలలో కూడా మార్పురావాలి. ఇండియా-పాకిస్తానుల మధ్య ఎప్పుడు వ్యతిరేక సంబంధాలే ఎందుకంటే పాకిస్తాను కొనసాగింపు ఇండియాతో ఘర్షణలమీద ఆధారపడుతుంది. పాకిస్తాను ఇండియాలో వ్యతిరేక సంబంధాల వలననే ఎక్కువ ఆర్థిక సహాయం లభిస్తుంది. అట్లా చైనా-పాకిస్తాను, ఇండియా-చైనా సంబంధాలలో మార్పులు రావాలి.

చైనా ప్రస్తుత మారిన పరిస్థితుల్లో కూడ మార్క్సిజమ్‌నే అనుసరిస్తూ కొనసాగిస్తామని ప్రకటించడం ముదావహం. నేడు మారుతున్న స్థితుల దృష్ట్యా

ఇదే స్థితి కొనసాగిస్తుందా? అనేది కాలమే నిర్ణయించాలి. చైనా ప్రధాని లీపెంగ్ ఇండియా ప్రతినిధుల వర్గం చైనాలో పర్యటించిన వారితో మాట్లాడుతూ ఇండియా-చైనా సంబంధాలలో పరస్పర అనుమానాలు, స్పర్థలు తొలగించుకొని సంబంధాలు ఏర్పరచుకోవాలనడంతో ఈ రెండు దేశాలమధ్య సంబంధాలు పెరిగే సూచనలు కనిపిస్తున్నాయి.

# 14. ఇండియా - బంగ్లాదేశ్ సంబంధాలు

చారిత్రంగా ఇండియా -బాంగ్లాదేశ్‌లు 1947 వరకు ఒకే చరిత్రను కలిగి ఉన్నాయి. 1947లో పాకిస్తాన్ ఏర్పడడంతో తూర్పు పాకిస్తాన్‌గా పాకిస్తాన్‌లో భాగమయింది. సంస్కృతి, సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్యలు పంచుకుంటు న్నాయి. సాంస్కృతికంగా భారతదేశంకు చాలా దగ్గర సంబంధాలు కలిగి యున్నాయి. 1991 ఫిబ్రవరిలో పది సంవత్సరాలనంతరం ప్రజాస్వామ్యం పునఃప్రతిష్ఠించబడినది. ఇదే ఈ రెండు దేశాలమధ్య దగ్గర సంబంధాలు ఏర్ప రచుకుంది. 1971లో ఇండో-బాంగ్లాదేశ్‌ల మధ్య స్నేహ, సహకార, ఆర్థిక, సాంఘిక, రక్షణ విషయాలపై ఒప్పందం కుదిరింది. 1975 శ్రీ షేక్ ముజిబుర్ రెహమాన్ హత్యగావింపబడిన తరువాత బాంగ్లాదేశ్ రాజకీయావ్యవస్థలో చాలా మార్పులు వచ్చాయి. మాజీ అధ్యక్షుడు శ్రీ జియాఉల్ రెహమాన్ బాంగ్లాదేశ్‌ని మతపరమయిన అంశాలను రాజకీయాలలో ప్రవేశ పెట్టబడింది. ఆ తరువాత మిలటరీ పరంగా పశ్చిమ దేశాలవైపు మొగ్గు చూపడం మొదలయింది. దీనితో బాంగ్లాదేశ్‌లో పాకిస్తాన్, చైనా, జపాన్, అమెరికా, పశ్చిమాసియా దేశాలకు తమ దేశంలో పెట్టుబడులు పెట్టడానికి, ఆయుధాల సప్లయి అంతేకాక తమదేశాల ప్రయోజనాలను బాంగ్లాదేశ్ కొనసాగించడానికి అవకాశం యిచ్చింది. అదే విధంగా ఇండియాతో ద్వైపాక్షకమైన సంబంధాలను పెట్టుకొంది. 1980లలో బాంగ్లా అధ్యక్షుడు జియా-ఉల్-రెహమాన్ రక్షణపరంగా అరక్షణను కలిగి భయంతో దక్షిణ ఆసియాలో ప్రాంతీయ సహకార సంఘంను ఏర్పరచాలని పేర్కొన్నారు. దానితో బాంగ్లాదేశ్‌కు ఒక గుర్తింపు అంటూ వచ్చింది.

బాంగ్లాదేశ్ కి చిన్న భూభాగం కలిగినదిగా కొంతభయమున్నది. ఎందుకంటే బాంగ్లాదేశ్ చుట్టూ ఇండియా యొక్క భూభాగం ఉండుట వలన ఎప్పుడు భయ పడుతుంది. నూతనంగా ఎన్నుకొనబడిన బాంగ్లాదేశ్ జాతీయపార్టీ నాయకురాలు ఖాలిదాజియా ఇండియాకు వ్యతిరేకంగా మతవాదంతో ప్రచారం ఇండో సెంట్రిక్ అభిప్రాయాలను ప్రచారం చేయుచున్నారు ఇండో-బాంగ్లాదేశ్‌లు తమ ముఖ్య మైన సమస్యలను పరిష్కరించుకోవలసివుంది. వాటిలో గంగానది జలాలను

పంచి, దానిపై ఆనకట్టను నిర్మించవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది. వీరి మధ్య జలాల పంపిణీ విషయంపై కుదిరిన ఒప్పందం 1988లో ముగిసింది. ఇంత వరకు ఏ విధమయిన అంగీకారంకు రాలేదు. బాంగ్లాదేశ్ నేపాల్‌లో జల రిజర్వాయర్‌ను నిర్మించాలని కోరుతోంది. కాని ఇండియా 320 కి.మీ. దూరం లింక్ కాల్వను బ్రహ్మపుత్రనుండి ఫరక్కా వరకు బాంగ్లాదేశ్‌లో నిర్మించాలంటుంది. 1987లో రెండు ప్రభుత్వాలమధ్య సమావేశం జరిగిన అనంతరం ఢాకా-న్యూఢిల్లీలు ఈ విషయంపై మాట్లాడడంలేదు. కాని ఈ రెండు దేశాలమధ్య నీటి పంపిణీ విషయంలో ప్రాంతీయ దృక్పథంతో పరిశీలించవలసిన అవసరం ఎంతయినా ఉంది.

బాంగ్లాదేశ్-ఇండియాల మధ్య మరొక సమస్య త్రిపురలో నున్న 24,000 చక్‌మా జాతుల సమస్య ఉంది. 1989లో ఉత్తర-తూర్పు ప్రాంతంలో నున్న చకామా కాందిశీకుల క్యాంపులను బాంగ్లాదేశ్ ప్రతినిధివర్గం సందర్శించి చర్చలు జరిపాయి. తదానంతరం రెండు దేశాలు చక్‌మా జాతుల కాందిశీకులను చిట్టాగాంగ్ కొండల పరివాహక ప్రాంతంలో నివాసం ఏర్పరచాలని నిశ్చయించారు. వీరు బాంగ్లా-ఇండియా సరిహద్దులలో రెండు దేశాలనుండి వస్తున్న తిరుగుబాటుదారులను రాకుండగ అరికట్టాలి. తూర్పు-దక్షిణ సరిహద్దు ప్రాంతమును శాంతియుతంగా ఉండేలా చూడాలని రెండు దేశాలు అంగీకరించాయి. మరొక ముఖ్యమయిన అంశం ఇండియా సుప్రీంకోర్టు యొక్క తీర్పుననుసరించి టిన్-బిగా పరివాహక ప్రాంతమును లీజుకు బాంగ్లాదేశ్‌కు ఇవ్వడానికి అంగీకరించాయి. దాహగామ్ అంగ్రోపోటా ఎంక్లేవ్ నుండి బాంగ్లాదేశ్ మెయిన్ భూభాగములోనికి పంపడానికి అన్ని ఏర్పాట్లను తొందరగా చేయవలయును. బాంగ్లా-ఇండియాల మధ్య ముఖ్య సమస్య తాలపతి లేదా న్యూమూర్ ద్వీపం గూర్చి వస్తుంది. ఈ రెండు దేశాలు జాయింట్‌గా సర్వే జరిపి సమస్యను పరిష్కరించుకొనవలయును. రెండు దేశాలు భూమి సరిహద్దు సమస్యను మారిటైమ్ సరిహద్దులపై పరిష్కారమును చేసుకొన్న వారి ఈ రెండు దేశాలు చర్చలు జరిపి సమస్యలు పరిష్కారం చేసుకొనడానికి ప్రయత్నం చేస్తాయో అనేది వేచి చూడవలసిందే.

బాంగ్లాదేశ్ మిలిటరీ పరిపాలనా కాలంలో ఆయుధాలను సమకూర్చుకొన్నది. దీని వలన రెండు దేశాల మధ్య మంచి సంబంధాలు ఏర్పడడానికి ఆస్కారం తక్కువయినాయి. బాంగ్లాదేశ్‌కు, పాకిస్తాన్, బాంగ్లాదేశ్‌ల నుండి వస్తున్న ఆయు

ధాల మూలాన ఇండియా యొక్క విధానమును మార్చుకొనవలసిందా అని ఆలోచిస్తున్నది. కాని ఇండియా ఒక్కటే వీరియొక్క రాజకీయ, భౌగోళిక ఐక్యతను కాపాడడానికి మద్దతును చూపగలదు. నూతన ప్రభుత్వం బాంగ్లాదేశ్ యొక్క అంతర్గత రక్షణ అవసరాలు, బయటనుండివచ్చే ఒత్తిడులను ఎంతవరకు ఎదుర్కొని నిలబడగలదని వేచి చూడవలయును. ఇంకా తన వ్యాపార లోటులను, జాయింటు పెట్టుబడులను, పరిశ్రమలలో మూలధనం అవసరాలను, దేశానికి కావలసిన సాంకేతిక పరిజ్ఞానంను సమకూర్చుకొనవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది.

ఇండియా-బాంగ్లాదేశ్ సంబంధాలు వృద్ధి చెందడానికి దక్షిణ ఆసియా ప్రాంతీయ సహకార సంఘం యొక్క కృషిపై ఆధారపడివుంటుంది. ఈ సార్క్ తన యొక్క ఉత్సాహంతో పని చేయడంలో వెనుకబడిందా బాంగ్లాదేశ్ ఈ సార్క్‌ను వదిలి తూర్పుదేశాల సహాయసహకారాలను పొందడానికి ఆస్కారం కలదు. తనయొక్క ప్రయోజనాలను కాపాడుకొనడానికి బాంగ్లాదేశ్ ఏసియా-పసిఫిక్ దేశాలతో సంబంధాలు పెంచుకొంటుంది. ఇట్లా చేసిన యెడల ఉపఖండ ప్రయోజనాలు దెబ్బతినడానికి ఆస్కారం కలదు. ఇండియా-బాంగ్లాదేశ్‌లు సార్క్ ఫోరమ్‌ను బలవంతముచేసి వారి మధ్య సత్సంబంధాలు నెలకొల్పడానికి కృషి చేయవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది. ఇండియా-బాంగ్లాదేశ్‌ల మధ్య సాంస్కృతిక, శాస్త్రీయ, సాంకేతిక, విద్యా రంగాలలో సమన్వయం ఏర్పడుచరకొని పరస్పర సంబంధాలను పటిష్టవంతం చేసుకొనుటకు కృషి చేయవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది.

# 15. ఇండియా – శ్రీలంక సంబంధాలు

భారత 'ఉపఖండం' రాజ్యాలు 200 సంవత్సరాలపైగా పరాయి పాలనలో బ్రమగ్గి రెండవ ప్రపంచ యుద్ధానంతరం స్వాతంత్ర్యంను పొందాయి. కాని గత నలభై సంవత్సరాలనుండి ఈ దేశాలు అనేక ఇబ్బందులు, ద్వైపాక్షికంగా ఎదుర్కొన్నా, చాలావరకు తమ అభివృద్ధి కొనసాగిస్తున్నాయి. ప్రక్క దేశం శాంతిగా ఉంటే ఆ ప్రాంతం అభివృద్ధి సాధిస్తుంది. లేదా ప్రక్క దేశాల యొక్క ప్రభావం ఆయా దేశాలపై పడుతుంది. ఇండియా శ్రీలంక దేశాలు చాలా కాలం వరకు సత్సంబంధాలను కలిగియున్నాయి. ఈ రెండు దేశాలమధ్య వున్న సమస్యలు స్వాతంత్ర్యంకు పూర్వం నుండి కొనసాగుచున్నవే. ఎందువలనంటే సామ్రాజ్యవాద దేశాలు తమ పరిపాలన క్రింద వున్న సమస్యలను పరిష్కరించకుండ వదిలేసిపోయారు. స్వాతంత్ర్యం తరువాత ఇండో-శ్రీలంకలు అలీన విధానమును అవలంభించి మంచి సంబంధాలను కలిగియున్నాయి. వీటి మధ్య ఆర్థిక, రాజకీయ, వ్యాపార సంబంధాలు యే విధంగా ఉన్నాయనేది పరిశీలించుదాం.

**చారిత్రక సంబంధాలు :**

చారిత్రకంగా రెండుదేశాల మధ్య అశోకుడు కాలం నుండి సాంస్కృతిక సంబంధాలున్నాయి. ఈ రెండు దేశాలమధ్య కొనసాగుతున్న మనస్పర్ధలు, వ్యతిరేకతలు యేనాటి నుండో వచ్చుచున్న Indian he$_{u}$saseగా చెప్పవచ్చును. బ్రిటీషువారు రాకపూర్వము ఇండియా-శ్రీలంకలు ఒకే రాజు ఆధిపత్యంలో ఉండేవి. లేదా దక్షిణ దేశ రాజుల పాలన క్రింద ఉండేది. బ్రిటీషువారు ఉప ఖండంలో పరిపాలన మొదలిడిన తరువాత స్థిరమైన పాలన లేకుండా కేవలం తాత్కాలికం వలసలను నియంత్రణ చేయుటకు కావలసిన పాలనను మాత్రం వుండేది. ఆ వలసలు స్వాతంత్ర్యమైన తరువాత వారి యొక్క జాతీయ ప్రయోజనాలలో బేధాలు యేర్పడినాయి. వారి ప్రయోజనం కనుగుణంగా సంబంధాలు తీర్చి దిద్దుకొన్నాయి. కాని ఈ దేశాలు ఒకే అభిప్రాయాలు కలిగి ఉండటానికి కారణం వారు ఒకే అధికారం

క్రింద కొనసాగుతూ దాని నుండి విముక్తి పొందడం. స్వాతంత్ర్యానంతరం ఈ రెండు దేశాలలోను పశ్చిమ దేశాల ప్రభావం కలిగిన నాయకత్వం రావడం జరిగింది.

స్వాతంత్ర్యమునకు పూర్వం కూడా శ్రీలంక-ఇండియా దృక్పథంలో సహజంగా 'ఆసియా సాలిడారిటీ', వలస ప్రాంతాలలో స్వయం పరిపాలనాధికారులు కావలసి కలిసికట్టుగా కొట్లాడాయి.

అనంతరం ఆసియా సంబంధాల సమావేశం (1947) బాండంగ్ సమావేశా (1955)లు ఈ రెండు దేశాలు తమతమ అంతర్జాతీయ పాత్రను నిర్ణయించుటకు ఉపయోగపడినాయి 1949 లో శ్రీలంక ఇండియాతోపాటు ఇండోనేషియాలో నెదర్లాండ్ మిలటరీ ప్రయోజనాలకు చేస్తున్న చర్యలను, ఖండించాయి. అదే విధంగా ఇండియా-శ్రీలంకలు చాలా అంతర్జాతీయ అంశాలను ఖండిస్తూ ప్రకటనలు చేశాయి. ముఖ్యంగా సూయజ్ కాలువ మూసివేత లెబనాన్, జోర్డాన్, కాంగో విషయాలపై ప్రకటనలు చేశాయి. అదే విధంగా గోవాను సైనిక చర్య ద్వారా ఇండియాలో కలుపుటకు చేసిన దానిపై మద్దతుగా చేసిన ప్రకటన చాలా చెప్పుకొనదగినది.

కాలానుగుణంగా ఈ రెండు దేశాల సంబంధాలలో మార్పులు వచ్చాయి. 1962 ఇండో-చైనా సంఘర్షణ ఇండియా-పాకిస్తాన్‌ల యుద్ధం 1965 & 1971 లో జరిగిన వాటిపై శ్రీలంక తటస్థ విధానాన్ని అవలంబించింది. శ్రీమతి బండారనాయక్ ప్రభుత్వం చైనా యొక్క సున్నిత సంబంధాలను చెడగొట్టడానికి గాని, యునైటెడ్ డెమోక్రటిక్ పార్టీ నాయకుడు శ్రీ డుడ్లే సేనానాయక్ ఇండియా వ్యతిరేకతను దృష్టిలో ఉంచుకొని తను రక్షణగా తటస్థ విధానంను అవలంబించింది. అదే విధంగా 1971 లో ఇండియా-పాకిస్తాన్ యుద్ధంలో పాకిస్తాన్ యుద్ధనౌకలను తమ జలాల నుండి బంగ్లాదేశ్‌కు వెళ్ళడానికి శ్రీలంక అనుమతి నిచ్చింది.

ఆర్థిక దౌత్యంలో ఈ రెండు దేశాలు బహుముఖ సంస్థల ద్వార ఆర్థిక సహాయాన్ని, వాటి కోలెబరేషన్‌ను అంగీకరించాయి. వీటిలో బ్రిటిషు కామన్‌వెల్త్ కొలంబో ప్రణాళిక, ఆసియా, దూర ప్రాశ్చ్యాత దేశాల ఆర్థికసహకారం(ECAFE) మొదలైనవి. ఈ రెండు దేశాల ద్వైపాక్షి ఆర్థిక సహకారం కంటే బహుముఖ సంస్థల ఆర్థిక సహకారానికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చాయి. ఇట్లా 1960 దశకం వరకు కొనసాగాయి. ఆ తరువాత ఈ రెండు దేశాల మధ్య కొంత పోటీ ఏర్పడింది.

ఈ రెండు దేశాల మధ్య ఎగుమతి వస్తువుల విషయంలో ఏర్పడింది అదే తేనీటీ వ్యాపారం.

## ఒప్పందాలు :

ఈ రెండు దేశాల మధ్య అదే కాలంలో భూమి పంపిణీ విషయంలోను, జనాభా విషయంలోను విభేదాలు ఏర్పడినాయి.

భూభాగ విషయంలో పరస్పర భేదం పాక్ స్ట్రెయిట్‌లో జఫ్నాదీవికి సంబంధించిన కచ్చాతీవి విషయం పంపక విషయం. ఈ కచ్చాతీవిపై అధికార విషయంలో 1974 లో కుదిరిన ఇండియా-శ్రీలంక ఒప్పందం ద్వారా పరిష్కరించ బడింది. అది కచ్చాతియ్యుపై శ్రీలంక సార్వభౌమాధికారంను అంగీకరిస్తూ, ఇండియా నుండి రోమన్ కాథలిక్ క్రైస్తవ సందర్శకులుగా సెయింట్ అంథోనీ పండుగకు వెళ్ళినపుడు కావలసిన రక్షణలు కల్పించడానికి శ్రీలంక అంగీకరించ డంతో ఏర్పడింది. ఈ విషయం పరిష్కారంకు 1969 నుండి 1974 వరకు శ్రీలంక-ఇండియా ప్రధానుల మధ్య చర్చలు జరిపారు. ఈ చర్చలలో రెండు వర్గాల వారు భీష్మించుకొనడం వలన ఒక అంగీకారంకు రావడం కొరకు సుమారు 6 సం॥రాల కాలం పట్టింది.

1976 మార్చిలో ఈ రెండు దేశాల మధ్య సముద్రం మీద ఆధిపత్యంనకు ఒక అంగీకారంను కుదుర్చుకొనడం జరిగింది. అది పరస్పరంగా చేపలు పట్టుకొన డానికి ఆర్థిక జోన్‌గా గుర్తించడంకు అంగీకరించాయి.

## శ్రీలంకలో తమిళుల సమస్య :

ఇండియా—శ్రీలంకల మధ్య సంబంధాలలో స్పర్థలు ఏర్పడానికి కారణం ఈ ఇండియా తమిళులు శ్రీలంకలో ఉండడం. ఈ సమస్యలలో రెండు రకాలైన తమిళ పౌరులు ఇరుక్కొన్నారు. వారు ఇండియా తమిళులు (వీరు సుమారు 6% ప్రజలు మొత్తం శ్రీలంక జనాభాలో ఉన్నారు.) వీరు బ్రిటిషుకాలంలో టీ కార్మికులు బ్రిటిషు వారి పరిపాలన వీరందరు వారిచేత శ్రీలంకకు టీ ఎస్టేట్‌లలో పనిచేయ డానికి తీసుకొనివచ్చినారు. రెండవ వారు శ్రీలంక తమిళులు (వీరు సుమారు 13% మొత్తం శ్రీలంక జనాభాలో ఉంటారు.) శ్రీలంక తమిళులు చాల సంవత్స రాల క్రితం శ్రీలంక వచ్చి ఇచ్చటనే స్థిరపడినవారు. వారి సంతానం.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం 1948లో శ్రీలంకకు స్వాతంత్ర్యం వచ్చింది. ఆ తరువాత సిలోన్ పౌరసత్వ చట్టం (1948) తదానంతర శాసనాలలో శ్రీలంక తమిళులకు పౌరసత్వం లేకుండా చేసి వారు ఏ దేశంకు చెందని వారిని చేశారు. ఈ విషయం సిలోన్ తమిళులకు-ఇండియన్ తమిళులకు ఎప్పుడు ఒక అంగీకారం మీద లేదు. దానితో ఇండియన్ తమిళులు శ్రీలంకకు ఒక సమస్యగా తయారయ్యారు. దానిపై ఇండియా కూడ కల్పించుకొనవలసి వచ్చింది. ఇండియా-శ్రీలంకలు తమిళుల విషయం ఒక అంగీకారమునకు రాగలిగారు. అదే శాస్త్రి-సిరిమావో ఒప్పందం 1964. ఈ ఒప్పందంలో కొందరు పౌరులను శ్రీలంక పౌరులుగా తీసుకోవడం మరికొందరు ఇండియన్ తమిళులను 15 సంవత్సరాల కాలంలో ఇండియా తిరిగి పంపించడం ఆ తరువాత సిరిమావో-బండార నాయక్ ఒప్పందం ఇండియా ఉద్యోగి స్వామ్యం పూర్తిగ అమలు జరుపుట గాని, సిలోన్‌లో సింహళీయుల రాజకీయ పక్షపాతంను బట్టి ఈ ఒప్పందంను అమలు చేయుటకు శ్రద్ధ తీసుకొనలేదు.

అదే తమిళుల విషయంపై ఇండియా-శ్రీలంకల సంబంధాలలో భేదాలు ఏర్పడ్డాయి. శ్రీలంక తమిళులు తమకు న్యాయమైన స్థానం దొరకాలని శ్రీలంకలో వారు ప్రత్యేక ఉద్యమమును లేవదీసినారు. ఈ తమిళుల ప్రత్యేక ఉద్యమం ఇండియా యొక్క ప్రోత్సాహం సహకారంతోనే జరుగుతుందని శ్రీలంక ఇండియాపై నిందవేయడం జరిగింది. (అసలు తమిళుల ప్రత్యేక ఉద్యమం ఎందుకు శ్రీలంకలో వచ్చింది. శ్రీలంకలో తమిళులను లేదా మైనారిటీలు ఏ విధంగా చూడడం జరుగుతుంది. అనే విషయాలన్నింటిని పరిశీలించడానికి ఇది స్థలం కాదు అది వేరే చర్చించవలసి ఉంది.) కాని ఇక్కడ ఇండియా ప్రభుత్వం శ్రీలంక తమిళుల సమస్య విషయంలో ఇరుక్కుంటంఅనేది ఎందుకుజరిగిందో అర్థంకాదు. శ్రీలంక తమిళులసమస్య అనేది కేవలం శ్రీలంక అంతర్గత సమస్య. (ఇక్కడ ఇండియా ఎందుకు శ్రీలంక తమిళుల సమస్యలో తల దూర్చింది అంటే సుమారు 2.5 లక్షల తమిళ పౌరులు యొక్క భవిష్యత్తు ఎటు కాని మధ్యస్థ దిశలో ఉంది. కనుక అంతర్గత రాజకీయ వత్తిడి దృష్ట్యా తమిళ ప్రయోజన రాజకీయుల దృష్ట్యాను తన సార్వభౌమాధికారాలను వినియోగించి శ్రీలంకలో తమిళుల సమస్యకు పరిష్కారం కలిగిద్దామనే ఆశయంతో ఇండియా తన దౌత్యంను ప్రయోగించింది. అదే చివరకు శ్రీలంక తమిళులు తమ న్యాయమైన హక్కులకై పోరాడడానికి చేస్తున్న ప్రయత్నంకు

వ్యతిరేకంగా శ్రీలంక ప్రభుత్వం మద్దతుగా ఇండియా ఆఖరుకు శ్రీలంక తమిళుల పోరులతో కొట్లాడవలసి వచ్చింది. మనిషి ఒక్కటి తలస్తే దైవం మరొక్కటి తలస్తుందంటారు అట్లానే తయారయింది.

## ఇండియా శ్రీలంకకు మిలటరీ సహాయం :

ఇండియా, శ్రీలంక ప్రధానమంత్రి శ్రీమతి బండరానాయక్ ననుసరించి చాల సార్లు సైనిక సహాయంను అందించింది. అప్పుడు శ్రీలంకలో వామపక్ష రాడికల్స్ తిరుగుబాటు చేసి న్యాయమైన ప్రజాస్వామ్య ప్రభుత్వంపై జరుపుటవలన దానిని అణచడానికి ఇండియా సహాయం చేసింది. కాని దీనికి సంబంధించిన వివరాలు ఎందుకు ఇండియా మిలటరీ సహాయంను అందించింది అనేదాని ప్రభుత్వంయొక్క డాక్యుమెంట్స్‌లులో పేర్కొనబడలేదు. పత్రికా సమాచారం ప్రకారం ఇండియా యొక్క సహాయం చాల ఇచ్చారు. అదే విధంగా సైన్యంను శ్రీలంకకు పంపించడం జరిగింది. ఇందుకు ఇండియాకు సైన్యం పంపించవలసిన అవసరం ఏమి వచ్చింది? అంత వత్తిడి భారత్ మీదకు ఎందుకు వచ్చింది? ఇండియా ఉపఖండంలో ఇండియా వాయుదళాలను, నావిక దళాలను ఏమైన తిరుగుబాటు వస్తుందేమోనని అప్రమత్తంగా ఉంచడం జరిగింది. స్నేహ పూర్వకంగా మిత్రదేశానికి సహాయం చేయడానికి మంచి అవకాశం దొరికింది. వెంటనే భారతదేశం శ్రీలంకకు సహాయంను పంపించడం జరిగింది. దీనితోపాటు రాజకీయంగా శ్రీలంకలోని రాడికల్ వామపక్ష దళాలు ఇండియా సైన్యం శ్రీలంకకు పంపడంను జాతి విచక్షణ విధానం ఇండియా స్వార్థ ప్రయోజనమని ప్రచారం గావించారు. దానితో శ్రీలంకలో నుండి తమిళుల సమస్య యింకా జటిలమైంది.

శ్రీలంకలోని జనతా విముక్తి పరమూనా (JUP) మిగతా రాడికల్ వ్యవస్థలు శ్రీలంకలోనున్న సింహళీయుని కాని వారిపైన సానుభూతికి బదులు అసహ్యించుకోవడం మొదలయింది. ముఖ్యంగా ఇండియా వారిపై అపనమ్మకం వారు శ్రీలంకేయులు కాదని ప్రచారం మొదలు పెట్టారు. అంతేకాక సింహళీయులు ఇండియా యొక్క మూలధనం శ్రీలంకలోని వివిధ సెక్టారులో ముఖ్యంగా రబ్బరు, టీ ఇండస్ట్రీస్‌లోను దిగుమతులు ఎగుమతుల్లోను అనుభావంను కలిగి ఉండడాన్ని అంగీకరించకపోవడం మొదలయింది. వారు శ్రీలంకయులు అనే ఫీలింగ్ తెచ్చారు. దానితో ఇండియన్ తమిళులను పరాయి వారుగాను విదేశీ ఆధిపత్యంకు ఏజెంట్లు

గాను వర్ణించడం జరిగింది. దీనితో శ్రీలంక వాళ్ళు తమిళ టీ ప్లాంటేషన్ కార్మికులను తమ దేశంనుండి పంపించాలని, శ్రీలంకలో తమిళ్ళులు నివసించుచున్న ప్రాంతంలో టీ ఎస్టేట్లను వరిపండే భూములుగా మార్చాలని వత్తిడి చేయడం మొదలు పెట్టారు.

ఈ విధంగా రేసియల్ విచక్షణ విధానం చివరకు అసహ్యించుకొనే విధంగా మార్చింది. అంతేకాక శ్రీలంకకు సైనికంగా సహాయంను అందించుట వలన ఇండియా తన యొక్క ప్రభావంను, విస్తరించుకొనుటకు శ్రీలంక సహాయం చేయుచున్నదనే ప్రచారంగా మార్చారు. అంతేకాక శ్రీలంక-ఇండియా చర్య తిరుగుబాటు దారులను అణుచుటతో పాటు ఇండియా తన ఆధిపత్యం శ్రీలంకపై రుద్దుతుందని ఆరోపణలు చేశారు.

**తమిళుల సమస్య :**

1987-89 మధ్యకాలం ఇండియా-శ్రీలంకలు కొనసాగించిన శాంతియుత కార్యక్రమము ఇంతకు ముందు సైనిక సహాయం చేసిన దానికంటే ఎక్కువ పరిమితము కాలేదు. తుపాకీ ఈ విషయాంలో ఆశించిన విధంగా కాకుండ ఇష్టంవచ్చినట్లు ప్రవర్తించింది. ముఖ్యమైన అంశమేమంటే ఇండియా సైన్యం ఒకప్పుడు మరో అప్పుడు కూడ ఒక ఆశయం లేకుండగా ఇండియాకు ఏ విధమైన ప్రయోజనం లేకుండ ఉపయోగించడం జరిగింది. ఏదో విషయంలో ముఖ్యమైన లింకు లేకుండా ఈ రెండు దేశాల అవసరాలు తీరకుండగనే అంటే ఆ దేశంను పీడించుచున్న అంశాలు కాని రాజకీయ ఏర్పాటు వాదం వ్యాప్తి చెందకుండ కాపాడడమనేది జరుగలేదు.

1987లో చేసుకొన్న ఇండో - శ్రీలంక ఒప్పందమును గూర్చి గాని ఇండియా శాంతి సైన్యమును శ్రీలంక పోవడంను అంతగా పట్టించుకొనవసరం లేదు. కాని ఎందుకు ఈ రెండు దేశాలు ఒకదేశ సైన్యం మరో దేశంలోకి ఆహ్వానించడం మరో దేశంలోకి సైన్యం పంపడమనేది ఈ రెండు దేశాలయొక్క ప్రయోజనాలు దెబ్బతినకపోతే ఎందుకు అంగీకరించడం జరుగుతుంది. శ్రీలంక అధ్యక్షుడు శ్రీ జయవర్ధనే విదేశీ సహాయం పాకిస్తాన్ను, బ్రిటన్ను ఎంతో అవసరమున్న వాడిలాగ అడుగుతున్నప్పుడు ఇండియా, శ్రీలంక లోని తమిళులకు సహాయం చేస్తుంది. నన్ను కాపాడమన్నప్పుడు సైనికంగా

సహాయం చేయడం ఎంతో అవసరం ఇండియాకు తోచింది. అట్లా ఇండియా గనుక సైనికంగా సహాయం చేయకపోయినచో ఇండియా ప్రక్కనే మరొక దేశం తనకు వ్యతిరేకంగ చర్చలు కొనసాగించడం మన జాతీయ ప్రయోజనానికి దెబ్బ. అందు కనే ఇండియా సైనిక తన సైన్యం పంపి శ్రీలంకలో శాంతిని నెలకొల్పుటకు అంగీకరించింది.

అప్పటి నుండి ఇండియా శ్రీలంకను అడుగుతుందేమిటంటే ఏదైన సమస్య పరిష్కారంను రాజకీయ సంభాషణద్వారా కాని, తమకు తోచిన విధంగా ఉద్రిక్త తను తొలగించి మధ్యవర్తిత్వ విధానం ద్వారా అందరికి తగిన పరిష్కారంను చేయుటకు ఇండియా తన సామర్థ్యంను శ్రీలంక కిచ్చుటకు సిద్ధంగా ఉందంది. ఈ విషయంపై ఆనాటి విదేశాంగశాఖ రాజ్య మంత్రి శ్రీ కుర్షిద్ అలామ్‌ఖాన్ లోక్‌సభలో ఏప్రిల్ 29, 1985 సమాధానం చెప్పాడు. "ఇండియా తమిళులపై జరుగుచున్న అన్యాయంను గుర్చి మాత్రమే తీసుకొంటుంది. వారు ఇండియాలో కాశ్మీర్ సమస్యపై జయవర్ధనే చేసిన కామెంట్‌ను గూర్చి తీవ్ర అసంతృప్తిని ప్రకటించింది.

శ్రీ జయవర్ధనే పాకిస్తాన్‌ను సందర్శించినపుడు జమ్మూ, కాశ్మీర్ సమస్యను తిరిగి తోడడం శ్రీలంకలో నున్న విదేశీ ఎజెన్సీలు **SAS, Mossad, CIA and VOA** లను గూర్చి వాటి పాత్రలను గూర్చి కూడ చెప్పడం జరిగింది. ఈ ప్రకటన చేసిన తరువాత జయవర్ధనే బెంగుళూరు **SAARC** సమావేశంకు సందర్శించిన కాలం మధ్యలో శ్రీలంక రాజకీయ నాయకుల మధ్య కొంత ఓర్పు, అవగాహన కలిగింది. రాజ్యాంగ బద్ధంగా తమిళుల మోడరేటులకు కొన్ని అవకాశా లను కల్పిస్తూ మిగతా మిలిటెంట్ తమిళులకు ఉంటే శాంతంగా ఉండడం లేక పోతే దేశం వదలి పొమ్మని అల్టిమేటమ్ యివ్వడం జరిగింది. దీనివలన ఇండియాకు హార్డ్‌కోర్ తమిళులపై కఠిన చర్యలు తీసుకొని నియంత్రణ చేయుటకు ఆస్కారం కలిగింది. ఇదే సమయంలో భారత ప్రభుత్వ విదేశాంగశాఖ అధికారులు మిగతా శ్రీలంక తీవ్రవాదు వర్గాలు ఈలామ్ జాతీయ విముక్తి ఫ్రంట్ **(ENLF)** యునైటీల తమిళుల లెఫ్ట్ ఫ్రంట్ **(TURF)** పీపుల్స్ లిబరేషన్ ఆఫ్ టైగర్స్ **(PLOT)** మధ్య శ్రీలంక తమిళుల సమస్యను గూర్చి చర్చించడానికి ప్రాతినిధ్య వహించడానికి పోటీ పడింది.

మరొక వైపు శ్రీలంక నాయకులు ఈ తమిళుల సమస్యను యింకా కొనసాగించినట్లయితే తమకే నష్టమని తలచారు. ఎందుకంటే ఇప్పటికే తమిళుల సమస్య వలన చాల వరకు జాతీయ ఆర్థిక విధానం దెబ్బతింది. మరింకా దెబ్బతినడానికి అవకాశం యివ్వకుండ తమిళ మిలిటెంట్ వర్గాలు బలపడకుండా చూడాలంటే ఏదో పరిష్కార మార్గంను ఆలోచించాలనే నిర్ణయానికి వచ్చారు. దానితో ఏదో పేకేజ్ డీల్‌ను చాల వివరణలతో కూడిన అంశాలతో తమిళ్ యునైటెడ్ లిబరెషన్ ఫ్రంట్ ప్రతినిధులతో కలిసి తయారు చేయుచున్నారు. ఆ అంశాలన్నియు న్యూఢిల్లీ వైపు మొగ్గు చూపాయి దానితో శ్రీలంక ఇండియాను పరిష్కారంలో సహాయం చేయుటకు అడిగారు. ఢిల్లీ వెంటనే అంగికరించడం జరిగింది.

అదే సమయం శ్రీలంక అధ్యక్షుడు శ్రీ జయవర్ధనే ఆఖరి సారిగా తమిళ్ మిలిటెంట్లపై కక్ష తీర్చుకొనుటకు సిద్ధంగా ఉన్నాడు. ఆ తరువాత 1986 జూన్ మొదలుకొని శ్రీలంక సైన్యము ట్రింకొమలైలోను, దాని చుట్టు ప్రక్కల సైనిక బ్లాకేడ్ చేయుడం ఆర్థికంగా జఫనా ఏరియా అంతటినీ బంధించడం జరిగింది. ఇదే విధానం పెద్ద ఎత్తున తిరుగుబాటు చేయడానికి ఎక్కువగా సైన్యంను ప్రజలను చంపడం జరిగింది. అదే ఎక్కువ మందిని చంపడంతో భారత ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ శ్రీలంక ప్రభుత్వానికి వార్నింగ్ యివ్వడమే కాకుండగా ఇట్టి పరిస్థితిలో శ్రీలంక తమిళులలో సాధ్యమైనంతవరకు శాంతిని నెలకొనడానికి ప్రయత్నించాలన్నారు. భారత ప్రభుత్వం ఇండియా శాంతి సేనలను పంపించడమనేది జయవర్ధనేపై చాల భారంను మోపడం జరిగింది. ఆయనను చాల యిబ్బందులలో పెట్టడం జరిగింది.

ఇప్పుడు శాంతి సేనలను పంపడం అనేది రెండు దేశాల అంగీకారంతో జరిగిందని చెప్పవచ్చును. కాని కేవలం ఇండియా పంపాలని కాని, లేదా శ్రీలంక సైన్యంను పంపాలని అనుకోలేదు. ఈ ఆలోచన రెండు దేశాల ఎలిట్ వర్గాల నుండి వచ్చిందని చెప్పవచ్చును. న్యూఢిల్లీ యొక్క స్టాండ్, ఇండియా ప్రజలు విదేశాల్లో మన్నవారి బాధ్యత నుండి తప్పుకుంటానికి చేసింది. అదే ఆదేశంపై దండెత్తడం చాల దుష్ట ఫలితాలకు దారితీస్తుంది. శ్రీలంకకు మాత్రం విదేశీయుల తమ అంతర్గత సమస్యలలో తలదూర్చడం ముందు ముందు ఏదైనా పరిస్థితులకు దారితీయవచ్చును. ఏ చర్య తీసుకొనిన యెడల పౌర తిరుగుబాటుకు దారితీయవచ్చును. అంతే కాకుండ ఇప్పటికే దాడిపక్ష రాడికల్స్ తిరుగుబాటు చేస్తున్నారు.

శ్రీలంక సమస్య రెండు రాజ్యాల సిద్ధాంతానికి దారితీస్తుంది. శ్రీలంక ఇండియన్ స్టైల్‌తో చర్యలు తీసుకొన్న యెడల కొంతవరకు తమ భూభాగాన్ని సంరక్షించు కోవచ్చునని తలంచింది. దానితో ఇండియా కూడ కొంత బాధ్యత వహించి శ్రీలంక విచ్ఛిన్నకర పరిస్థితి నుండి కాపాడాలని నిర్ణయించుకొంది. కాని ఈ బాధ్యత చాల కష్టమైందని తలచి తలమార్చింది. అంటే ఎప్పుడైతే దేశాలు చాల అవసరాల్లో ఉంటాయో అప్పుడు తమ మధ్యనున్న అంతరాలను మర్చిపోతాయి.

## ఇండో - శ్రీలంక ఇతర సంబంధాలు :

ఇండియాతో, శ్రీలంకతో సంబంధాలు ఏ విధంగా ఉన్నాయనేది పరిశీలించుదాం. 1970 వరకు ఇండో-శ్రీలంక ఆర్థిక ద్వైపాక్షిక సంబంధాలు అంతగా వృద్ధి చెందలేదు. ఈ రెండు దేశాల మధ్య ఆర్థిక సంబంధాలు పెంచడానికి తక్కువ కృషి జరిగింది. ఇదేకాలంలో ఈ దేశాల, పశ్చిమ దేశాల సంబంధాలలో ముఖ్యంగా కామన్‌వెల్త్ దేశాలతో సంబంధాలు పెరగడం జరిగింది.

శ్రీలంక తన విదేశీ వాణిజ్యంలో తక్కువ లాభాలు పొందుతుంది. 1972-

U. S. $డాలర్లలో

| Year | ఇండియా నుండి శ్రీలంకకు దిగుమతులు | శ్రీలంక నుండి ఇండియాకు ఎగుమతులు |
|---|---|---|
| 1972 | 17.9 | 1.6 |
| 1973 | 12.5 | 1.6 |
| 1974 | 32.9 | 6.7 |
| 1975 | 21.3 | 0.4 |
| 1976 | 21.4 | 0.2 |
| 1977 | 39.1 | 1.2 |
| 1978 | 86.3 | 7.1 |
| 1979 | 149.9 | 12.5 |
| 1980 | 96.5 | 34.4 |
| 1981 | 76.1 | 29.4 |
| 1982 | 73.1 | 21.0 |

82 శ్రీలంక విదేశీ వాణిజ్యంలో నష్టం $ 13 నుండి $ 756 మిలియన్ల డాలర్లకు పెరిగింది. ప్రక్కనున్న ఇండియాతో కూడ శ్రీలంక వ్యాపారంలో నష్టం కొన సాగుతుంది.

**ఆధారం :**

ఐక్యరాజ్య సమితి సావత్సరిక రిపోర్ట్ ఆసియా-పసిఫిక్-1982 P. 513.

శ్రీలంక చాల వరకు దిగుమతులపై ఆధారపడి ఉందని పై టేబుల్ ప్రకారం తెలుస్తుంది. శ్రీలంక చాల వరకు తమ ఉత్పత్తుల విషయాలను నిర్లక్ష్యం చేసిందని చెప్పవచ్చును. శ్రీలంక అత్యవసర వస్తువులైన పాలు-వెన్న ఉత్పత్తి చేయడం కాకుండ చాల వరకు దిగుమతి చేసుకొంటుంది. వీటి దిగుమతుల బిల్లు శ్రీలంక రూపాయి 57.3 మిలియన్ల 1972 నుండి శ్రీలంక రూ. 438.3 మిలియన్లకు 1982కు పెరిగింది. బియ్యం, పంచదార దిగుమతులు ఖరీదు S L రూ. 237.7 1972 లో వుంటే SL. రూ. 720.5 మిలియన్‌లకు పెరిగింది. పశు ఉత్పత్తులలోను ఇతర పంటలలోను చాల వెనుకబడి వుంది. కాని శ్రీలంక సహజంగా లాభాలు తెచ్చేది రబ్బరు ఎగుమతులు. కాని ఈ రబ్బరు పరిశ్రమకు లాభాలు తెచ్చిపెట్టేదిగా చేయలేదు.

ఇట్లాంటి పరిస్థితిలో శ్రీలంక, ఇండియా ఏకత్వం మరియు వ్యాపార స్థితిని అంచనావేసి అవకాశం చూసికొని, శ్రీలంకతో చొరవతో ప్రవేశించడం జరిగింది. అంతేకాక శ్రీలంకయొక్క సమతౌల్య వ్యాపారం లాభకరంగా లేకపోవడంతో పారిశ్రామిక పెట్టుబడులను పెంచవలసిన ఆవశ్యకత ఏర్పడింది. దీనితో ఆర్థిక సహకార కమిటీ మొదటి మీటింగ్ కొలంబోలో జనవరి 1969 జరిగింది. ఇందులో ఒక వర్కింగ్ కమిటీ ఏర్పాటుచేసి ఏ విధంగా తమ వ్యాపారంను పెంచుకొనవలసిన అవసరం ఉందో దానిపై స్టడీ చేయమని కోరింది. జాయింట్ వెంచర్ టెక్స్‌టైల్ ఉత్పత్తిలో ఇండియాకు చెందిన బిర్లా కంపెనీ ఆర్థిక సమన్వయంతో ఏర్పాటు చేయడం జరిగింది.

ఇండియాయొక్క సహాయంతో ఎలక్ట్రికల్ గ్రిడ్‌లతో శ్రీలంక ద్వీపం పెక్కు యింధనంను పెంచడానికి ప్రయత్నం జరుగుచున్నది. 1973 ఏప్రిల్‌లో ఇండియా ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ శ్రీలంక సందర్శనం తర్వాత ఒక

అధికారిగేషన్‌ను పంపి ఏ ఏ రంగాల ద్వైపాక్షిక సహాయ సహకారాలను పెంపొందించుకొనే అవకాశం ఉందో పరిశీలించడం జరిగింది ఇండియా సహాయంతో గ్లాస్ షీట్ల ఉత్పత్తి, రబ్బరు వస్తువులు, మైకా- గ్రాఫైట్ ప్రొసెసింగ్ రీఫ్యాక్టరీలు మోటారు స్పేర్‌పార్టులు తయారుచేయడం. అదే ఇండియా రూ47 మిలియన్‌ల విలువ గలిగిన వస్తువులను కొనడానికి అంగీకరించాయి.

శ్రీలంక ప్రణాళికగాను, ఒక కోటిరూపాయలు అప్పు ఇండియా వస్తువులు అప్పుగా 5 కోట్లవరకు కొనడానికి దాన్ని 15 సంవత్సరాలలో 5% వడ్డీతో యిచ్చేటట్లు ఒప్పందం చేసుకొన్నాయి. అదే విధంగా 50 లక్షల రూ. విలువచేసే పశువులు గొర్రెలను పెంచి పోషించడానికి దానం చేసింది. 1974 కాలంలో శ్రీలంక ప్రధాని శ్రీమతి సిరిమావోబండారీనాయక్ క్రొత్త ఢిల్లీని సందర్శించినపుడు ఇండియా-శ్రీలంకలు షిప్పింగ్, టూరిజమ్, ఫెర్టిలైజర్ ప్లాంట్, రబ్బర్ ఇండస్ట్రీ సహకారం ఒప్పందం కుదిరింది. ఇండియా పొలిమేర్, కొబ్బరిపంట, టీ ఉత్పత్తిలో రీసెర్చ్, అభివృద్ధికి సహాయం అందించడానికి అంగీకరించింది.

అయినా ఇండియా పెద్దఎత్తున శ్రీలంక ఆర్థిక వ్యవస్థలో చొరబడడానికి అంగీకరించలేదని చెప్పవచ్చును. కొన్ని రాడికల్ గ్రూపులు ఈ రెండు దేశాల అభివృద్ధిలో చొరబడడం వ్యతిరేకించాయి. ఎందుకంటే ఈ రెండు పెరుగుతున్నా ఆర్థిక వ్యవస్థలు అంతగా ప్రయోజనం కలుగలేదేమోననుకున్నారు. ఇండియా యొక్క మిశ్రమ ఆర్థిక వ్యవస్థ మూలంగా ప్రభుత్వంచే ప్రోత్సహించిన అభివృద్ధి కార్యక్రమాలును ఎక్కువ అవకాశాలు ఇండియాలో ఏర్పడడం జరిగింది. అంతే కాక పెద్ద మార్కెట్లను బయట ఏర్పరచుటకు అవకాశం కలిగింది. శ్రీలంకలో నత్త నడకపై పెట్టుబడులు నడుస్తూవున్న అధిక తలసరి జాతీయ ఆదాయంను కలిగింది.(ఇండియా $ 330, శ్రీలంక U$ 420) అయినా శ్రీలంకలో ఎక్కువ పెట్టుబడులు పెట్టవలసివున్న ఇండియా మాత్రం వ్యాపారంలో పుంజుకొనలేదు.

దీనికి కావలసిన సక్రమ అవకాశంను ఈ 7 దేశాల సార్క్ సహకార సంస్థ ఏర్పడినపుడు వచ్చాయి. శ్రీలంక యిన్ని విధాలుగా వెనుకబడి వున్నను సమానమైన వ్యాపార ఒప్పందాలనుకూడ అసమాన వ్యాపార ఒప్పందాలను పశ్చిమ దేశాలతో చేసుకొంది. శ్రీలంక అంతర్జాతీయ బహుళ ఆర్థిక సంస్థలు

సభ్యరాలుగా గ్రూప్-77 జరుగుటవలన బాంగ్లాదేశ్ 1987 **SAARE**ను స్థాపించ డానికి ప్రోత్సాహంను పొందింది శ్రీలంక ఇట్లాంటి అంశాలలో అనుభవం ఉంది 1976 NAM సమావేశంను జరిపి హిందూమహా సముద్రంపై అధికారంను పొందడానికి, శాంతి మండలంగా ప్రకటించడంకు చొరవ తీసుకొనడానికి అవ కాశం కలిగింది. ఈ అంశాలపై శ్రీలంకకు అన్నివిధాలు ఇండియా ప్రోత్సా హంను అందించింది. ఇండియా ఉగ్రవాదంను అరికట్టడానికి తీసుకొన్నచర్యలకు శ్రీలంకకూడ ప్రోత్సాహంను అందించింది. అంతేకాక తన ప్రాంతాలలో విదేశీ వ్యాపారంను నియంత్రణ, కొన్ని వనరులు కలిసికట్టుగా ఏర్పరచి మెటీరియాలజీ నూతన వ్యవసాయం, టెలికమ్యూనికేషన్ రంగాలలో జాయింట్ రీసెర్చ్ చేయ డానికి అంగీకరించాయి.

విశాల దృక్పథంతో చూచిన యెడల ఇండో-శ్రీలంక సంబంధాలు రోజు రోజుకు వృద్ధి అవుతున్నాయి కాని చిన్న విషయాలైన కచ్చాతీవి, తమిళుల సమస్యలపై కొంత విరోధము ఏర్పడిన సాధారణ సంబంధాలు పెరుగుతూనే ఉన్నాయి. ఈ రెండు దేశాలు రాజకీయ శిష్టులు చేసేదేమిటంటే వలసవాదనాంతర రాజకీయ నిర్మాణంను, జాతీయ నిర్మాణంను రోజు రోజు వ్యతిరేకులను ఎదు ర్కొన్న దానిని బలపరచుకొనవలసిన ఆవశ్యకత ఎంతైన ఉంది. ఈ రెండు చేయవలసిన అత్యవసరం.

# 16. దక్షిణ ఆసియా దేశాల ప్రాంతీయ సహకార సంఘం (సార్క్)

దక్షిణ ఆసియా ప్రాంతం ప్రత్యేక భౌగోళిక పరిస్థితులమధ్య ఏర్పడి ప్రస్తుతం ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక సారూప్యంను కలిగి ఉన్నది. ఈ సంఘంలోనున్న దేశాలన్నియు వలసప్రాంతాల చరిత్రను కలిగియున్నాయి. ఈ ప్రాంతమంతయు ప్రత్యేకమైన సాంస్కృతిక ఐక్యత కలిగి ఉన్నదంటే వారి మతం, భాష మూలంగానే ఉందని చెప్పవచ్చును. పేదరికం, జనాభావత్తిడి, నిరుద్యోగ సమస్య, మందగొడి ఆర్థికాభివృద్ధి కలిగి దక్షిణ ఆసియా ప్రాంతం ఒకే సమస్యలను కలిగియున్నాయి. దక్షిణ ఆసియాప్రాంత దేశాలైన భారతదేశం, పాకిస్తాన్, నేపాల్, భూటాన్, శ్రీలంక మాల్దీవులతో సుమారు ఒక బిలియను జనాభా 20% ప్రపంచ జనాభాలోను, 33% మొత్తం భూమండలంపై నివసించే జనాభాను కలిగియున్నది. అందులో భారతదేశం 72% ప్రాంతం 77% జనాభాను, 78% జాతీయాదాయం కలిగియున్న దేశం. అయినా ఈ ప్రాంతదేశాలు ఇప్పటివరకు ప్రాంతీయ సంఘం లేకుండ వున్నాయి. మిగతా ప్రాంతీయ సంఘాలైన తూర్పు దక్షిణ ఆసియాదేశాల సంఘం. అంజూస్ (అమెరికా, న్యూజిలాండ్, ఆస్ట్రేలియా ఐరోపా ఆర్థిక సంఘంకు సంబంధించిన దేశాలు తమమధ్య సహకారంకోసం చాల విపులమైన వ్యవస్థను ఏర్పరచుకున్నాయి. ఈ సంఘాలన్ని ప్రాంతీయంగా తాత్కాలిక, ఆర్థిక విషయాలు. వ్యాపార, పారిశ్రామిక, సాంకేతికంగా సహాయం అందించుకోవడానికి ఏర్పాటు చేయబడ్డాయి. అదే విధంగా ఈ దక్షిణ ఆసియా ప్రాంత దేశాలు ప్రాంతీయ సహకార సంఘంను, ఏడు దేశాలు ఏర్పాటు చేసుకొన్నాయి.

ఈ ప్రాంతీయ సహకార సంఘాలు ఆసియా దేశాలలో ఏర్పడడం క్రొత్తేమీ కాకపోయిన ఇటీవల సంబంధించిన పరిణామములు పరిపాలనా శిష్టుల మధ్య ఈ ఆలోచనను లేవదీసినాయి. ఈ ప్రాంతం చాలావరకు భౌగోళిక సారూప్యతను కలిగి ఉంది. సాంస్కృతికంగా దగ్గర సంబంధాలు కలిగినది కనుక తగిన విధంగా ఒక సంస్థాగత వ్యవస్థ ఏర్పడక పోవడానికి చాలా కారణాలున్నాయి. కొన్ని

వ్యక్తిగత కారణాల వలన పాకిస్తాన్ దాని నాయకత్వంను వ్యతిరేకిస్తూనే కొన్ని దేశాల ముఠాలుగా సైనిక కూటమిలను కూడ సృష్టించు కున్నది. అదే విధంగా భారత్ యొక్క పరిణామం, జనాభా, అభివృద్ధి, సాంకేతిక, శాస్త్ర విజ్ఞానంలో ముందంజ వేయుటను చూచి చిన్న దేశాలు వాటిపై పెత్తనం కొన సాగించు తుందేమో నని భయపడి యింతవరకు ఒక ప్రాంతీయ సంఘంగా ఏర్పడడానికి ఆలస్యం చేశాయి.

ఎప్పుడైతే ప్రపంచ వ్యవస్థయిన ఐక్యరాజ్య సమితి, సభ్యదేశాలు ముఖ్యంగా నూతన స్వాతంత్ర్యం పొందిన దేశాలు ఆశించినంత మేర తమ రక్షణకు కాని, ప్రపంచ భద్రతలకు, ఆర్థిక సహాయ సహకారాలను పెంపొందించుటలో 1980 దశకం ప్రారంభంలోనే వెనుకంజ వేయడానికి మొదలిడిందో లేద ప్రపంచ దేశాల సమస్యలను పరిష్కరించలేని స్థితికి దిగజారిందో అప్పటి నుండి ప్రాంతీయంగా కొన్ని దేశాలు ఏర్పాటు చేసుకొన్న సంఘాలకు ప్రాముఖ్యత పెరిగి శాంతి సహకారం, సంయుక్త సమస్యల పరిష్కారం కొరకు అన్వేషణ ప్రారంభమయింది. అందులో భాగంగానే మొట్ట మొదటిగా దక్షిణ ఆసియా ప్రాంతీయ సహకార సంఘం ఏర్పాటు చేసుకొంటే మంచిదని 1979 లో బాంగ్లాదేశ్ అధ్యక్షుడు జియా-ఉర్-రెహమన్ సూచించడం జరిగింది. ఈ దక్షిణ ఆసియా ప్రాంతీయ సహకారం రూపుదాల్చడం కోసం అధికారికంగా ఏడు దేశాల మధ్య అనేక సమావేశాలు జరిగాయి. భారతదేశంలో చాలా జాగ్రత్తగా ఉమ్మడి అంశాలకు రెండు దేశాల మధ్య ఉండే సమస్యలు ఆటంక పరుస్తాయనే భయంతోనే ఈ సహకారంకు ప్రోత్సాహం నిచ్చింది. పాకిస్తాన్ అంతగా యిష్టత చూపలేదు. ఈ సహకారం భారత పారిశ్రామికాభివృద్ధికి కాని తన మార్కెట్లకు కాని ఉపయోగించుకొన వచ్చుననే భయం పాకిస్తాన్‌కు లేక పోలేదు. కాని బాంగ్లాదేశ్ వాదన ప్రకారం రెండు దేశాల మధ్య సమస్యలు ఎట్టి పరిస్థితులలోను ప్రాంతీయ సహకారంకు అడ్డురాదని, దీనికి ఉదాహరణగా తూర్పు దక్షిణ ఆసియా దేశాల సంఘం (ASEAN)ను పేర్కొనెను.

దక్షిణ ఆసియా ప్రపంచ జనాభాలో ఐదవ వంతు జనాభాకు అసలు ప్రాంతీయ సంఘం లేదు కనుక అందుకు కృషి చేయాలని కోరింది. బాంగ్లాదేశ్ వాదం ఏమంటే సంస్థాగత రూపం కొన్ని ప్రయోజనాల నాశించి రెండు దేశాల మధ్య ఉండే విభేదాలను దూరంగా ఉంచి, రాజకీయ కూటమిలకు దూరంగా ఉంటూ ప్రాంతీయ సహకారం వృద్ధిచెందాలని ఆశించింది. ఈ ప్రాంతీయ సహకారం

ముఖ్యంగ రవాణా, కమూ నికేషన్లు, పర్యటనాభివృద్ధిలో ఉత్పత్తి రంగాలైన పరిశ్రమలు, వ్యవసాయంలో ప్రాంతీయ సహకారాభివృద్ధి చెందాలని దేశాలులో యితోదోదికంగా వనరుల వినియోగంలోకి రావాలని ఆశించింది. అదికాకపోతే దక్షిణ ఆసియా దేశాల మధ్య సహకారంతో అభివృద్ధి చెందుతున్న దేశాలు నెలకొల్పాలని ఆశించిన నూతన అంతర్జాతీయ స్క్రమ స్థితికి దోహదపడాలని పేర్కొంది.

బాంగ్లాదేశ్ ఆధ్వర్యంలో దక్షిణ ఆసియా దేశాల ప్రాంతీయ సహకార సంఘంను ఏర్పాటు చేయుటకు ధృవపత్రాలను తయారు చేయడం అది 1980 జనవరిలో అన్ని దేశాలకు పంపబడినాయి. బాంగ్లాదేశ్ తయారు చేసిన పత్రంలో ఏ ఏ అంశాలలో సహకారం ఏర్పాటు చేయబడాలనేది పరస్పర సహకారం లభించేవి గుర్తించబడినాయి. ఆ పేపరను ఆయా దేశాలమధ్య చర్చలకు ఉంచినారు దానిపై చర్చ కొలంబొ(శ్రీలంక) 1981 ఏప్రిల్‌లో దక్షిణాసియా దేశాల ఫోరమ్‌లో నిర్వహించబడి రూపొందించ బడ్డాయి. అదే రీతిలో విదేశాంగ మంత్రుల మధ్య ఖాట్మాండులో 1981 నవంబర్‌లో కూడా చర్చించబడ్డాయి. తదానంతరం(Saark) సార్క్ రూపు దిద్దుకునే ముందు ప్లీనరీ సమావేశాలు 1982 ఫిబ్రవరిలో కొత్త ఢిల్లీ లోను, 1982 ఇస్లామాబాద్ మరియు చివరిసారిగా 1983లో ఢాకాలోను జరిపిన చర్చలలో వివిధ అభిప్రాయాలను వ్యక్తపరచిన ఈ ఏడు దేశాల మధ్య ప్రాంతీయ సహకారం సంస్థ ఏర్పాటుకు అంగీకరించాయి. కాని ఉపఖండంలోని దేశాల మధ్య రాజకీయ భద్రతాది విషయాలలో ఒకే దృక్పథం ఏర్పడడం ఇప్పుడిప్పుడే జరుగని పనికాదని, అయినా ఉప ఖండంలో శాంతియుత వాతావరణం నెలకొనాలంటే భారతదేశం వంటి శక్తివంతమైన దేశాన్ని ప్రాంతీయ సహకార ఛట్రంలో బంధించడం ఒక్కటే మార్గమని జియా-ఉల్-రెహమాన్ భావించాడు. చిన్న చిన్న దేశాలు పొరుగున ఉన్న శక్తివంతమైన రాజ్యాల నుండి ప్రమాదం లేకుండా చేసుకొనడానికి ఇలాంటి మార్గాలే అనుసరిస్తుంటాయి. తమకూ పొరుగున ఉన్న పెద్ద దేశానికి మధ్య సమతుల్యాన్ని సాధించడం కోసం విదేశీ సహాయంనైనా తీసుకొంటాయి. లేద దాన్నొక వ్యవస్థీ కృత చట్రంలో బంధించడానికైనా ప్రయత్నిస్తాయి. ఆ రూపంలోనే ఒక సమగ్ర కార్యక్రమంను రూపొందించడం సమగ్రమైన ప్రాంతీయ కార్యక్రమమును ఏర్పాటు చేసుకొన్నాయి. కాని ఈ ఏడు దేశాలలో పెద్ద దేశం అయిన భారతదేశం మిగతా దేశాల వారి అభిప్రాయాల కనుగుణంగా వారికున్న భారతదేశం అంటే భయాన్ని తొలగించాలి.

## సార్క్ ఏర్పాటు - మొదటి సార్క్ శిఖరాగ్ర సమావేశం డిశంబర్ 7-8-1985

దక్షిణ ఆసియా దేశాల మధ్య నాలుగు సంవత్సరాల నుండి జరిగిన సమావేశాలలో సిద్ధం చేయబడిన ప్రాంతీయ కార్యక్రమంను అంగీకరించి, సార్క్ ఏర్పడినట్లు ప్రకటించి వారి కార్యక్రమం ఆమోదమునకై ఢాకాలో సమావేశం ఏర్పరచిరి. అదే మొట్టమొదటి దక్షిణ ఆసియా దేశాల ప్రాంతీయ సంఘం సమావేశం. బంగ్లాదేశ్ రాజదాని ఢాకా నగరంలో డిశంబర్ 7-8-1985 న ఏడు దేశాలు భారత దేశం, పాకిస్తాన్, శ్రీలంక, నేపాల్, భూటాన్, మాల్దీవులు రాజ్యాలయినాయి. ఇందులో బాంగ్లాదేశ్ అధ్యక్షుడు సార్క్ మొదటి అధ్యక్షుడుగా సార్క్ ఏర్పడినట్లు ప్రకటించెను.

ఈ సమావేశంకు అధ్యక్షుడు మహ్మద్ ఎర్షాద్, భారత ప్రధాని రాజీవ్‌గాంధీ, పాకిస్తాన్ అధ్యక్షుడు జియా-ఉర్-హాక్. శ్రీలంక అధ్యక్షుడు జె.ఆర్.డి. జయవర్దన్ భూటాన్ రాజు జిగ్మే సింగే వాంఛుక్, నేపాల్‌రాజు బీరేంద్ర, మాల్దీవుల అధ్యక్షుడు మహ్మద్ అబ్దుల్ గయూమ్‌లు హాజరైనారు. భూటాన్ రాజు వాంఛూక్ మాట్లాడుతు ఈ ప్రాంత ఏడుదేశాల మధ్య కలహాలు, వివాదం లేకుండ కొనసాగుతూ రాజకీయ నిషేధం లేకుండ దక్షిణాసియా దేశాలు కొనసాగుతాయని ఆశించారు. జనరల్ జియా-ఉర్-హాక్ మాట్లాడుతూ ప్రాంతీయ సంఘాలు ఆయా దేశాల మధ్య నమ్మకాన్ని దృఢ పరుస్తాయని ప్రవశించెను. ఈ ఏడు దేశాలు మధ్య ఒకరికొకరు వ్యక్తిగతంగా, సమిష్టిగా ఒకరిపై ఒకరు దండెత్తకుండ, ఘర్షణలకు దిగకుండ ఉండాలని ప్రతిజ్ఞ చేయాలన్నారు. అణు ఆయుధాలను, ఈ ప్రాంతం నుండి వైదొలగించి ఒక నూతన పద్ధతిలో అవసరమైనపుడు చర్చలు జరుపుకొంటు శాంతిని నెలకొల్పి సుస్థిరం చేయాలన్నారు.

శ్రీలంక అధ్యక్షుడు జయవర్ధన్ భారతదేశం మాటలలోను, చేతలలోను ఈ ప్రాంత దేశాల మధ్య దృఢ నమ్మకాన్ని కలిగించి మాకు మార్గ దర్శకులుగా ఉండాలన్నాడు. వీరిద్దరు కూడ వారి ప్రసంగాలలో దక్షిణాశియా ప్రాంత రక్షణను గూర్చి ఒక వర్గంగా వ్యవహరించాలని, **Asean** ఏ విధంగా తన విధానం ఆ ప్రాంతంలో కొనసాగిస్తుందో అదే పద్ధతిలో కొనసాగాలని కోరడం ఆశ్చర్యం కలిగించింది. రాజీవ్‌గాంధీ తన ప్రసంగంలో ఏ విధమైన అపనమ్మకాన్ని తన

ఇరుగు పొరుగు దేశాలపట్ల కలిగి ఉన్నారని పలుకలేదు. కాని ఒక పద్ధతిలో లేద మోడల్‌గా లేద ఆదర్శ ప్రాయంగా ఈ ప్రాంత సహకార సంఘం కొనసాగాలి. వారి వారి ద్వైపాక్షిక విభేదాలను ఈ ప్రాంతీయ సహకారంతో ముడిపెట్టరాదని, ప్రాంతీయ సమగ్రతను దృష్టిలో ఉంచుకొని కొనసాగాలని కోరడం జరిగింది.

ఈ సంఘంతో పాటు ఆ దేశాల విదేశాంగ విధానానికి ఇది క్రొత్త మార్గంగా కొనసాగాలని కోరడం జరిగింది. ఈ క్రొత్త సంఘం శిఖరాగ్ర సమావేశం వలన దక్షిణ ఆసియా దేశాల సహకారం విస్తరించడమేకాక నూతన దృష్టిలో ఏర్పడింది. మన ఆశయాలకు తగినట్లుగా క్రొత్త ఊపు, క్రొత్త మార్గం ఏర్పడిందని, అంతకంటే మించి ఈ ప్రాంతం ఇరుగు పొరుగు దేశాల మధ్య శాంతియుత, మంచి సంబంధాలు నెలకొంటాయని ఆశించారు. నేపాల్‌రాజు బీరేంద్ర మాట్లాడుతూ ఈ ఏర్పాటుతో సార్క్ తమ రక్షణను, స్వాతంత్ర్యంను యింకా పటిష్ఠపరచుకొనుటకు ఉపకరిస్తుందని చెప్పారు.

ఈ ప్రాంతీయ సహకారం సంఘంను ఏర్పాటుచేసుకొనడంతో ఈ దేశాలు క్రొత్తవెలుగు లోనికి ప్రవేశించాయి. అంతేకాక ఈ సంఘ ఏర్పాటుతో ఈ ప్రాంత ప్రజలకు యుద్ధభయం దూరం అయిందని చెప్పవచ్చు.

## సార్క్ ప్రకటనలు - చార్టర్

సార్క్ కొన్ని లక్ష్యాలతో కూడిన పత్రాలపై సంతకాలతో ప్రకటనలు వెలువడడం. అది భక్తితో శాంతియుతమైన వాగ్దానాలతో పూర్తయింది. సార్క్ ఢాకా ప్రకటనలో ముఖ్యమైన అంశాలను డిశంబరు 8, 1985 ఏడు దేశాధినేతలు సార్క్ ఆర్థిక, సాంఘిక అభివృద్ధిని సాధించుట ముఖ్యమైన తోడ్పాటును అందజేయాలని పేర్కొంది.

జాతీయ, సమిష్టి, స్వయం సమృద్ధిని పెంపొందించుకొని తద్వారా యింకా శాంతి, అభివృద్ధి నిశ్చలత(stability) దక్షిణ ఆసియాలోను ప్రపంచంలో ఏర్పడడానికి కృషి చెయాలని పేర్కొంది.

పేదరికం, ఆకలి ప్రపంచం నుండి తొలగించాలంటే శాంతి ముఖ్యం అని గుర్తించి దానికి కృషి చేయాలని సమావేశం నిర్ణయించింది.

ఈ సమావేశం ఆయుధ పోటీ ఆయుధ పోటీని నిలిపివేయాలని పిలుపు నిచ్చింది. ఒక విస్తారమైన (Compre hensing) అణు పరీక్షలను నిలిపివేయుటకు ఒప్పందంను కుదుర్చుకొన వలయునని అలీన విధానం ఒక్కాణించి తదనంతరం జాతీయ ఆర్థిక విధానంను ఏర్పరచాలని తద్వారా పేద దేశాల లక్ష్యాలను అవసరాలను తీర్చుకొనడానికి ఆస్కారం ఏర్పడుతుందని భావించెడిది.

## చార్టర్:

1) సార్క్ మనుగడలో ఐక్యమత్యం పెంపొందించడం ఆర్థికాభివృద్ధి సాధించుచు అందరికి సమాన అవకాశములుండు లాగున వారి జీవితాలను మర్యాదగా కొనసాగేలా చూడడం.

2) సమిష్టి స్వయం సమృద్ధిని పెంపొందించుట, పరస్పర నమ్మకంను కలిగించుట.

3) సమిష్టి స్వయం సమృద్ధిని పెంపొందించుటలో సాంకేతిక, శాస్త్రీయ రంగాలలో సహకారం, మిగిలిన దేశాలతో సంఘాలలో కలిసి అభివృద్ధి పథంలో కొనసాగించుట.

4) ప్రజలకు, ప్రజలకు మధ్య సంబంధాలను పెంపొందించి, ఆయా దేశాల మధ్య ప్రాంతీయ సమాచారం అందేలా చూడడం.

ఈ సమావేశం ఒక అధ్యాయన గ్రూపును ఏర్పాటు చేసి వివిధ రకాలైన మత్తు మందుల వ్యాపారంను, దాని ప్రభావం నుండి రక్షణ కల్పించుట, ఆయా దేశాలలో స్థిరత్వం కలుగజేసి కాపాడుకోవాలని సార్క్ రాజ్యాలు ఆశించినాయి.

## సార్క్ - వివిధ సమస్యలు

సమిష్టి ఆర్థిక ప్రయోజనం సాధించడం అనే ముఖ్యాంశంతో ఈ దక్షిణ ఆసియా దేశాల సహకార సంస్థ ఏర్పడింది. కాని ఈ ఆర్థిక సహకారం ఈ ప్రాంత వనరుల సద్వినియోగంగా రాజకీయ సఖ్యతపై ఆధారపడింది ఈ దక్షిణ ఆసియా ప్రాంతం యుద్ధం లేదు; శాంతి లేదు అనే రాజకీయ సూత్రంపై నడుస్తుంది. ఈ సార్క్ దేశాల మధ్య, పరస్పర విరుద్ధమైన రాజకీయ పోరాటంతో కొనసాగుతున్నాయి.

దక్షిణ ఆసియా రాజకీయ పద్ధతులలో ముఖ్యమైనవి భారత్-పాకిస్తాన్. ఈ రెండింటి మధ్య సరియైన రాజకీయ అవగతమైన సమస్య పరిష్కార మార్గం లేక పోవుట వలన రెండు రాజ్యాలు పరస్పరమైన అపనమ్మకం, విరుద్ధమైన భావాలతో సార్క్ స్థాపించిన నంతరం కూడా కొనసాగుతూనే ఉన్నాయి.

సార్క్ విజయం రాజకీయ, ఆర్థికరంగాలలో సాధించాలంటే ఈ దేశాల మధ్య పరస్పర విరుద్ధమైన భేదాలు తొలగడానికి వ్యవహార దక్షత అవసరం. సార్క్ ఉద్రిక్తతలు కలిగిన దేశాలను సమావేశపరచి సమస్య పరిష్కారం కొన్ని ప్రతి పాదనలు చేయగలగాలి.

1971 అనంతరం భారత్-పాకిస్తాన్‌ల మధ్య ఉపఖండంలో కొనసాగుతున్న ఆయుధీ కరణ పోటీ ఎక్కువ గావడం వైరుధ్యంను పెంచెడిదిగాను, సార్క్ దేశాల భవిష్యత్తు కార్యక్రమములకు అడ్డుకునేదిగానుఉన్నది. పాకిస్తాన్-భారతదేశాలు దీన్ని గుర్తించి శాంతియుత నిలకడయైన దక్షిణ ఆసియాను ఏర్పరుచుకొని నట్లయితే ఈ రెండు దేశాలు ప్రాంతీయంగాను, అంతర్జాతీయంగా ప్రముఖమైన పాత్ర వహించ చలవు. అలాంటిది గనుక సాధించినట్లయితే సార్క్ విజయవంతమైనట్లే. మరొక సమస్య నేపాల్ నీటి సదుపాయాలు, గంగాజలాల పంపిణి ఫరక్కా వద్ద బ్యారేజి నిర్మాణంతో కూడిన వైషమ్యాలు భారత్-బాంగ్లాల మధ్య కొనసాగుతూనే ఉన్నది. సార్క్ ప్రారంభంతో ఈ సమస్యకు ఒక నిర్దుష్టమైన, సులభంగా ఈ సమస్యకు ఒక ఆర్థిక పరిష్కారమే రాజకీయ పరిష్కారం కంటే మంచిది.

ముఖ్యంగ ఐరోపా సంస్థల్లాంటి వ్యవస్థలలో, చాలా వరకు తక్కువ రాజకీయాంశాలు చర్చించబడతాయి. వారి కార్యక్రమాలన్నియు ఆర్థిక విధాన నిర్ణయానికే ఎక్కువ ప్రాముఖ్యత నిస్తున్నాయి. కాని దక్షిణ ఆసియాలో రాజకీయాలే ఆర్థిక సహకారంను ఎంతవరకు కొనసాగించాలనేది నిర్ణయించుతాయి. ఈ విషయాన్ని గురించి భూటాన్‌రాజు జిగ్మే వాంఛూక్ మాట్లాడుతు సాధ్యమైనంత వరకు రాజకీయేతర అంశాలకే ఎక్కువ ప్రాధాన్యత నివ్వాలని, రాజకీయ వాతావరణం మిగతా అంశాలపై బడి అవి మరుగుపడి రాజకీయాలకే ఎక్కువ ప్రాధాన్యత యివ్వడం జరుగుతుంది. సార్క్ మొదట్లోనే ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక విషయాలకే తక్కువ ప్రాముఖ్యత నిచ్చింది. సార్క్ ముఖ్యంగా ఆర్థిక ప్రయోజనాలు, సహకారం, ఆర్థిక పరస్పర సహకారానికి, వాణిజ్యానికి అడ్డుతగులుతున్న అంశాలను తొలగించుకొని ఈ ప్రాంతం వెలుపల మార్కెట్లను పెంపొందించుకొంటు

న్నాయి. సార్క్ దేశాల మధ్య సమస్యలను గుర్తించి వారి ముఖ్య రాజకీయ సాంఘిక ప్రయోజనాలను బట్టి ప్రయోజనాలను, విలువలను లక్ష్యాలను క్రమంగా అన్ని దేశాల మధ్య పంచుకొనవలయును.

ఢాకా ప్రకటనలో రాజకీయ కళకు, దక్షిణ ఆసియా దేశాల వాస్తవమైన ప్రయోజనాలలో నిగూఢమైన అంశాలు దాగియున్నాయని విమర్శ లేకపోలేదు. ఈ ప్రాంతీయ సహకారంలో తక్కువ నిర్దుష్టమైన అంశాలు రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, సాంకేతిక, సమాచార రంగాలలోను ప్రతిరాజ్యం తన ప్రయోజనాలను వాటి కనుగుణంగా ప్రాథమిక సూత్రాల నిర్మాణంలో ఇవ్వడం జరిగిందని ప్రత్యేకంగా భారత్, పాకిస్తాన్, శ్రీలంక, బాంగ్లాదేశ్‌లు విడుదల చేసిన సంయుక్త ప్రకటనలలో తేటతెల్లమవుతున్నాయి. అంతేగాక భారత్‌ని నిరుత్సాహపరచిన అంశాలేవంటే ఆర్థికాభివృద్ధికి సంబంధించినటువంటివి. వ్యాపారం, పరిశ్రమలు, ఇంధనం, మొదలైన అంశాలను సార్క్ యొక్క పరిధిలోనికి తీసుకొనక పోవడమే. మరొక విధంగా చెప్పాలంటే దక్షిణ ఆసియా ప్రాంతం ప్రత్యేక ఆర్థిక మండలంగాను తద్వారా వృద్ధిచెందిన సమిష్టి ప్రాంతీయ కార్యక్రమము యింకా అప్పటికి వృద్ధి చెందలేదు. దానికి అనేక సమస్యలు ఎదుర్కొన వలసి వస్తుంది.

ఆర్థికంగా ఈ ప్రాంతంలో ముఖ్యంగా ఇండియాపై నున్న అభిప్రాయం పెద్ద దేశం. ఆర్థికంగా ఈ ప్రాంత దేశాల కంటే పటిష్టమైనది కనుక మార్కెట్లలో ఆధిక్యతను చెలాయించుతుందని విశ్వసించాయి. ఈ విధంగా పోల్చడంతో రాజకీయాలలో పై చేయిగా వుంటుందని భావించెను. భారతదేశం యొక్క పాత్రను ప్రధాని రాజీవ్‌గాంధీ ఢాకా సమావేశంలోను స్పష్టంగా వివరించెను. ఎవరైతే భారత దేశం పై ప్రతి విషయంలోను వ్యతిరేకంగా ఆలోచించడం జరుగుతుందని అలాంటి ఆధిక్యతకు తావుఇవ్వమని పేర్కొనెను. అయిదు సంవత్సరాలు నిర్విరామకృషితో ఎట్టకేలకు దక్షిణ ఆసియా దేశాల ప్రాంతీయ సహకారం ఆవిర్భవించింది ఈ ఏడు దేశాలు ఇప్పటి దృక్పథంను విస్తృతపరచిన దానిని సంతోషంగా స్వీకరించ వచ్చును. ఈ ప్రాంతంలో నున్న దేశాలు భారతయే ఈ ప్రాంత సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడాలి అన్నది బహిర్గతమే. కాని మిగత దేశాలు వారి వారి పలవంతమైన సహకారం నందించిన యెడల సార్క్ విజయవంతమవుతుంది.

## సార్క్ ఆవిర్భావం-భారతదేశంలో ప్రతిస్పందన

అనేక రకాలుగా భారతదేశంలో మిశ్రమప్రతిస్పందన సార్క్ ఆవిర్భావం పై వచ్చాయి. జాతీయ వార్తా పత్రికలన్నీ ఈ ప్రాంతీయ సమావేశంను దాని లక్ష్యాలను శ్లాఘించాయి. ఈ ప్రాంత దేశాల మధ్యనున్న విభేదాలు తొలగి ఫలవంతంగా ప్రాంతీయ సహకారంను పెంపొందించు కొంటాయని ఆశించాయి. అంతేగాక ఈ దేశాలలో జరుగుతున్న ఉగ్రవాద చర్యలను అరికట్టి నిశ్చలత రాజ్య వ్యవహారాలలో ఏర్పడ వచ్చునని, హత్యాకాండ తిరుగుబాటులకు సహాయం చేస్తున్న విదేశీ శక్తులకు ఇది ఎదురునిలిచి ఐక్యతను సాధించ వచ్చునని సూచించాయి. సార్క్ ఎవరు ఎక్కువ పాత్రను నిర్వహించుచున్నారు ఊహించడమే కాని దానిని కాలం అన్నిగాయాలను మాన్పుతుందనే విధంగా సార్క్ ఫలితాలను కాలమే నిర్ణయించుతుంది. అంతేగాక సార్క్ విజయవంతంగాను ఆశయ సిద్ధి నిష్పక్షపాతంగా కొనసాగాలంటే కేవలం భారత్ ఒక్కటే ఏమి సాధించలేదు. సభ్యుల అందరి సహాయ సహకారంతోనే అవుతుంది.

ఈ సార్క్‌ను ఏర్పాటు చేసినాక దాని చార్టర్, అందలి అంశాలను పరిశీలించినట్లయితే చాల పెద్ద ఆశయాలతో ఏర్పాటుచేయకపోయిన కనీసం ఈ దేశాలమధ్య ఉన్న వ్యాపార వాణిజ్య పోటీ ముఖ్యంగా టీ, జనపనార ఎగుమతిలో సమన్వయం సహకారాలందించు కొని అంతర్జాతీయంగా తరచు లాభాలను పెంచుకొనుటకు ఎక్కువగా అవకాశం ఏర్పడింది.ఆయా దేశాల మధ్య విరుద్ధభావాలు పైదొలగి తమ తమ జాతీయ ప్రయోజనాలను పెంపొందించుటకు ఎంతగానో తోడ్పడుతుంది. పరస్పర సహాయ సహకారాలు, వ్యవసాయం, ఆరోగ్యం, జనాభానియంత్రణ, వాతావరణ పరిశోధన, తంతి తపాలా సౌకర్యం గ్రామీణాభివృద్ధి, శాస్త్రసాంకేతిక రంగాలలోను ఆటలు, సంస్కృతి కళలు, టెలికమ్యూనికేషన్సు, ఋణసౌకర్యాలను పెంపొందించు విషయాలలో కొనసాగుతాయని మొదటి సమావేశంలో నిర్ణయించాయి.

సార్క్ స్థాపన అంతర్జాతీయ, ప్రాంతీయ చరిత్రలోను, ఆసియా చరిత్రలోను ముఖ్యఘట్టముగా పేర్కొనెను. వారి ఆశలు–ఆశయాలు దృష్టిలో నుంచుకొని చార్టరు కనుగుణంగా తమ పాత్రను నిర్వహించాలి. ఇక్కడద్వైపాక్షిక సంబంధాలను ప్రక్కనుంచి కేవలం సమస్యలకు సులక్షంగా పరిష్కారంను

ఏర్పరచాలని ఆశించింది. ఇవి అన్నీ ఎప్పుడు నెరవేరతాయంటే, ఈ ప్రాంతీయ సంఘదేశాలు కలిసి కట్టుగా తమనిశ్చయ తమ రాజకీయ ఐచ్ఛికతో ప్రదర్శించి నప్పుడు మాత్రమే ఫలితాన్ని పొందగలవు. అదేవిధంగా సార్క్ స్థాపన గూర్చి హిందూ పత్రిక సార్క్ స్థాపించడం చార్టరులోని అంశాలను ఈ ప్రాంతీయ దేశాలు ఎంతవరకు అమలు పరచగలవని అనుమానంగా వ్యక్తీకరించుచు, ఈ సభ్యులలో ఎవరైనను ఇతరుల బహిర్గత రాజకీయ, సైనిక రూపమును ఈ ప్రాంతంలో అంగీకరించినట్లయితే, ఈ ప్రాంత ఆర్థిక, సాంఘిక రాజకీయ, రక్షణ సంబంధాలలో చాలా మార్పులురావడానికి ఎక్కువగా అవకాశం ఉంటుంది. కాని ఇటీవల ఎదురౌతున్న సమస్యలు ఈ ప్రాంత సమిష్టి కార్యక్రమమును భంగ పాటు కలిగించేవిగా ఉన్నవనె అది ఎంతవరకు ఫలవంతం అవుతుందో కాలం నిర్ణయించాలి. కాని ఈ సంస్థ రూపం పొందినాక కూడా తమధ్యనున్న ద్వైపాక్షిక అంశాలను ప్రక్క నుంచటం ద్వారతమ సమస్యలను ప్రక్కకు నెట్టడం జరిగింది.

## ప్రాంతీయపర్యవసానం:

మొదటి సార్క్ ఢాకా సమావేశం దక్షిణ ఆసియా దేశాల మధ్య నున్న రక రకాలైన అంశాలను గుర్తించింది. 1981లో ప్రాంతీయ సహకారంకు పునాదివేసిన బాంగ్లాదేశ్ ప్రశంస నీయమైనది. దీనిస్థాపనలో 'కొత్త శకం' దక్షిణ ఆసియా ప్రాంతంలో నెలకొల్పబడిందని చెప్పవచ్చును. ఈప్రాంతీయ సంఘం సామర్థ్యం సభ్యదేశాల మధ్య అవగాహన. ఆచణమీదుంటుంది. తమ సమస్యను పరిష్కరించు కొనడం ద్వారా ఈ ప్రాంతంలో శాంతి పటిష్టత నెలకొల్పబడతాయని ఆశించడం దీనిపై బాంగ్లాదేశ్, శ్రీలంక, పాకిస్తాన్, నేపాల్ వారి వారి పత్రికలు వివిధరకాలుగా శ్లాఘించాయి.

ఈ ప్రాంతం వెలుపలను . కొన్నిదేశాలు ఆకాంక్షతో సార్క్ విజయాలు సాధించాలని పేర్కొన్నాయి. ముఖ్యంగా చైనా, అమెరికా, జపాన్, దక్షిణ ఆసియా ప్రాంతీయ సంఘం ఏర్పాటును ఆహ్వానించాయి. ఐకరాజ్య సమితి సెక్రటరీ జనరల్ సార్క్ ప్రతి విషయంలో ఫలవంతమవ్వాలని సందేశాన్ని పంపారు. అదేరీతిలో ప్రాంతీ సంఘాన్ని ఏర్పరచాలని సూచించిన దేశంలో నే మొదటి శిఖరాగ్ర సమవేశం ఏర్పాటు చేయుట శోచనీయమైన అంశం.

## సార్క్ రెండవ శిఖరాగ్ర మహాసభ-బెంగుళూర్ (భారత) నవంబర్ 15-16-1980

భారత దేశంలో అతి సుందర నగరం బెంగుళూర్‌లో ఏర్పాటు చేయబడిన సమావేశం ముఖ్యమైనది. ప్రాంతీయ సమస్యలతో పాటు ద్వైపాక్షిక అంశాలు పరిశీలించుటకు ఈ దేశాలు ముందుకు రావడం చెప్పుకోదగిన అంశం. ఈ సమావేశానంతరం భారత ప్రధాని రాజీవ్‌గాంధీ పార్లమెంటులో మాట్లాడుతూ దక్షిణ ఆసియా దేశాల ప్రజల మధ్య సత్సంబంధాలు అభివృద్ధికి పాటుపడడం సార్క్ లక్ష్యం అని చెప్పారు. ఈ సమావేశంలో మొదటి సార్క్ లక్ష్యాలకు మరో కొన్ని చేర్చడం జరిగింది అవి మహిళల ఔషదాల వాణిజ్యంలో చీకటి వ్యాపారంను అరికట్టడం. అదేవిధంగా అంతర్జాతీయ ఆర్థిక విషయాలలో కూడ ఉమ్మడి నిర్ణయాలు తీసుకోవాలని సమావేశంలో నిర్ణయించారు. ఢాకా సమావేశంలో టెర్రరిజమ్ ప్రధాన సమస్యగా ప్రాధాన్యత వహించింది. అయితే బెంగుళూరు సమావేశం ఆర్థిక విషయాలలో ప్రాధాన్యత వహించి టెర్రరిజమ్ సమస్య అడుగున పడిపోయింది. ఈ సమావేశంలో తీసుకొన్న మరొక నిర్ణయం పిల్లల సంక్షేమ విషయంలో పరస్పర సహకారం అందించుకోవడం. సాదరణంగా వస్తూవుండే అంటువ్యాధులు, ప్రాథమిక విద్య, పిల్లల తల్లులకు సంబంధించిన విషయాలు పిల్లలకు పౌష్టికాహారం అందించడం రెండు వేల సంవత్సరాల నాటికి అందరికి గృహవసతి కల్ప వంటి విషయాలలో అంతర్జాతీయ లక్షసాధనకు కృషిచేయాలని బెంగుళూరులో సమావేశం నిర్ణయించినది. ఈ విషయంపై సావత్సరిక నివేదికలు అందజేయడము అమలు జరుగుతున్న కార్యక్రమాలను తమ తమ అనుభవాలను సార్క్ దేశాలకు వివరించడం వంటి చర్యలు తీసుకొనవలసినదిగా విదేశాంగ కార్యదర్శుల స్టాండింగ్ కమిటీ సూచించడం జరిగింది

ఇంకా దక్షిణ ఆసియా దేశాలమధ్య రేడియో, టెలివిజను కార్యక్రమాల ప్రసారం, టూరిజం అభివృద్ధి, యాత్రికుల సౌకర్యాలు అభివృద్దిపరచడంపై సహకారాన్ని పెంపొందించుకోవాలనికూడ సార్క్ సమావేశం నిర్ణయించింది. శాస్త్ర, సాంకేతికరంగాలలో సాధిస్తున్న ప్రగతి, పరిశోధనలలో కనుగొన్న నూతన విషయాలను ఒకరినొకరు తెలియజేసుకొనటానికి వీలుగా సార్క్ డాక్యుమెంటేషన్ సెంటర్ ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. ఒకదేశం విద్యా విద్యావేత్తలును మరొక దేశం పంపి అక్కడ కొన్ని కార్యక్రమాలు నిర్వహించడం, సార్క్ ఉపకార

చేతాలు మొదలైన ఏర్పాటుచేయడం, వ్యవసాయం, అడవులువంటి శాఖలలో ఒక దేశంలోని వారు మరొకదేశంలో సేవలు నిర్వహించడానికి వీలుగా యువకులు మంచి స్వచ్ఛంద సేవాదళాలను తయారుచేయడంవంటి వాటిపై నిర్ణయాలు గైకొన్నారు. భారతదేశం ప్రతిపాదించిన వాణిజ్యం, వ్యాపారం, పరిశ్రమల హావాదేవీలా విషయాలలో సుముఖత లభించింది.

సార్క్ దేశాల వివిధ కార్యకలాపాలను సమన్వయం చేయడానికి దక్షిణాసియాదేశాల శాశ్వత సెక్రటేరియట్‌ను స్థాపించాలని అది నేపాల్ రాజధాని ఖట్మాండులో ఏర్పాటుచేయడానికి నిశ్చయించింది. అనేక సమస్యలను సభ్యులు ప్రసంగాలలో లేవనెత్తినప్పటికి ప్రాంతీయ సమస్యలపైనే చర్చలు జరిగి, ద్వైపాక్షిక అంశాలను ప్రస్తావనకు వచ్చిన వాటిని దూరంగా ఉంచారు. ఏది ఏమైనా అనేక విషయాలపై ప్రస్తుతం దృష్టి సాధించిన సార్క్ సమావేశం భవిష్యత్తులో మంచి ఫలితాలను సాధించగలదని, అగ్రరాజ్యాల ఆయుధపోటీకి వేదికగా మారిన ఈ దేశాలు శాంతియుత పరిస్థితులలో సహజీవనం సాగించే స్థితి నెలకొనగలదని ఆశిద్దాం.

ఈ దక్షిణ ఆసియా సహకార సంఘంను ఏర్పాటుచేయడం కొందరి ద్వైపాక్షిక సమస్యలను పరిష్కరించుటకూడ అనుటలో సందేహం లేదు. ఇటీవల శ్రీలంక – భారత్‌లమధ్య తమిళుల సమస్యపై కుదిరిన ద్వైపాక్షిక ఒప్పందములలో సార్క్ ప్రతిష్ట నానాటికి పెరుగుతుంది. ఎట్టకేలకు ఈ ఏడు దక్షిణ ఆసియాదేశాలు భారత, బాంగ్లాదేశ్, భూటాన్, పాకిస్తాన్, నేపాల్ శ్రీలంక, మాల్దీవులు కలిసి తమ ప్రాంతీయ సమస్యలపై తీవ్రమైన దృష్టి కేంద్రీకరించి సంస్థాపరమైన పరిష్కారంను నెలకొల్పుటకు అంగీకరించబడినాయి. ఈ రెండు సమావేశాలులోనే సార్క్‌యొక్క పటిష్టతను పనితీరును నిర్ణయించడం అంత సబబు కాదు. ఇది ఐరోపా ఆర్థిక సంస్థ లేద తూర్పుదేశాల ఆర్థిక సంఘంలా పని చేయాలంటే కొంతకాలం పడుతుంది. సార్క్ దేశాలు ఎదుర్కొంటున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయ చాలెంజ్‌లు చాల జటిలమైనవి వాటిని అధిగమిస్తే సహకార సంస్థవిజయవంతమైనట్లే.

చివరిగా ఈ ప్రాంతీయ సహకార సంస్థ భారతదేశంపై పెద్ద బాధ్యతలనుంచాయి. ముఖ్యంగా ఇవి బహు ముఖ్యమైనవి. అవి దేశ దేశానికి ఒక తీరుగా వున్నాయి. ప్రాంతీయ సహకారమంతాకూడ ఎక్కువమంది కలిసి కొన్ని సూత్రా

లను ఆధారంగా సమిష్టి ప్రయోజనాన్ని నిర్ణయిస్తాయి. భారత్ కనుక ముందు కొచ్చి సాంకేతిక, ఆర్థిక అవసరాలను తీర్చునట్లయితే తప్పక ప్రయోజనం సాధించకలుగుతుంది. మనమందరం సార్క్ ముందు ముందు తమ ఆశయాలను ఫలవంతంగా సాధించకలుగుతుందని ఆశిద్దాం.

**సంప్రదించిన పుస్తకాలు :**


1. South Asian Regional Cooperation Progress of Prospects. Asian Survey (Berkley)
2. Indian Express (New Delhi) December 6, 1985
3. The Hindu (Madras) 8 December, 1985
4. Indian Express 16 December, 1986

# 17. 5వ సార్క్ సమావేశం : నూతన ప్రతిపాదనలు

ప్రపంచరాజ్యాలు నేడు పరస్పర సహకారంపై నడుచుచున్నవి. ముఖ్యంగా ఐక్యరాజ్యసమితి వివిధ దేశాలమధ్య సహకారాభివృద్ధికి కృషిచేస్తున్న వాటిమధ్య సామరస్యం కుదరకపోవడంతో ప్రాంతాలవారిగ ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, రాజకీయాభివృద్ధికి కృషి చేయడం జరుగుతుంది. ప్రాంతీయ సహకారానికి పని చేయుచున్న వ్యవస్థలలో దక్షిణ ఆసియా దేశాల ప్రాంతీయ సహకార సంఘం ఒకటి. ఇది 1984 తరువాత ఏర్పడింది. ఇవి ఇండియా, పాకిస్తాన్, బాంగ్లా దేశ్, నేపాల్, భూటాన్, శ్రీలంక, మాలె దీవులు. ఇటీవల ఈ దేశాలు మాల్దీవుల రాజదాని 'మావె'లో 1990 నవంబర్ 21-23 వరకు సమావేశమై కొన్ని నూతన ప్రతినలు సహకార రంగంలో చేపట్టినవి. ఈ సమావేశం ఇస్లామాబాద్ సమావేశానంతరం ఒక సంవత్సర వ్యవధి తరువాత జరిగింది. ఈ రెండు సమావేశాల మధ్యకాలంలో ఉపఖండంలో అనేక నూతన మార్పులు జరిగాయి.

ఆ మార్పులలో ఇండియా ప్రధాని సాధారణ ఎన్నికలలో ఓడిపోవడం నూతన ప్రభుత్వం ఏర్పడడం ఆ ప్రభుత్వంకూడ మధ్యంతరంగా పడిపోవడంతో క్రొత్త ప్రధాని పదవీ బాధ్యతలు స్వీకరించిన వెంటనే సార్క్ సమావేశంకు హాజరయ్యారు. అదే విధంగా పాకిస్తాన్ ప్రధాని శ్రీమతి భుట్టోని భర్తరఫ్ చేయడం సాధారణ ఎన్నికలనంతరం క్రొత్త ప్రధాని ఈ సమావేశాలకు హాజరయ్యారు. నేపాల్‌లో నూతన ప్రజాస్వామ్యం ఏర్పడడం, ద్వీపకల్పదేశం శ్రీలంకలో భాగోశిక తిరుగుబాటు, భూటాన్‌లో సిగ్మేసింగ్ వాంగ్‌ఛుక్ వారసత్వాధికారంకు వ్యతిరేకత, బాంగ్లాదేశ్ అర్థసైనిక పాలనకు వ్యతిరేకంగా ఉద్యమాలు మొదలైన సమస్యల మధ్య మూడు రోజుల ఆలస్యంగా ప్రారంభమైంది. ఈ ఐదవ సార్క్ సమావేశంలో పాకిస్తాన్ ప్రతినిధి శ్రీ నవాబ్ షరీఫ్, నేపాల్‌నుండి శ్రీ కె. పి బట్టారాయ్ ఇండియా ప్రధాని శ్రీ చంద్రశేఖర్, బంగ్లాదేశ్ అధ్యక్షుడు శ్రీ మహ్మద్ ఎర్షాద్ భూటాన్ రాజు జిగ్మేసింగ్ వాంగ్ ఛుక్, సమావేశంను నిర్వహించిన దేశం మాల్దీవుల అధ్యక్షుడు మౌమాకు అబ్దుల్ గయూమ్‌లు హాజరయినారు. సార్క్ లక్ష్యాలు పరస్పరభేదాలు మూలంగా ఈ అర్థ దశాబ్దంతో సరియైన ఫలితాలు సాధించలేదని

చెప్పవచ్చును. సార్క్ లక్ష్యాలు, వాటి నెరవేర్పు, మాలె సమావేశంలో నూతన అంశాలలో పరస్పరంగీకారం, ఎందుకు సార్క్ దేశాలమధ్య సహకారంలో పటిష్ఠత ఏర్పడకపోవడానికి దోహదపడే అంశాలు పరిశీలన ఈ వ్యాసంయొక్క ముఖ్యోద్దేశ్యం.

## సార్క్ లక్ష్యాలు :

సార్క్ యొక్క మొదటి సమావేశంనుండి నేటివరకు అనేక రంగాలలో పరస్పర సహకారంకు కృషిచేయడం జరిగింది. ముఖ్యంగా సార్క్ దేశాలమధ్య పరస్పర వైషమ్యాలు భేదాలు వదలి ఉపఖండ దేశాలమధ్య వివిధ రంగాలలో సహకారం పెంపొందించుకోవడం. సార్క్ ప్రాథమిక లక్ష్యాలు 1) ఈ ప్రాంత దేశాల సాంఘిక, ఆర్థికాభివృద్ధికి వీరి పరిధిలోనున్న సహజ వనరులను సాధ్యమైనంత ఎక్కువగా ఉపయోగంలోకి తెచ్చుట 2) సభ్యదేశా సంయుక్త సమస్యలపై ప్రాంతీయ ప్రాతిపదికపై కలిసిగట్టుగ పరిష్కారమార్గంను కనుగొనుట-సమస్యల పరిష్కారం మిత్రుత్వం, నమ్మకం, ఒకరి నొకరు అర్థంచేసుకోవడంపై ఆధారపడి ఉంటాయి. 3) సభ్య దేశాలమధ్య సక్రమస్థితి ఏర్పరచడం పరస్పర మర్యాద, సమభావం, ఫలితాలను పంచుకోవడం. 4) ఈ సభ్య దేశాలమధ్య ద్వైపాక్షిక రాజకీయ సమస్యలను ప్రక్కకునెట్టి, పరస్పర నమ్మకంపై సాంఘిక-ఆర్థిక సమస్యలను ప్రాంతీయంగా కుదుర్చుకొని నిజమైన ప్రాంతీయ సహకార సంఘంగా నిరూపించుకొనుట. 5) ఇతర ప్రాంతీయదేశాలుకూడ తమ సమ్మస్యల పరిష్కారంకు ఈ దేశాలతో కలిసికట్టుగా కృషి చేయడం.

గత అయిదు సంవత్సరాలలో తమ విధానం నుపయోగించి ఈ ప్రాంత సమస్యలను గుర్తించి పరిష్కరించవలసిన అంశాలుగా పొందుపరచబడ్డాయి. ఉదా: సార్క్ ఆధ్వర్యంలో ఈ ప్రాంతంలో మత్తు మందుల వాడకం, వ్యాపారంను అరికట్టడం, ఈ అంశంపై ఎంతవరకు ఫలితాలు సాధించారు అనేది చెప్పడం కష్టం.

సార్క్ దేశాల సమగ్ర కార్యక్రమాలు పిల్లల ఆరోగ్య పరిరక్షణ, విద్యా, నివాసం, మత్తుమందుల వాడకం నిరోధం అమ్మకాలను ఆపడం, ఈ ప్రాంతంలో ఉగ్రవాదంను మరియు అనేక వాతావరణ కలుషిత అంశాలను అరికట్టడం. ఈ

దేశాలమధ్య టూరిజంను వృద్ధి చేయుట, వ్యాపార వాణిజ్య సంబంధాల పెంపుదల మొదలైనవి.

ఈ ప్రాంత దేశాల మధ్య ఎందుకు సామరస్యం కుదరుట లేదంటే 'రాజకీయ ఐచ్ఛికం' లోపించటమేనని చెప్పక తప్పదు. ఈ ప్రాంతదేశాలలో రాజకీయమైన అనుకూల వాతావరణం ఏర్పడినంత కాలం వీటిమధ్య సమస్యల పరిష్కారంకు సెమినార్లు, వర్క్‌షాపులు నిర్వహించినంత మాత్రాన వాటంతట అవే సమసిపోవు. ఆ సమస్యల పరిష్కారంకు సరియైన యంత్రాంగమును ఎంచుకోవలసిన ఆవశ్యకత ఎంతైన ఉంది.

## సార్క్ - మానవ హక్కులు :

ఈ దేశాలలో మత, భౌగోళికమైన మైనారిటీలు చాల ఎక్కువగా వున్నారు. వీరు ప్రతి సభ్యదేశంలో చాల సమస్యగా పరిణమించినారు. హిందువులు, క్రైస్తవులు, అహమద్స్ పాకిస్తాన్ మైనారిటీలు. ఇండియాలో ముస్లింలు, క్రైస్తవులు, సిక్కులు, బౌద్ధులు, బాంగ్లాదేశ్‌లో బిహారీ ముస్లింలు, హిందువులు మైనారిటీలు-ప్రతి దేశంను మైనారిటీలపై అధికారం ఉందని ప్రకటించాయి. అదే శ్రీలంకలో తమిళులు, నేపాల్‌లో హిందువులు కానివారు ఆయాదేశాల ఐక్యత, సామరస్యంకు గొడ్డలి పెట్టుగా తయారయ్యారు. ఈ దేశాలు తమ దేశంలో అల్లర్లు జరిగినపుడు ఒకరినొకరు విమర్శించు కొనడం కద్దూ.

అదే విధంగా ఒక దేశంలో మైనారిటీలపై అత్యాచారాలు జరుగుచున్నాయని ఆరోపణలు ప్రత్యారోపణలు చేస్తుంటారు. అంతేకాక చాల సమయాలలో హత్యలు, దోపిడీలు వలన ప్రజలు అనేక ఇబ్బందులకు గురి అగుచున్నారు. ముఖ్యంగా ఈ విషయాలపై ఒకరినొకరు మైనారిటీల విషయంలో నిందలకు బదులు నిజమైన పరిష్కారంకు చిత్తశుద్ధితో కృషిచేయడం ద్వారా ఆయా దేశాలలో మానవ హక్కుల పరిరక్షించినట్లవుతుంది.

## సార్క్ - సాంఘిక సమస్యలు :

సార్క్ దేశాలు ఒకే ప్రాంతీయతను కలిగి ఉండుటయేకాక భాష, మత, సంస్కృతికంగా దగ్గర సంబంధాలను కలిగినాయి. భారతదేశం అన్ని మతాలకు పుట్టినిల్లు కాక ప్రపంచ పురాత సంస్కృతులలో ఇట్లాంటి ఎన్ని విభేదాలు వచ్చిన

నేటికి తను సంస్కృతిని కొనసాగించుకొంటు వస్తుంది. ఎప్పుడైతే మత, భాష పర మైన భేదాలు వస్తే వెంటనే ఈ ప్రాంత దేశాలు అలజడులు జరగడం కద్దూ. కనుక ఈ దేశాలన్ని కలిసి కట్టుగ తమ యొక్క సాంఘిక సమస్యలను సరి చేసు కొనవలసిన అవశ్యకత ఎంతైన ఉంది.

చిరకాలం నుండి మతం ఐక్యతను వృద్ధి పొందించేదిగా కొనసాగుతుంది. కాని అధునిక కాలంలో ప్రతి వ్యక్తి, దేశ ప్రయోజనాలను కాపాడు కోవాలంటే మతంను అడ్డు పెట్టుకోవడం జరుగుతుంది. ఇండియాలో కాశ్మీరు సమస్య, బాంగ్లా దేశ్, చక్మాలు పాకిస్తాన్‌లు అఫ్ఘన్స్ మొదలైన సమస్యలు మతంతో ముడిపడి ఉన్నాయి కనుక వీటిని సంభాషణల ద్వారా పరిష్కరించుకొనవలసిందే తప్ప ఘర్షణలు, ఆరోపణలకు దిగితే మొత్తం ప్రాంతీయంగా అలజడులు ఏర్పడతాయి కనుక సమిష్టిగా పరిష్కరించవలెను.

## సార్క్ - ఆర్థిక ఐక్యత :

సార్క్ దేశాలు భిన్న ఆర్థిక వ్యవస్థలను కలిగి ఉంది. ముఖ్యంగా ఈ దేశాలు స్వాతంత్ర్యనంతరం పట్టించు కున్నట్టు కనిపించదు. పేదరికం అనేది రోజురోజుకు పెరుగుతుంది. దక్షిణాసియాలో దేశాలు ఎక్కువ జనాభా, నిరాక్ష రాస్యతతో చాల వెనుకబడి ఉన్నాయి. ప్రపంచ జనాభాలో ఒక బిలియన్ ఎక్కువమంది పేదవారు ఈ ప్రాంతంలోనే జీవనం సాగిస్తున్నారు. ఈ దేశాల మధ్య ఎన్నో రాజకీయ ప్రయోజనాలున్నాయి కాబట్టి ఏ దేశం కూడా పేదరికం నిర్మూలనకు సరియైన పథకాలు చేపట్టడం లేదు. చేపట్టిన రాజకీయమైన ఐచ్ఛికం లోపించడంతో సరిగ్గా అమలు చేయబడడంలేదు.

ఈ దేశాల మధ్య ఎన్నో ద్వైపాక్షిక భేదాలున్నా వీరు వాణిజ్యం, పరి శ్రమలు అభివృద్ధికి కృషిచేయాలని సార్క్ విదేశాంగ మంత్రుల సమావేశం నిర్ణ యించింది. ఇండియా విదేశాంగ మంత్రి మాట్లాడుతూ సార్క్ స్వయ ప్రతి పత్తి సాధించాలంటే ప్రాథమిక ఆర్థిక సహకారం సమగ్ర ప్రాతిపదికంగా పెంపొందు న్నారు. కాని ఇది సాధ్యపడడంలేదు. ఎందువలననంటే ఈ దేశాల మధ్య శాంతి నెలకొనాలి కాని ఎప్పుడు దక్షిణాసియా ప్రాంతంలో ఉద్రిక్తత వాతావరణం నెల కొనడం, ఒకరినొకరు నమ్మకపోవడంతో ఆర్థిక సహకారంను సాధించుకోలేక

పోతున్నారు. అంతేకాక సాంకేతిక, పర్యటన రంగాలలో సహకారం పెంపొందించు కోవాలని నిర్ణయించాయి.

ఈ దేశాలకు సరియైన రాజకీయమార్గం దృఢ నిశ్చయత అవసరం. సభ్య దేశాలు తమ ఆర్థిక స్థితిని సమగ్ర రూపంగా పరిశీలించి డబ్బు ఆర్థికస్థితి మెరుగు పరచుట, అప్పుల సమస్యను సమిష్టిగా పరిష్కరించుకోవాలని నిర్ణయించడం హర్షించ దగ్గది. దక్షిణ-ఉత్తర సంభాషణలు జరిపి తమ పరిస్థితి మెరుగుపరచు కొనుటకు ప్రయత్నించాలి. దక్షిణ-దక్షిణ దేశాలమధ్య సహకారం పెంపొందించు కొనవలయును. ముఖ్యంగా అయితే ధరల పెరుగుదల వలన ఏర్పడిన లోటును పరస్పర సహకారం ద్వార సరిదిద్దు కొనవలయునని నిశ్చయించటం హర్షించదగ్గది. ఈ సందర్భంగా భారత ప్రధాని శ్రీ చంద్రశేఖర్ మాట్లాడుతూ నిజమైన సహ కారం పెంపొందించుకోవాలంటే వస్తూ-సేవాల ఉత్పత్తి రంగంలో ముఖ్యంగా వ్యాపారం, ఇంధనం శక్తి రంగాలలో ఈ దక్షిణాసియా దేశాల మధ్య సహకారం పెంపొందాలని పేర్కొన్నారు.

## సార్క్ - వ్యాపార రంగం :

దక్షిణాసియా దేశాలలో సుమారు 1·1 మిలియన్ల జనాభా, ప్రపంచంలో 1/5 వంతు జనాభా ఈ ప్రాంతంలో నివసిస్తున్నారు. కాని ఈ దేశాలలో ప్రపంచ వ్యాపారంలో 1% కూడ జరుగుటలేదు. ఈ దేశాల ఎగుమతులు కేవలం 0.8% మాత్రమే. ఈ దక్షిణాసియా దేశాల్లో ప్రపంచ దేశాల వ్యాపారం తగ్గిపోతుంది. సార్క్ దేశాలు గ్లోబల్ వ్యాపారం 1980 నుండి 1987 మధ్య కాలంలో 4.94% నుండి 2.98% ఎగుమతులు పడిపోయాయి. దిగుమతులు ఇదేకాలంలో 2.29% నుండి 1·39% దిగజారాయి. దీనికి చాల కారణాలున్నాయి. అందులో ఒకటి రాజ కీయ అస్థిరత్వంతో పాటు ఆయుధ రంగంలో ఎక్కువ పెట్టుబడులు పెడడంతో, ఈ స్థితి ఏర్పడిందని చెప్పవచ్చును.

ఈ దేశాలలో ప్రపంచ దేశాలలో కంటే ఎక్కువగా ట్రెయినింగ్ పొందిన మానవ వనరులున్నాయి. కాని వున్న వనరులను సరియైన రీతిల్లో వినియోగంలోకి పెట్టకపోవడం. ఈ దేశాలు ఐరోపా ఆర్థిక వ్యవస్థ చేపట్టిన సభ్యదేశాల మధ్య స్వేచ్ఛా వ్యాపారం కొనసాగడం చేసినట్లైతే సరియైన ఫలితాలను పొందవచ్చును. అంతేకాక సార్క్ దేశాలు తూర్పు, దక్షిణాసియాల సంఘం తీసుకొన్న ప్రాంతీయ

సహకార ప్రాతిపదికంగా ఆర్థిక రంగంలో తీసుకొనవలసుంటుంది. అదే సార్క్ దేశాలు తమ మాలె ప్రకటనలో సమగ్ర ఆర్థిక జాతీయ విధానాలను అవలంబించి ప్రపంచ వ్యవస్థతో పోటీగా తమ ఆర్థిక వ్యవస్థలను నడిపించుకోవాలని పేర్కొన్నారు.

## సార్క్ - రక్షణ వ్యవహారాలు :

ప్రతి దేశంకు రక్షణ అత్యంత ఆవశ్యకత ఎంత పేద దేశమైన రక్షణకు ముందు, తరువాత అభివృద్ధిని గూర్చి ఆలోచిస్తాయి. దక్షణ దేశాలు ఇంకా వారి యొక్క రక్షణపై ఖర్చుపెట్టవలసిన దానికంటే ఎక్కువగా ఖర్చుపెట్టుచున్నాయి. ఈ దేశాల రక్షణ వ్యయం ఇండియా 18.4 శాతం, పాకిస్తాన్ 33.2 శాతము' బంగ్లాదేశ్ 11.2 శాతము, నేపాల్ 6.2 శాతము, శ్రీలంక 8 శాతము, తమ బడ్జెట్ మొత్తంలో ఖర్చుపెట్టుచున్నాయి. మాల్దీవులు రెండు సంవత్సరాల నుండి తమ రక్షణ వ్యయం ఎక్కువ చేసింది.

సార్క్ సమావేశంకు ముందు ప్రకటించిన రక్షణ వ్యయం 1986 లెక్క ప్రకారం యీ దేశాలు మొత్తం 11,090.6 బిలియన్లు డాలర్లు. వీరి అప్పుల్లో 1/5 వంతు రక్షణ వ్యయంగా ఖర్చుపెట్టు చున్నాయి. ఈ ప్రాంతంతో రక్షణ వ్యయం అన్ని ప్రాంతాలలో కంటే ఎక్కువగా ఖర్చుపెట్టు చున్నాయి. ఈ ప్రాంతంలో 1973 నుండి 5.3 శాతము రక్షణ వ్యయంగా ఖర్చుపెట్టు చున్నాయి. 1983 నుండి వీరు మూడవ ప్రపంచ దేశాల కంటే అధికంగా ఖర్చుపెట్టుచున్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలు 2.1 శాతం మొత్తం ప్రపంచ దేశాలు 3.8 శాతము తమ బడ్జెట్ మొత్తంలో ఖర్చు పెడుతుంటే దక్షిణాసియా దేశాలు మాత్రం 9.5 శాతం తమ బడ్జెట్‌లో నుండి ఖర్చు చేస్తున్నాయి. యింకా 1990 లలో ఇండియా-పాకిస్తాన్ దేశాలు అణుశక్తి దేశాలుగా కాబోతున్నాయి. 1988 లో ఇండియా-పాకిస్తాన్ ప్రధానులు ఒకరిపై నొకరు వారి అణుయింధన కేంద్రాలపై దురాక్రమణ జరుపకుండా ఒప్పందం కుదుర్చుకొన్నాయి. ఇది సార్క్ ఒప్పందం వెలుపల కనుక మిగతా దేశాలు కూడ తమ రక్షణపై ఖర్చు తగ్గించు కొన్నాయి. ఈ దేశాలలో పరస్పర సహకారం పెంపొందుట వలన రక్షణ వ్యయం తగ్గి అభివృద్ధి కార్యక్రమాలపై మళ్ళించుటకు ఆస్కారం కలదు.

## సార్క్ - నూతన ప్రతిపాదనలు :

దక్షిణాసియా దేశాల ప్రాంతీయ సహకారం సమిష్టిగా ఆర్థిక రంగంలో సహకారం - చిన్న కుటీర పరిశ్రమల రంగంలో సహకారం పెంపొందాలని ప్రాంతీయ పంట్‌ను ఏర్పరచాలని నిర్ణయించాయి.

అభివృద్ధి చెందుతున్న దేశాలు గ్రూప్-5 ననుసరించి జీన్ బ్యాంక్‌ను ఖాట్మాండ్‌లో ఏర్పరచాలని. బయో టెక్నాలజీ రంగంలో దీర్ఘకాలిక ప్రాతిపదికపై ఆహార సంరక్ష, మందుల వాడకంలో సహకారం పెంపొందించాలని ప్రతిపాదించాయి. అంతేకాక ,జీన్ స్పెషలిస్టులను మార్పిడి, వ్యవసాయ రంగంలో పెంపొందించాయి.

ఢిల్లీలో ప్రాంతీయ డాక్యుమెంటెషన్ సెంటర్‌ను నిర్మించాలని నిర్ణయించాయి. 1990 సార్క్ గరల్ చైల్డ్‌గా గుర్తించాయి. అదే రీతిలో 1990-2000 సార్క్ గరల్ దశాబ్దంగా కొనసాగించాలని అనేక చర్యలు తీసుకొనడానికి నిర్ణయించాయి. అంతేకాక మహిళల యొక్క హోదాను, వారి స్థానం సంఘంలో పెంపొందించాలని పేర్కొన్నాయి. ఈ ఏడు దేశాలు మత్తు మందు వాడకంను, వ్యాపారంను పటిష్టంగా అరికట్టవలెనని నిర్ణయించి ఒక ఒప్పందంపై విదేశాంగ మంత్రులు సంతకాలు చేశాయి. అదే విధంగా దక్షిణాసియా ప్రాంతంలో పరిసరాల కలుషితంను అరికట్టాలని నిర్ణయించాయి. పర్యటన రంగంలో అనేక చర్యలు తీసుకొన్నాయి. ముఖ్యంగా న్యాయమూర్తులు, పార్లమెంట్ సభ్యులు, మొదలగువారు ఆయా దేశాలు వీసా పర్మిట్ లేకుండ ప్రయాణం చేయాలని నిర్ణయించాయి. శాంతిని నెలకొల్పి ఈ ప్రాంతంలో అభివృద్ధికి అనేక చర్యలు తీసుకొనడానికి నిశ్చయించాయి. వ్యాపార రంగంలోకూడ అనేక చర్యలు తీసుకొనడానికి నిశ్చయించాయి.

సార్క్ తన ఆరు సంవత్సరాల కాలంలో దక్షిణాసియా సంస్థగా తీర్చి దిద్దుకొనలేదు. ఈ కాలంలో సార్క్‌కు సరియైన మార్గంను కనుగొనలేకపోయారు. మొదటి నుండి సార్క్ సంయుక్తదృష్టి లోపించింది. గత రెండు సంవత్సరాల నుండి కదలికలేని నీరులా వుండిపోయింది. అన్ని ప్రాంత దేశాలు తమ ప్రాంతీయ వాదంను బలపరచు కుంటుంది. పశ్చిమ ఐరోపా దేశాలు ఒకే యూనిట్‌గా 1991 ఏర్పడబోవుచున్నాయి. మిగతా ఐరోపా దేశాలు ఐరోపా సంస్థలతో ముడిపెట్టు

కొంటున్నాయి. ఉత్తర అమెరికా దేశాలు కూడ అమెరికా, కెనడాలతో కలిసి ప్రాంతీయ రక్షణకు కృషి చేస్తున్నాయి. మెక్సికో, బ్రెజిల్, అర్జెంటైనా, లాటిన్, అమెరికా దేశాలు కూడ సహకారం పెంపొందించు కుంటున్నాయి. అదే విధంగా ఆసియా పసిఫిక్ దేశాలు జపాన్, ఆస్ట్రేలియా - దక్షిణ కొరియాలు ప్రాంతీయ సహకారంకు కృషి చేయుచున్నాయి. కాని యింకా ఈ సార్క్ దేశాలు తమ ప్రాంతీయ సహకారంకు కృషి చేయుటలేదు. ఈ దేశాలు భౌగోళిక రాజ్య పరిధిని పట్టుకొని ప్రేలాడుచున్నాయి. ఒకదాని కొకటి పరస్పర అపనమ్మకంను కూడ గట్టుకొని ప్రాంతీయ సహకారంకు కృషి చేయడంలో చాలా వెనుకబడి వున్నాయి. పాకిస్తాన్-ఇండియా వారి ఐక్యతకు భంగం కలిగిస్తుందను కోవడం, పాకిస్తాన్ కాశ్మీరు మాది అనడం వారిని రెచ్చకొట్టడంతో యిది ప్రాంతీయ సహకారంలో ముందంజ వేయలేక పోతున్నాయి.

ప్రతి సమావేశంలోను పరస్పర సమస్యల వలన ప్రాంతీయ సహకారం కుంటుపడుచున్నది. ప్రతి సంవత్సరం చర్చలకు సార్క్ సమావేశం పనికి వస్తుందే కాని సహకారం పెంపొందడంలేదు.

అబ్దుల్ గయూమ్ 5వ సార్క్ అధ్యక్షుడు మాట్లాడుతూ దక్షిణాసియా దేశాల ప్రాంతీయ సహకారం సమావేశంలో అన్ని అంశాలలో 'గట్టి అవగాహన' ఏర్పడిందన్నారు. ఈ సమావేశాలలో తమ లక్ష్యాలను నెరవేర్చుటకు పటిష్టంగా పని చేయాలని నిర్ణయించాయి.

# 18. ఇండియా - రష్యా సంబంధాలు

భారత-రష్యా సంబంధాలు చారిత్రక ప్రాధాన్యతను సంతరించుకొన్నాయి. గత 40 సంవత్సరాలుగా ఇండియా-రష్యా చాలా దగ్గర ఆర్థిక, వాణిజ్య, వ్యాపార సంబంధాలున్నాయి. అంతేకాక మన స్వాతంత్ర్యోద్యమం ఆ నాడు 1917లో రష్యా విప్లవం వలన ప్రభావితం అయింది. భారత స్వాతంత్ర్యోద్యమం జరుగుతున్నప్పుడు రష్యా నాయకులు మనకు నైతికంగా మద్దత్తు నిచ్చారు. అదే 1927లో రష్యా విప్లవం దశమ వార్షికోత్సవమునకు మోతీలాల్ నెహ్రూ, నెహ్రూలు ఆహ్వానించబడ్డారు. అప్పట్లో భారత కాంగ్రెసు నాయకత్వంలో చురుకుగా పాల్గొంటున్న నెహ్రూను రష్యాలోని జాతి పీడనలేని వ్యవస్థ సోషలిజం ఎంతో ప్రభావితం చేశాయి. అట్లా ఆనాటి కమ్యూనిజం తోను రష్యా నాయకత్వంతో సంబంధాలున్నా వారు శ్రీ యం. ఎస్. రాయ్, శ్రీ రవీంద్రనాథ్ టాగూర్, శ్రీ బి. కె. కృష్ణ మీనన్ మొదలయినవారు రష్యాయొక్క పద్ధతులకు ప్రభావితులైనారు. అంతేకాక రష్యా కమ్యూనిస్టు ప్రభుత్వం తనకంటూ ప్రత్యేకతను ఏర్పరచుకొని ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాలకు మద్దత్తు నియ్యటమేగాకుండా ఎక్కడయితే జాతి విముక్తి పోరాటాలు జరుగుతున్నాయో వాటికి మద్దత్తును ప్రకటించింది. అదే విధంగా సామ్రాజ్య వాదానికి, పెట్టుబడిదారీ పెత్తందారీ విధానాన్ని ఎదుర్కొనవలయునని గట్టిగా నిర్ణయించుకొంది. అట్లాంటి వ్యవస్థతో కొనసాగడం వలన ఇండియా స్వాతంత్ర్యానికి పోరాడుతున్న రోజుల్లోనే ఇండియా-రష్యా సంబంధాలు ఏర్పడడానికి బీజాలు నాటుకొన్నాయి. స్టాలిన్ నెహ్రూను బ్రిటీషు సామ్రాజ్య వాదంకు ప్రతినిధిగా పేర్కొన్నారు. కాని నెహ్రూ మాత్రం 1947 స్వాతంత్ర్యానంతరం రష్యాతో మంచి సంబంధాలు ఏర్పరచుకొనుటకు కృషిచేశారు. అందుకే రష్యా రాయబారిగా శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ, చెల్లాయి శ్రీమతి విజయలక్ష్మిపండిట్‌ను నియమించడం జరిగింది. స్టాలిన్ చివరి రోజులలో ఇండియా-చైనాతో సంబంధాలకోసం చూచింది. కాని తరువాత భారత ప్రభుత్వం దృష్టిని మార్చుకొంది. ఆ తరుత డాక్టరు S. రాధాకృష్ణన్‌ను, తదానంతరం శ్రీ కె.పి.ఎస్ మీనన్ రష్యా రాయబారులుగా నియమించారు. రష్యా-ఇండియాల మధ్య సంబంధాలలో ఎట్లాంటి

ముఖ్యమైన మార్పులు రాకముందే శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ మరణించటం జరిగింది.

అసలు ఇండియా-రష్యా మధ్య నిర్దుష్ట సంబంధాలు కేవలం కృశ్చేవ్ అధ్యక్షుడు అయ్యాకనే ప్రారంభమయ్యాయి. శ్రీ కృశ్చేవ్ ఇండియా అవలంభించిన తటస్థ విధానమును, ఆసియావాదమును ప్రశంసించారు. కాని ఆయన ఇండియాతో సంబంధాల వలన ఆసియాలో ఒక పెద్ద దేశం తన విధానాలను సమర్ధించుతోందని ప్రకటించారు. 1956లో 20వ కమ్యూనిస్టు కాంగ్రెసు అనంతరం కమ్యూనిస్టులలో సంప్రదాయవాదులు పెట్టుబడిదారీ విధానానికి సోషలిజమ్‌ల మధ్య తప్పనిసరిగా యుద్ధం తప్పదని నమ్మారు. కృశ్చేవ్ మాత్రం సోషలిజమ్-పెట్టుబడిదారుల మధ్య హింస సంబంధాలతోనేగాక పార్లమెంటరీ ప్రభుత్వ వ్యవస్థతో మార్పు వచ్చునని అన్నారు. అణు యుద్ధమే వస్తే ఈ రెండింటిని తుడిచి పెడుతుందని మెలక్‌నోవ్ అన్నారు. కృశ్చేవ్ అవలంభించిన విధానంను రివిజనిజమ్ అన్నారు. కృశ్చేవ్ అప్పుడు ఇండియా శాంతియుత సహజీవన విధానమును, మూడవ ప్రపంచ దేశాలకు మద్దతు నిస్తున్నట్లు ప్రకటించారు.

నెహ్రూ ఈ శాంతియుత సహజీవనం వలన ప్రభావితం అయి అదే ఒక సిద్ధాంతంగా తన విదేశాంగ విధానంలో పేర్కొన్నారు. దానితో రష్యా నాయకులు ఇండియాను పదింతలుగా పొగడడం జరిగింది. అంతకు ముందే 1948లో ఐక్యరాజ్య సమితిలో కాశ్మీరు సమస్యను లేవనెత్తినప్పుడు రష్యా ఇండియాకు మద్దతు ప్రకటించింది. అదే విధంగా 1950 కొరియా యుద్ధంలో ఇండియా స్వతంత్ర్య విధానంను ప్రకటించింది. అదే విధంగా ఉత్తరకొరియాకు చెందిన సేనలు యాలు నది ప్రాంతంలో ఐక్యరాజ్యసమితి సేనలు ప్రవేశించడానికి చైనా హెచ్చరించింది. దానికి వ్యతిరేకంగా చైనాను దురాక్రమణదారుడుగా ప్రకటించడానికి చేసిన ప్రయత్నాలను రష్యా-ఇండియాలు ఎదుర్కొన్నాయి. అమెరికాకు వ్యతిరేకంగా ప్రవర్తించాయి. అమెరికా పాకిస్తాన్‌కు సైనిక సహాయమును అందించడం జరిగింది. 1955లో నెహ్రూ రష్యా సందర్శించడం అదే సంవత్సరంలో రష్యా నాయకులు భారతదేశమును సందర్శించారు. అప్పుడు ఇండియా-రష్యాల మధ్య పంచశీల ఒప్పందం నెహ్రూ-బుల్గానిన్ ఒప్పందం కుదుర్చుకొన్నారు. అదే శాంతియుత సహజీవనం మీద నమ్మకంతో చేశారు.

1956-62 ఇండియా-రష్యా సంబంధాలలో దగ్గరిగా ఉన్నట్లు కనిపిస్తాయి. అదే సమయంలో అమెరికా-పాకిస్తాన్‌లు దగ్గరయ్యాయి. ఇండియా-రష్యాలు, గోవా, కాశ్మీరు సమస్యపై చాలా దగ్గరి సంబంధాలు ఏర్పరచు కున్నాయి. అయినా ఇండియాకు ఐక్యరాజ్య సమితిలో అమెరికా మద్దతు అవసరం కావాలి. కాని నెహ్రూ పాకిస్తాన్‌కు అగ్రరాజ్యం యొక్క మద్దతు ఉందని చెప్పుకొంటుంది. కనుక తాను సోవియట్ రష్యాకు దగ్గర చేరితే అగ్రరాజ్య మద్దతు ఉన్నట్లు అవుతుందని భావించాడు. ఎప్పుడైతే రష్యా-ఇండియాల మధ్య సంబంధాలు బాగా ఏర్పడ్డాయో అప్పటి నుండి కాశ్మీరు సమస్యపైనా ఇండో-పాకిస్తాన్ సరిహద్దు సమస్యపై రష్యా తటస్థ విధానంను అవలంభించడం జరిగింది.

భారతదేశం 1955 లో సోషలిస్టు సమాజం ఏర్పాటు చేయాలని తీర్మానించింది. అదే విధంగా కాశ్మీరు భారతదేశ భూభాగంలోని ఒక రాష్ట్రం అని గట్టిగా సమర్థించుకొంటుంది. 1956 లో అమెరికా బొకారో ఉక్కు కర్మాగారంకు సహాయం అందించటానికి నిరాకరించడంతో సోవియట్, రష్యా, బొకారోకు ఆర్థిక సహాయం చేసింది. ఇండియా రష్యాను ఈజిప్టుతో దగ్గర సంబంధాలు అంటే అధ్యక్షుడు టిటోతో ఏర్పరచుకోమని సలహా యిచ్చేంత దగ్గర సంబంధాలును ఏర్పరుచుకొన్నాయి. అట్లా ఇండో-రష్యా సంబంధాలును పెంచుకొంటుంటే చైనా-ఇండో సంబంధాలు వేడెక్కాయి. దానితో 1962 లో టిబెట్ సమస్యపై టిబెట్‌ను స్వాతంత్ర్యాన్ని ఇండియా సమర్థించగా ఇండియాపై 1962 లో దాడి చేసింది. అప్పట్లో చైనా-రష్యాల సంబంధాలు బాగావున్నాయి. ఇండియాను సమర్థించలేని స్థితిలో రష్యా పడింది. దానితో తటస్థ వైఖరి అవలంభించింది. ఇండియా-చైనాలతో రష్యా స్నేహ సంబంధాలను కలిగి ఉందని ప్రకటించింది.

1960 లో కృశ్చేవ్ ఇండియాను సందర్శించినపుడు ఇండో-సోవియట్ స్నేహ ఒప్పందంపై సంతకాలు చేశారు. వాటికి ఏ మాత్రం భంగం కలుగదని ప్రకటించింది. ఎప్పుడైతే చైనా ఇండియాపై 1962 దండయాత్ర చేసిందో అప్పుడే ఇండియావైపు తిరగాలి కాని కొన్ని అధర్మాలు ప్రాంతీయ రాజకీయాల వలన అట్లా చేయవలసి వచ్చింది. అయినా ఇండో-రష్యా సంబంధాలను మామూలుగానే కొనసాగించాయి.

అనేక విధాలుగా రష్యా ఇండియాకు అన్నిరంగాలలో మద్దత్తు నిచ్చింది. ఐక్యరాజ్య సమితిలో పూర్తిగా ఇండియాకు మద్దతు నిచ్చింది. 1971 లో ఇండియా-

పాకిస్తాన్ యుద్ధంలో రష్యా ఇండియాను సమర్థించింది. ఐక్యరాజ్య సమితిలో మాట్లాడుతూ రష్యా ప్రతినిధి పడ్గొర్నీ "పాకిస్తాన్ మిలటరీ దౌర్జన్యాన్ని సరిహద్దుల ప్రాంతాలలోది ఖండించాడు. అంతేగాక సోవియట్ రష్యా చాలా ఎక్కువగా భారత పబ్లిక్ రంగానికి ఆర్థిక సహాయాన్ని అందించింది. 1971 లో రష్యా తన దక్షిణ ఆసియా విధానాన్ని పునఃపరిశీలించింది. అప్పుడు 1971 లో ఇండియా-రష్యాలు 20 సంవత్సరాల శాంతి, స్నేహా, సహకార ఒప్పందంను చేసుకొన్నాయి. దీనితో రష్యా దక్షిణ ఆసియాలో హిందూ మహా సముద్రంలో తన సైన్యం నౌకలు ఉంచు కొనడానికి అంగీకరించింది. చైనాతో యుద్ధం చేయుటతో రష్యాతో ఇండియా బాగా దగ్గరైంది తనకు మార్కెట్లు ప్రయోజనాల చేకూర్చడానికి ఇండియాతో దగ్గరి సంబంధాలు అవసరం అయ్యాయి.

అదే విధంగా ఇండియా-బాంగ్లాదేశ్ యుద్ధంలో రష్యా ఇండియాకు సహాయం చేసింది. అమెరికా తన 7th ఫ్లీటును పాకిస్తానుకు మద్దతుగా పంపింది. అప్పట్లో రష్యాకు తొత్తుగా ఇండియా వ్యవహరిస్తుందని అనేక పశ్చిమ దేశాలు విమర్శిం చాయి. అయినా శ్రీమతి ఇందిరా గాంధీ నాయకత్వాన ఇండో-రష్యా సంబంధాలు బాగా వున్నాయి. అదే విధంగా బ్రెజ్‌నేవ్‌లో ఇండియా-రష్యా సంబంధాలు సాంకే తిక పరిజ్ఞానం పొందుటలోను రష్యా ఇండియా రక్షణ శాఖకు అనేక విధాలుగా సహాయ మందించింది.

గోర్బచేవ్-రాజీవ్‌గాంధీల మధ్య ఇంకా స్నేహ సంబంధాలు ఏర్పడ్డాయి. అనేక రంగాలలో ఒప్పందాలను పెంచుకొన్నాయి. స్నేహ, సహకార ఒప్పంద మును మరో పది సంవత్సరాలు పెంచుకొన్నాయి.

అదే విధంగా గోర్బచేవ్ స్వతంత్ర విధానాలు పెరస్ట్రోయికా, గ్లాస్‌నాస్ట్‌ల మూలంగా, అంతర్గతంగా ఆర్థిక విచ్ఛిన్నతి కారణంగా సోవియట్ రష్యా పతనం చెందింది. నేడు రష్యా ముక్కలుగా స్వతంత్ర దేశాలుగా విడిపోయి కామన్‌వెల్త్ ఆఫ్ సోవియట్ రష్యా అవతరించింది. 1991 లో దీనితో ఇండియాకు గొప్ప అండ పోయిందనే చెప్పాలి. ఇండియాలో వున్న రష్యా పెట్టుబడులు ఏ దేశానికి చెందాలి అనేది ప్రశ్నగా మిగిలిపోయింది. దానిపై చర్చలు జరుగుతున్నాయి.

సోవియట్ రష్యా పతనంతో ప్రచ్ఛన్న యుద్ధం అంతరించి, అమెరికా ఏకైక రాజ్యంగా అంతరించింది. ఈ అమెరికా తన ప్రభావంను ఏ విధంగా మలుచుతుంది. అనేదానికి ప్రపంచ దేశాల భవిష్యత్తుపై ఆధారపడి ఉంటుంది.

రష్యా విచ్ఛిన్నంతో ఇండియాకు అంతర్జాతీయ రంగంలో కొండంత అండ పోవడంకాదు. మొత్తం మూడవ ప్రపంచ దేశాలు అన్నియు ఆ రక్షణను ఎదుర్కొంటున్నాయి. 1990 లో గల్ఫ్ యుద్ధంను పరిశీలించినట్లయితే అమెరికా తన ఏక చక్రాధి పత్యంను ఏ విధంగా ఉపయోగించుకొన్నదో తెలుస్తుంది.

ఇప్పుడు ఏకైక అగ్రరాజ్యమైన అమెరికా మధ్య ఆసియాలోను చిన్న చిన్న కమ్యూనిస్టు దేశాలను తన ఆర్థిక శక్తితో ఆట పట్టించుచున్నాయి. ముఖ్యంగా క్యూబా, లిబియా అధ్యక్షులను తన చేతుల్లోకి తీసుకొనడానికి ప్రయత్నించుతుంది. రష్యా 74 సంవత్సరాలు అగ్రరాజ్యంగా ఉన్నా, నిత్య సత్యం ఒక్కసారే బుగ్గ పాలైంది.

ఇట్లా ప్రస్తుంతం ఇండియా-రష్యా కామన్‌వెల్త్ సంబంధాలు తిరిగి నెలకొన వలసిన ఆవశ్యకతా ఎంతైనా ఉంది. ఏది ఏమైన రష్యా – ఇండియాకు సహ కారం ఇంత అంత అని చెప్పడానికి వీలులేదు. దానిని కొలవడానికి కొలతబద్ద లేదు. మరి నూతనంగా ఇండియా, సోవియట్ కామన్‌వెల్త్ దేశాలతో సత్సంబంధాలు నెలకొంటాయని ఆశిద్దాం.

# 19. ఇండియా-జపాన్ సంబంధాలు

నేడు ఆర్థిక,రాజకీయ పరిస్థితులలో ఇండియా జపాన్ సంబంధాలు ప్రాముఖ్యత ను సంతరించుకొన్నది. గతంలో ఇండియా-జపాన్ సంబంధాలు మామూలు స్థాయిలో ఉండెడివి. ముఖ్యంగా ఈ రెండు దేశాల సంబంధాలు కేవలం వాణిజ్యం-వ్యాపారంకు సంబంధించినవిగా ఉండేవి. కాని ప్రపంచ మారిన పరిస్థితుల దృష్ట్యా జపాన్-ఇండియా సంబంధాలు ప్రాధాన్యత ఉంది. 1990 లో రష్యా అగ్రరాజ్య ప్రతిపత్తిని కోల్పోయి, విచ్ఛిన్నమయిన దృష్ట్యా నేడు ఆసియా రాజకీయ ఆర్థిక స్థితిగతులలో జపాన్‌కు ప్రాధాన్యత పెరిగింది. ఇండియా కూడా రష్యా నుండి ఇదివరలోవలె ఆర్థిక సహాయం నైతిక మద్దత్తు లభించక పోవచ్చు కనుక దానితో ఇండియా తనకంటూ ఆర్థిక సహాయకుడ్ని చేకూర్చుకొంటుంది. దానితో జపాన్‌ను రష్యా స్థానంలో ఏర్పరచుకొని సంబంధాలు నెలకొల్పుటకు ప్రయత్నించి సఫలీకృతమయింది. ఇండో-జపాన్‌దేశాల మధ్య ఎట్లాంటి సంబంధాలున్నాయని చర్చించుదాం.

చారిత్రకంగా చూచినట్లయితే ఇండో-జపాన్ సంబంధాలు ఎప్పటినుంచో ఉన్నాయి. మధ్యకాలంలో ఇండియా తూర్పు దేశాలతో వాణిజ్య వ్యాపార సంబంధాలను కలిగి ఉండేది. ఇండియా రష్యాతో సంబంధాలు బాగా ఉండిన రోజుల్లో రష్యా-జపాన్ సంబంధాలు సరిగా లేవు. ఎప్పుడు రష్యా జపాన్‌లో దక్షిణ తూర్పు ఆసియాదేశాలలో తమ ఆధిపత్యం ఏర్పరచుటకు ప్రయత్నించేది. దానితో ఇండో-జపాన్ సంబంధాలు అంతగా ప్రచారం పొందలేదు. రెండవ ప్రపంచ యుద్ధంలో జపాన్, జర్మనీ, ఇటలీ మిత్ర కూటమి రాజ్యాలుగా ఏర్పడి బ్రిటిషు వారితో తలపడినాయి. అప్పుడు ఇండియా బ్రిటిషు వారి ఆధిపత్యంలో ఉండి జపాన్ వ్యతిరేకంగా రెండవ ప్రపంచ యుద్ధంలో పాల్గొంది. జపాన్ సింగపూర్, రంగూన్‌ల మీదుగా వచ్చి ఇండియాను ఆక్రమించుటకు 1943-44 లలో ప్రయత్నించింది. కలకత్తా, విశాఖ, కాకినాడ రేవులపై 1944 లో దాడులు జరిపాయి. దానిని బ్రిటిషు ఇండియా త్రిప్పికొట్టింది. 1945 యుద్ధంలో జపాన్ ఓడిపోవడం 1947 ఇండియా స్వాతంత్ర్యం సంపాదించడం జరిగింది. జపాన్ 1945 యుద్ధం షాక్ నుండి తేరు

కాని ఆర్థికంగా, రాజకీయంగా నిలద్రొక్కుకోవడానికి చాలకాలం పట్టింది. జపాన్ ఇండియాతో ప్రవేటు రంగంలో పెట్టుబడులు పెట్టడం మినహా రాజకీయంగా ఇండో-జపాన్ సంబంధాలు వృద్ధికావేదు. ఎందుకంటే జపాన్ అంతర్జాతీయ అలజడులకు పెట్టింవారి విధానానికి దూరంగా ఉంది. కేవలం వ్యాపార వాణిజ్య సంబంధాలపైననే దృష్టి నిలిపింది. దానితో జపాన్ నేడు అమెరికా తరువాత సాంకేతిక పరిజ్ఞానంలోకాని, ఉత్పత్తుల రంగంలోకాని ప్రపంచదేశాలలో ముందంజలో ఉంది. దీనికంతకు కారణం జపాన్ కుటుంబమే ఒక పారిశ్రామిక యూనిట్. అందరు పని చేస్తారు. ఆ పారిశ్రామిక స్థితిని పెంచుటకు ప్రతి వారి బాధ్యత ఎంచుతారు. వారు 1945 లో హిరోషిమా, నాగసాకి బాంబుదాడులను దృష్టిలో ఉంచుకొని ఉన్నత స్థితి కొరకు కృషిచేయడం జరుగుతుంది.

ఇండియా అంతర్జాతీయ రంగం హీరోషిమా సంఘటన పునరావృతం కాకుండ ఉండడానికి నిరాయుధీ కరణకు కృషి సల్పింది. జపాన్ ప్రాక్ పశ్చిమ ప్రాంతంలో దీటైన రాజ్యంగా కొనసాగుతుంది. గతంలో కూడ 1945 తరువాత తన ఆర్థిక శక్తితో ఆ ప్రాంత మార్కెట్లను తన గుప్పిట్లో ఉంచుకుంది. తూర్పు ఆసియా ప్రాంతంలో తైవాన్, వియత్నాం, మొదలైన దేశాలు జపాన్ యొక్క మార్కెట్ ఆధిపత్యంలో నున్నాయి.జపాన్-ఇండియా వ్యాపార వాణిజ్యాల నిమిత్త 1966 మార్చి ఢిల్లీలో సమావేశం జరిగింది. ఆ సమావేశంలో ఇండియా-జపాన్‌లు అణు ఆయుధాలు మీద పరిమితులు ఉంచడంపై రెండు ఏకగ్రీవంగా అంగీకరించాయి.

అప్పటి విదేశాంగ కార్యదర్శి శ్రీ సి.యస్. ఝా ఇండియా-జపాన్ భావాలు చాల వరకు దగ్గరగా ఉన్నాయి. కాని వియత్నాం సమస్యను పరిష్కరించడం ఆసియాలో శాంతి సమాధానం నెలకొల్పడంలో జపాన్ ముందుకు రావలన్నారు. జపాన్-చైనాలు తమ తమ ఆధిపత్యంకు ఆసియాలోను తూర్పు ఆసియాలోను ప్రయత్నం చేస్తున్నాయి కనుక ఆ సమయంలో అంటే 1960, 70 దశకంలో ఈ రెండు పోటీ పడినాయి. కాని 1980 దశకంలో చైనాదే ఈ ప్రాంతంలో పై చేయిగా వున్నా 1980 దశకం అర్ధ భాగం నుండి చైనా తన ప్రాధాన్యత తగ్గడం రష్యాలో అనేక పరిస్థితులు ఏర్పడడం ఆర్థిక; వ్యాపార, వాణిజ్యరంగాలలో జపాన్ ముందంజ వేసింది. అంతకు ముందు అమెరికా ఈ ప్రాంత రక్షణ కొరకు ANZUS ఒప్పందంను చేసుకొంది. అంటే అమెరికా, న్యూజిలాండ్, ఆస్ట్రేలి

యాలు రక్షణ ఒప్పందం చేసుకొని అమెరికా రక్షణలో కొనసాగాయి. కాని జపాన్ ఏ విధంగాను రాజకీయ వత్తిడికి లొంగకుండ ఆర్థిక వ్యాపార రంగాలలో ముందంజ వేసింది.

ఇండియాకు నిధులిస్తున్న దేశాలలో జపాన్ ఒకటి. 1989లో 1100 కోట్లు రూపాయలు ODA నిధులను యిచ్చింది. ఇందులో 85% విదేశీ మారక ద్రవ్య రూపేణా యిస్తుంది. 1979 లో అప్పులు 225 కోట్లు. అదే విధంగా ఆహారపు దిగుమతులు, ఎరువులు, వ్యవసాయరంగాల పెట్టుబడులకు జపాన్ 7వ ప్రణాళికలో సహాయం చేసింది జపాన్ ఇండియాలో కంప్యూటర్ ప్రోగ్రామ్ క్రింద ఎన్నో విధాలుగా సహాయం నందిస్తుంది.

1990 లో భారత రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకట్రామన్ రాజు సింహాసనాదీశుడైన సందర్భంగా జపాన్‌లో పర్యటించారు. ఇండియా-జపాన్‌ల మధ్య ద్వైపాక్షిక సంబంధాలు ఆర్థిక, సాంకేతిక శాస్త్రీయ రంగాలలో ఎక్కువగా ఉన్నాయి. ఇండియా-జపాన్‌లు ఆటోమొబైల్, కంప్యూటర్, ఎలక్ట్రికల్ రంగాలలోనేగాక వ్యవసాయం ముఖ్యంగా చేపల పెంపకంలో ఆత్యాధునిక పరికరాలను జపాన్ భారతదేశానికి అందిస్తుంది.

జపాన్ ఎయిర్ ఇండియా కన్సర్టోయం క్రింద 104, 826 మిలియన్ల ఎన్‌లు 1990 లో ఇచ్చింది. అంతేగాక 129 205 బిలియన్ల ఎన్‌లు ఇండియాలో పెట్టుబడులు పెట్టడానికి అంగీకరించింది.

## ప్రధాని పి.వి. నరసింహారావు జపాన్ సందర్శనం :

భారత ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు మొదటిసారిగా జపాన్ 1992 జూలై 2-3 తేదీలలో సందర్శించడం జరిగింది. గత సంవత్సరం జపాన్ పారిశ్రామిక వేత్తలు ఇండియాను సందర్శించి సరళీకృతం చేసిన మన పారిశ్రామిక విధానానికి, ఆర్థిక విధానానికి మరి సడలింపులు చేస్తే జపాన్ పెట్టుబడులు ఇంకా ఎక్కువగా వస్తాయి. కాని అసమంజసంగా ఉంటుంది.

జపాన్ చేస్తున్న ఆర్థిక సహాయం డబ్బు రూపేణ యివ్వరు. కేవలం వస్తువుల మార్పిడి జరుగుతుంది. సాంకేతిక పరిజ్ఞాన రూపంలో కూడా విదేశీ సహాయం

ఇస్తాయి. ఎందుకంటే జపాన్ తన హోం మార్కెట్లలో గిరాకీ పడిపోవడంతో విదేశీ మార్కెట్ల అన్వేషణలో ఉంది.

జపాన్ ఇస్తున్న రుణాలు వెనుక రాజకీయాలు కూడా ఉన్నాయి. ఎందుకంటే నేడు జపాన్, అమెరికాలే పారిశ్రామిక ఆర్థికంగా రంగాలో దాటి పోయింది. ఎందుకంటే జపాన్ టెక్నాలజీ, పెట్టుబడులు అంత తొందరగా విదేశాలకు పాకి పోతున్నాయి. ఈ పెట్టుబడులు ఇండియాలాంటి మూడవ ప్రపంచ దేశాలకు పెట్టి రాజకీయంగా గుర్తింపు పొందాలనే ఆ కాంక్ష.

భారత వాణిజ్య సంస్థలతో సంయుక్త సహకారంతో వాణిజ్యం సాగించాలని జపాన్ కోరిక. వాటికితగిన విధంగా రూల్స్‌ను సడలించాలంటుంది అట్లా జపాన్‌కు అనుగుణంగా రూల్స్ సరళం చేసినట్లయితే మన ఆర్థిక స్థితి కుంటుపడుతుంది.

శ్రీ నరసింహారావు పర్యటన ద్వారా ఆహార ఉత్పత్తులు పెంచడానికి 38 5 కోట్ల రూపాయల విలువైన ఎన్‌లను ఇవ్వడానికి జపాన్ అంగీకరించింది. బొంబాయి లోని లాల్ బహదూర్‌శాస్త్రి మెరిన్ ఇంజనీరింగ్ కళాశాలకు కావలసిన సెమ్యులేటర్లు జపాన్ సప్లై చేస్తుంది. అదే విధంగా రసాయినిక ఎరువులు పరిశ్రమలకు ఇచ్చిన పెట్టుబడులపై జపాన్‌వడ్డీ తగ్గించడానికి జపాన్ అంగీకరించింది.

ఈ విధంగా జపాన్‌తో చేసుకొన్న ఒప్పందాల మూలంగానే మనదేశానికి సోవియట్ రష్యా సహాయం చేస్తున్న వాటి స్థానే ఇపుడు జపాన్ మనకు సహాయం చేస్తుంది. కనుక ఏదోవిధంగా మన ఆర్థిక స్థితిని ద్వైపాక్షిక సంబంధాల ద్వారా పూడ్చుకో గలుగుతున్నాం.

# 20. భారత-అమెరికా సంబంధాలు

భారత అమెరికా సంబంధాలు నేటి ప్రపంచ రాజకీయ వ్యవస్థలో ప్రాముఖ్యతను కలిగి ఉన్నది. ఎందుకంటే నేటి ప్రజాస్వామ్య ప్రపంచంలో సుదీర్ఘ ప్రయాణం సాగించిన అమెరికా రెండవ ప్రపంచ యుద్ధానంతరం మనుగడ మొదలిడి 49 సంవత్సరాలు దిగ్విజయంగా ప్రజాస్వామ్యంను కొనసాగిస్తున్నవి. పెద్ద ప్రజాస్వామ్య వ్యవస్థలు ఈ రెండు దేశాలు అవడం అతిశయోక్తి కాదేమో! రెండూ ప్రజాస్వామ్యదేశాలే అయినా రెండింటిమధ్య ఎంతో తారతమ్యం కలదు. పెట్టుబడిదారి వ్యవస్థలకు నాయకత్వం వహించుచు ఉదార ఆర్థిక వ్యవస్థను కలిగి ఉంది అమెరికా. అయితే భారతదేశం మిశ్రమ ఆర్థిక వ్యవస్థనుకలిగి మూడవ ప్రపంచదేశాలలో అతిముఖ్యమైనదిగా ఉన్నది. ఈ రెండు దేశాలు ఒకటి అణు ఇంధనాన్ని ప్రపంచశక్తి రాజకీయాలకు ప్రతీకగా నడుస్తుంటే మరొకటి అణు ఇంధనం ప్రపంచశాంతి కొరకేనని నినాదంతో ప్రపంచశాంతి సౌభ్రాతృత్వం అభివృద్ధి అంటుంది. ఇలాంటి రెండు దేశాల మధ్య చారిత్రకంగా ఎలాంటి సంబంధాలున్నాయి. ఏ విధంగా భారత-అమెరికా సంబంధాలున్నాయి. ఈ రెండుదేశాలు ప్రస్తుత ప్రపంచ రాజకీయాలలో ఎలాంటి పాత్రను నిర్వహిస్తున్నాయి. వీటిమధ్య సమన్వయం ఏమైనా ఉందా మొదలైన అంశాలు చర్చించడం జరిగింది.

చారిత్రకంగా పరిశీలించినట్లయితే భారత-అమెరికా సంబంధాలు 1492లో కొలంబస్ ఇండియాకు మార్గంను కనుగొనుటకు మొట్ట మొదటిసారిగ ప్రయత్నించడంతో అమెరికాను కనుగొనుటతో మొదలయిందని చెప్పవచ్చు. కాని నార్మన్ బ్రౌన్ అమెరికా విప్లవంతోనే భారత-అమెరికా సంబంధాలు మొదలయినవి అంటారు. అంతకుముందు భారత-అమెరికాలు బ్రిటిషువారి భూభాగాలు. ఎప్పుడైతే అమెరికా స్వాతంత్ర్యంను 1776లో సంపాదించిందో అమెరికా-బ్రిటిషు ఇండియామధ్య వ్యాపారసంబంధాలు ప్రారంభమైనవి. 1794 జేస్ ఒప్పందంలో అమెరికాఒప్పందంతో వ్యాపారంను చేసుకొనుటకు బ్రిటిషువారు అనుమతినిచ్చారు. ఆనాటినుండి 19వ శతాబ్దంవరకు అమెరికా-భారత సంబంధాలు చైనా వ్యాపారంలో భాగంగా ఉండేవి. తదానంతరం అమెరికా వ్యాపారం తాతా ఇనుము ఉక్కు

కంపెనీతో వ్యాపారంలో సంబంధం పెట్టుకొన్నది. చాలాకాలంవరకు ఈ కర్మాగారం ఆసియాలోనే పెద్ద ఉక్కు కర్మాగారంగా ఉండేది. ఆ తరువాత అమెరికా కేథలిక్ మిషనరీలు భారతదేశంనకు వచ్చాయి. మిషనరీలరాకతో హాస్పిటల్స్,పాఠశాలలు,కాలేజీలు ఎన్నోస్వచ్ఛంద సంస్థలు అమెరికన్లచేతస్థాపించబడి భారతదేశం విద్యా సాంస్కృతి కరంగంలో అనేక విధాలుగా తోడ్పడ్డాయి. 1892 వరకు ఈ మిషనరీల స్వచ్ఛంద సంస్థలు 394 భారతదేశంలో వెలిశాయి. అవి 1903 నాటి 1,025 అయినాయి. 1922 నాటికి వాటిసంఖ్య 2,478 సంస్థలయ్యాయి. ఎప్పుడైతే 1905లో భారతదేశంలో స్వాతంత్ర్యోద్యమం తీవ్రస్థాయికి చేరింది ఆనాటినుండి ఆ స్వచ్ఛంద సంస్థలయొక్క కార్యక్రమము, సంఖ్యలో తగ్గుదల మొదలయింది. భారత స్వాతంత్ర్యనంతరం వాటి ప్రాధాన్యత బాగా తగ్గింది.

భారత-అమెరికా ఇండియా స్వాతంత్ర్యనంతరం స్వాతంత్ర్య సంబంధాలు ఏర్పడ్డాయి. అయినా భారతదేశానికి బ్రిటిషువారి కాలంలోనే బెంజిమిన్ జాయ్. అమెరికా కన్సల్‌గా కలకత్తాకు 1792లో వచ్చారు. కాని రెండవ ప్రపంచయుద్ధానంతరమే భారత-అమెరికాలమధ్య నిజమైన సంబంధాలు ఏర్పడ్డాయి. అమెరికా స్వాతంత్ర్య ప్రకటన భారతదేశంపై ఎక్కువ ప్రభావంను కలిగి ఉంది. అదే విధంగా అమెరికా రచయితలు ప్రభావంకూడ భారత్‌పై కలదు. ముఖ్యంగా వాల్ట్ వైట్‌మెన్, మార్క్ ట్వెయిన్‌లను పేర్కొనవచ్చును. ఇంకా అమెరికా పత్రికాకారుల రచనలుకూడ భారత్‌పై ఉన్నది. అందులో బెయర్డ్ టెలర్ రచన **A Visit to India China and Japan in the year of 1953.** కేథరిన్ మేయో రచించిన **Mother India-** రుడ్‌యార్డ్ కిప్లింగ్ రచించిన **KIM** అదే విధంగా భారతదేశంకు చెందిన గంగాదిన్ మహాత్మాగాంధీ కంటే ముందే అమెరికన్లకు తెలుసు. అదేవిధంగా భారతదేశం ప్రఖ్యాత తాత్వికులు స్వామి వివేకానంద, రవీంద్రనాథ్‌ఠాగూర్, లాలాలజపతిరాయ్, జయప్రకాశ్ నారాయణ్ అమెరికాను సందర్శించి భారతీయతను అమెరికా చాటారు. గాంధీ అసలు అమెరికానే సందర్శించలేదు. నెహ్రూ 1949 లో అమెరికాను సందర్శించారు. మొట్టమొదట 1899లో భారతీయ ప్రవాసులను అమెరికాలో స్థిర నివాసం ఏర్పరచుకొన్నారు. వారి సంఖ్య 1907లో 1,100 మాత్రమే. ప్రస్తుతం అనేకమంది భారతీయులు సుమారు 3,00,000 మంది అమెరికాలో స్థిర నివాసం ఏర్పరచుకొన్నారు.

భారత స్వాతంత్ర్యోద్యమములో అమెరికా అంతగా తోడ్పడలేదు కాని

కొంతమంది అమెరికన్లు భారతీయ స్వాతంత్ర్యోద్యమమునకు ప్రోత్సాహమిచ్చారు. 1921లో అమెరికన్ మతా బోధకుడు రెవరెండ్ జాన్ హేన్స్ హోల్స్ మహాత్మా గాంధీ అహింసా, సత్యం ప్రచారం స్వతంత్ర్యంను సమర్థించుతూ, గాంధీ నేటి ప్రపంచంలో గొప్పవ్యక్తి అనిపేర్కొన్నాడు.అదేవిధంగా 1914 భారతవిప్లవకారుల మొదటి సమావేశం స్టాకన్ కాలిఫోర్నియాలో జరుపుకున్నారు. స్వాతంత్ర్యోద్యమములో పోరాడిన గద్దర్‌పార్టీ కేంద్రం అమెరికాలో కాలిఫోర్నియాయే అమెరికా ఇండియన్ లీగ్ అధ్యక్షుడైన జెజెసింగ్ భారత స్వాతంత్ర్యమునకు మద్దతును, ప్రోత్సాహంను అందచేశారు రెండవ ప్రపంచయుద్ధ సమయంలో బ్రిటిషువారి మద్దతుగా బ్రిటిష్ భారత రక్షణకు అమెరికా సైన్యమును పంపారు. దానికి నాయకులు కల్నల్‌టాయిస్ జోన్స్‌ను అమెరికా అధ్యక్షుడు రూజువెల్ట్ నియమించారు. రూజువెల్ట్ భారత స్వాతంత్ర్యమునకు మద్దతు నిచ్చారు. 1946 బ్రిటిష ఇండియాలో నెహ్రూ నాయకత్వాన సంఘటిత ప్రభుత్వం ఏర్పరచినపుడు భారత ప్రతినిధిగా అసఫ్ అలీని మొదటి భారత రాయబారిగా అమెరికాలో నియమించారు.

గత నలబది సంవత్సరాలుగా భారత-అమెరికాలు వాటి పాత్రల కనుగుణంగా ప్రపంచ రాజకీయాలలో కొనసాగుతున్నాయి. అమెరికా ఖండాంతర ప్రయోజనం ఆశించి తన ఆర్థిక రాజకీయాల కనుగుణంగా విదేశాంగ విధానంను నడుపుచున్నది అమెరికా విదేశాంగ విధానంలో సైనిక మిత్రత్వంను ఏర్పరచుకొనడం, తన అమోఘమైన ఆర్థిక సంపదచే వివిధ రకాలైన మిత్రులను సంపాదించుకొన్నది. అమెరికా మూడవ ప్రపంచం నుండి విముఖతను ఎదుర్కొంటున్నా తన సైనిక తత్వంను కొనసాగించుచున్నది. కాని అమెరికా సైనిక, ఆర్థిక శక్తి భారత దేశంను ప్రభావితం చేయలేకపోయాయి.

భారతదేశం యొక్క జాతీయతా వాదం అమెరికా ఖండాంతర వాదంతో ఘర్షణ ఎదుర్కొనడం ఈ రెండు దేశాల మధ్య కొన్ని విభేదాలు ఏర్పడినాయి. స్వాతంత్ర్యనంతరం భారతదేశ విదేశాంగ విధానంకు ఆనాటి స్వాతంత్ర్యోద్యమం ఆదర్శాలే మార్గాలైనాయి. అవి క్లుప్తంగా సామ్రాజ్యవాద వలసవాద వ్యతిరేకత, జాతి వివక్షణకు, దోపిడి విధానంకు వ్యతిరేకత స్వతంత్ర విదేశాంగ విధానం, జాతి విముక్తోద్యమమునకు మద్దతు మొదలైనవి.

ఈ ఆదర్శాలే భారత - అమెరికా దేశాల మధ్య చాల బేధం వున్నది.

భారత దేశం జాతి విమోచన పోరాటం కొరకు పిలుపునిస్తే అమెరికా ఆ విముక్తి పోరాటాలను అణచివేచి తన స్వప్రయోజనాలకు వాడుకొనడం గత నలభై సంవత్సరాల నుండి భారతదేశం, అమెరికా యొక్క ఖండాంతర వాదంను వ్యతిరేకిస్తూ ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలకు మద్ధతునిస్తుంది. దక్షిణాఫ్రికా ఫండ్‌కు భారతదేశం చైర్మన్‌గా వ్యవహరించడం దీనికి ముఖ్యమైన ఉదాహరణగా పేర్కొనవచ్చును.

అందుచేత భారతదేశం Containment, ప్రచ్ఛన్న యుద్ధమును ఖండిస్తూ పంచశీల సిద్ధాంతములను ప్రభోదించే అమెరికా, రష్యా విస్తరణ విధానాలను ఖండిస్తూ, సైనిక రక్షణ ఒప్పందమును గూర్చి సమతుల్య శక్తిని గూర్చి ప్రచారం చేసింది.

1949 లో నెహ్రూ అమెరికాను సంచర్శించి భారతదేశ విధానంను నచ్చచెప్పి, ఆర్థిక సహాయమును ఆశించారు. కాని అమెరికా నెహ్రూ యొక్క ఆదర్శవాదనంను అనుమానించి ధన సహాయం చేసిన తన కట్టుడిలో ఉంటాడనిపించలేదు. అంతేకాక నెహ్రూ కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తాడని నమ్మకం కుదరలేదు. అదే కాలంలో నెహ్రూ చైనా విప్లవ విజయంనకు సానుభూతి చూపిస్తూ ప్రపంచ పెట్టుబడిదారి విధానం, వలసవాదంకు వ్యతిరేఖి ఆలోచించి సహాయం యివ్వకపోగా భారత్ వ్యతిరేకంగా 1950 లో అమెరికా-పాకిస్తాన్‌కు సైనిక సహాయాన్ని అందించి రక్షణ వ్యవస్థకు ముప్పు కలుగజేసింది. ఆ విధంగా నెహ్రూ యొక్క అమెరికా సందర్శనం ఎలాంట్ ఏ నిధులను యివ్వకపోగా వ్యతిరేకతకు గురయ్యింది. దీనితో ప్రచ్ఛన్న యుద్ధం యొక్క సెగలు/ఛాయలు భారత సమీపంకు చేరాయి. అప్పటి నుండి సమయాన్ని బట్టి తలయెత్తు తున్నది.

కొరియా యుద్ధ సమయంలో మొట్ట మొదటి సారిగా భారతదేశం ఐక్యరాజ్య సమితి చర్యను సమర్ధించింది.. ఆ తరువాత నెహ్రూ ఐక్యరాజ్య సమితి చర్య అమెరికాతో ముడిపడి వుందని అమెరికా, ఆసియా దేశాల అణచి వేయడానికి ప్రయత్నిస్తుందని నమ్మి చైనాకి మద్ధత్తునిచ్చి దగ్గర సంబంధాలు ఏర్పరుచుకొన్నాడు కాని ఆ నమ్మకమే వమ్ముచేసి 1961 లో చైనా భారత్‌పై దండయాత్ర చేసింది. దాని ఫలితం నేటికి మనపై వుంది. 1951 లో అమెరికా, జపాన్ ఒప్పందంలో అమెరికా, జపాన్‌ను పూర్తి స్వతంత్ర దేశంగా గుర్తించక పోవడాన్ని నెహ్రూ వ్యతిరేకించినాడు. అదే విధంగా అమెరికా-ఆసియా విధానంలో అంటే

దక్షిణ తూర్పు ఆసియా దేశాల రక్షణ వ్యవస్థ (SEATO) ఏర్పరచడం అమెరికా దక్షిణ వియత్నాంకు మద్దత్తునివ్వడం అనేక విషయాలను నెహ్రూ వ్యతిరేకత తెల్పాడు. అంటే మొదటి నుండి భారత-అమెరికా సంబంధాలు వ్యతిరేకతల మధ్య కొనసాగాయి. అమెరికా తనకు మిలటరీ (Arrime) ఒప్పందంకు ఎదిగింది. భారతదేశం తన జాతీయ సార్వభౌమాధికారంను అలీన విధానంతో పరిరక్షించు కొంటుంది. అప్పుడే నెహ్రూ యొక్క అలీన విధానంను భారతదేశం ఆసియా, ప్రపంచ రాజకీయాలలో కొనసాగించిన తీరును అమెరికా విమర్శించింది. 1950 లో అమెరికా విదేశీ విధానం నిర్ణయ కర్తలు భారతదేశ అలీన విధానంను 'అనైతిక మైనదని' గోడమీద పిల్లివాటం కలిగినదని పేర్కొన్నారు. ఆ విధంగ భారత - అమెరికాలు తత్సంబంధాలు గాని వారి అవగాహన, అంతర్జాతీయ అంశాలు తత్సంబంధాలు ఏర్పడలేదు.

భారతదేశం 1960 వ దశకంలో తన విదేశాంగ విధానం చాల గడ్డు పరిస్థితులను ఎదుర్కొంది. అంతేకాక అనేక రకాలైన వత్తుడులును అంతర్గతంగా, బహిర్గతంగాఎదుర్కొంది. ఈ దశకంలోనే అమెరికా ప్రభుత్వము ముగ్గురు ప్రధాన మంత్రులను జవహర్‌లాల్ నెహ్రూ, లాల్‌బహదూర్ శాస్త్రి, ఇందిరా గాంధీలను చూసింది. అదే సమయంలో కాశ్మీర్ సమస్యను పాకిస్తాన్ అంతర్జాతీయ ప్రచారం చేయడం, పాకిస్తాన్-అమెరికా ద్వారా పరిష్కారం చేయాలని, ఆ తరువాత చైనా మద్దత్తుతో పరిష్కరించుకోవాలనుకుంది. దానితో ఒకవైపు కాశ్మీరు సమస్య, మరో వైపు చైనా సరిహద్దు సమస్య. అలాంటి స్థితిలో చైనా-భారత్‌పై దండయాత్ర చేసింది.

ఆ సమయంలో భారతదేశం సైనిక ఆయత్తంలోలేదు. భారత ప్రభుత్వం అమెరికా మిలటరీ సహాయం అర్థించింది. అదే స్థితితో అమెరికా కాశ్మీర్ సమస్యను పాకిస్తాన్‌తో పరిష్కరించుకోవాలి షరతుపై మిలటరీ సహాయాన్నందించి భారత దేశం ఆ షాక్ నుండి తేరుకొన్నాక తన స్వతంత్రతను నిలబెట్టు కొనుటకు అమెరికా వత్తుడులకు లొంగకుండా స్వతంత్రంగా విధానంను ఏర్పరచుకుంది. కాని భారత ప్రధాని నెహ్రూ మరణించడం, నూతన ప్రధాని శాస్త్రి అంతర్గత సమస్యలతో వున్నప్పుడు పాకిస్తాన్ 1965 లో భారత్‌పై దండయాత్ర చేసింది. ఆ సమయంలో అమెరికా రెండింటిని సమంగా చూసిందని చెప్పవచ్చును. ఆ రెండు యుద్ధాలతో భారత ఆర్థిక వ్యవస్థ పూర్తిగా దెబ్బతింది.

**భారత్–అమెరికా ఆర్థిక సంబంధాలు :**

భారత-అమెరికా సంబంధాలు సరిగా లేకపోయిన భారత్‌కు అమెరికా తగిన ఆర్థిక సహాయం చేస్తూనే వుంది. 1950 భారతదేశం తీవ్ర ఆహార కొరత ఎదుర్కొనడం వలన నెహ్రూ అమెరికాను ఆహార పదార్థాల సహాయంను అర్థించాడు. అప్పటి అధ్యక్షుడు ట్రూమన్ కాంగ్రెస్ (అమెరికా శాసన సభలు) అనుమతితో ఆర్థిక సహాయం చేయదలచాడు కాని అమెరికన్ ప్రజలు అభిప్రాయం దానికి వ్యతిరేకించింది. ఎందుకంటే భారత తటస్థ విధానం వలన తమకు వరిగేది లేదని అన్నారు. దానితో నెహ్రూ తన దేశగౌరవాన్ని, స్వాతంత్రతను కొదువ పెట్టలేదు. రష్యాను ఆహార సహాయం అడిగితే అమెరికా యిస్తానన్న దానితో 1/80 వంతు సహాయం చేసింది. భారతదేశం కనుక తన మద్దతును అమెరికా విధానాలకు మలుపు యిచ్చినట్లే ఎంతో సహాయం ముట్టేది. ఇక్కడే భారతదేశ విధానంలో మలుపు (Filt) వచ్చింది. అంతేగాక రష్యా ఆదర్శాలు భారత విదేశాంగ విధానం ఆదర్శాలకు సామీప్యత ఉండుటచే విదేశాంగ విధానం తూర్పు దేశాలవైపు ఎక్కువగా మరలింది. ఆ తరువాత భారతదేశానికి ఆహార సప్లైని అందించింది. రష్యా యిచ్చిన దానికంటే 40 రెట్లు ఎక్కువేనని చెస్టర్‌బౌల్ అంబెసడర్ రిపోర్టులో పేర్కొన్నాడు. ఆ తరువాత రష్యా భారత్‌కు యిచ్చిన సహాయంపై ఎక్కువ రేటును వసూలు చేసింది

1960లో నెహ్రూ అమెరికా సందర్శించినపుడు ఒక బిలియన్ డాలర్లు బొకారో ఉక్కు కర్మాగార స్థాపనకు సహాయం చేయమని అడిగారు. అప్పటి అమెరికా అధ్యక్షుడు జాన్ ఎఫ్ కెనడీ భారత 4వ ఉక్కు కర్మాగారంకు యివ్వాలని మద్దతు నిచ్చాడు. కాని పాత విరోధం, భారత తటస్థస్థితి అమెరికాకు ఏ విధంగా లాభంలేదనే వాదంతో తిరస్కరించింది. అంతేకాక అమెరికా పెట్టుబడి అంత మొత్తం ప్రభుత్వ రంగంలో పెట్టుటవలన లాభం చాల తక్కువ అందు కని సహాయం చేయలేదు. కాని ప్రవేట్ రంగంలో అనేక విధాలుగా సహాయం చేసింది. అదే సమయంలో రష్యా 350 మిలియన్ డాలర్లు బొకారో ఉక్కు కర్మాగారంకు పెట్టుబడి పెట్టింది. 1965-67 భారత అనావృష్టి పరిస్థితులలో అమెరికా వ్యవసాయక వ్యాపారం, అభివృద్ధి సహాయం, 1954 చట్టం క్రింద భారత్‌కు ఆహార ధాన్యాలు సహాయం చేసింది. కాని భారతదేశం వియత్నాం యుద్ధంలో అమెరికా చర్యలను తీవ్రంగా ఖండించడంతో ఆనాటి అధ్యక్షుడు లిండన్-బి

జాన్సన్ ఆర్థిక సహాయాన్ని ఆపివేయడం గాక తిరిగి చెల్లించమని వత్తుడులు చేసాడు. అదే విధంగా 1965-76 కాలంలో భారత ఆర్థిక నిస్సాహాయత వలన అమెరికా వత్తిడులు తిరిగి ఆహార సహాయంను చెల్లించడంతో రూపాయ విలువను తగ్గించుకోవలసి వచ్చింది. అమెరికా వత్తుడుల వలన ఆర్థికంగా యిబ్బందులను ఎదుర్కొనవలసి వచ్చింది.

అయినా అమెరికా 1971 వరకు భారత దేశంకు సహాయం చాలాచేసింది. మొత్తం 607,422 కోట్లు యిచ్చింది. అదే సమయంకు రష్యా కేవలం 670 కోట్ల రూ॥ మాత్రమే యిచ్చింది అమెరికా సహాయం అంతా పరోక్ష అభి వృద్ధి కార్యక్రమాలైన రైల్వే, రోడ్లు, విద్య, విద్యుత్ కేంద్రాలు, వ్యవసాయాభి వృద్ధిలో పెట్టింది రష్యా అయితే బహిరంగంగా కనిపించే అంశాలలో ఇనుము ఉక్కు ఫ్యాక్టరీలు, నూనె కర్మాగారాలు ప్రభుత్వరంగాలలో పెట్టుబడి పెట్టింది. అంతేకాక అమెరికాచే నియంత్రణ చేయబడుతున్న సంస్థలైన IDA (అ॥ అ॥ నిధి) IMF (అవుస) ప్రపంచ బ్యాంకు నుండి అనేక రకాలైన ఋణాలును భారతదేశం పొందింది. పొందుతుంది. అదే విధంగా 1980 వ దశకంలో అమెరికా బహుముఖ సంస్థలు (**Multilateral hustitutions**) భారత దేశంను అంతర్జాతీయ వాణిజ్య బ్యాంకుల నుండి ద్వైపాక్షిక, బహుపక్షంగా ఆర్థిక సహాయంను పొంద వలసినదిగా వత్తుడులుచేస్తూనే వున్నది. అమెరికా వ్యతిరేకతవలన ఆసియా అభి వృద్ధి బ్యాంకు నుండి భారత దేశం సహాయంను పొందడానికి చాల కష్టపడింది. అమెరికా కొన్ని షరతులతో సాంకేతిక సహాయమును చేయుచున్నది. అమెరికా ప్రభుత్వం యిస్తున్న సాంకేతిక పరిజ్ఞానంను కొన్ని నియమిత సూత్రాలకు లోబడితే యిస్తున్నారు.

ఇంకా అమెరికా - భారతదేశం యొక్క పెద్ద వ్యాపార భాగస్థులలో ఒకటి. భారతదేశం - అమెరికాలు 1950-85 వరకు 7-50 పైగా సాంకేతిక ఒప్పందములు ఏర్పరచుకున్నాయి. అమెరికా ఎప్పుడు ఆర్థికంగా అభివృద్ధి సహాయంను స్వేచ్ఛా మార్కెట్లుపై ఆధార పడితే సహాయంను అందిస్తుంది. భారత దేశంకు ఎప్పుడు సహాయం చేసిన ఆర్థిక వ్యవస్థ బహిరంగం (**Open**) ఆర్థిక విధానాలను, స్వేచ్ఛ విధానంను అవలంభించి పశ్చిమ పారిశ్రామిక దేశాల నుండి దిగుమతులను అంగీకరించితేనే యిస్తుంది భారత్ ఆర్థిక విధానంకు అంగీక

రిస్తే సహాయం త్వరితంగా స్వేచ్ఛగా వస్తుంది. అమెరికా భారత దేశంయొక్క స్వయం సమృద్ధి పెట్టుబడి ఆర్థిక వ్యవస్థను ఏర్పరచుకొనుటకు ప్రయత్నిస్తుందని తెలిసి సహాయంను అందిస్తుంది.

**రాజకీయ సంబంధాలు :**

భారత దేశం - అమెరికాలు బంగ్లాదేశ్ సమస్యపై చాల వైరుధ్యమును ఎదుర్కొన్నాయి. ముఖ్యంగా అమెరికా హిందూమహా సముద్రమును సైనిక మండలంగా మార్చింది. పాకిస్తాన్‌లో పౌరయార్ధం ఫలితంగా ఇండియా మద్దతుతో తూర్పు పాకిస్తాన్ అంతరించింది పాకిస్తాన్ అమెరికా సైనిక ఒప్పందం దేశం కనుక దానికి పూర్తిగా మద్దతును తెలుపుతుంది. కాని భారత్ తన స్వతంత్రతను కాపాడుకొనుటకు ప్రయత్నిస్తున్నది. అమెరికా తన మధ్య ఆసియా, దక్షిణ ఆసియాలోని ప్రయోజనాలను ఆసించి అనేక భారతదేశ రక్షణకు పరోక్షంగా తోడ్పడుతుంది. అదే మద్దతుతో పాకిస్తాన్ అణుయుద్ధంనకు ప్రయత్నిస్తున్నది దాన్ని ఆపడానికి ప్రయత్నించాలి.

భారత ప్రధాని అమెరికా ఇటీవల సందర్శించినప్పుడు, అమెరికా సహాయంతో పాకిస్థాన్ అణుయింధన కార్యక్రమమును చేస్తుంది. దాన్ని ఆపవలసిందిగా కోరారు. రాజీవ్ గాంధీ అమెరికా సందర్శించి నప్పుడు జూన్ 14, 1985 భారత ఆశయాల్ని ఈ విధంగా పేర్కొన్నారు. ఇండియా సరిహద్దుల చుట్టూ పెరుగు తున్న సైనికీకరణ వలన భారత దేశం మీద ఎక్కువ భారం పడుతుంది. మేము ఎప్పుడు బయటి వారి ఒత్తుడులను, వారి ప్రవేశం వలన మా ప్రాంతం స్థిరత్వ ఏర్పడుటను వ్యతిరేకిస్తాం. భారత దేశం దక్షిణ ఆసియాలో ఉద్రిక్తతలను తగ్గించ దానికి, చుట్టు పక్కల దేశాలతో అనేక విధాలుగా చర్యలు తీసుకొంటుంది. కాని మా చర్యలు ఫలించాలంటే. పెద్ద దేశాలు వారి ప్రయోజనాలు కాపాడుకొనుటకు చర్యలు తగ్గించాలని కోరారు.

అంటే రాజీవ్ గాంధీ ఉద్దేశ్యం అమెరికా మిలిటరీ సహాయాన్ని పాకిస్తాన్‌కు ఇచ్చుట వలన భారత దేశం పై అధిక భారం పడుతుందన్నారు కాని దాన్ని పెడ చెవిన పెట్టారు. దాని ద్వారా భారత దేశం ఎన్ని సార్లు అమెరికాను అడిగి అదే విధానమును కొనసాగిస్తున్నది. భారత దేశం అమెరికా వ్యతిరేకతను అనేక సార్లు చూసింది చూస్తుంది. రాజీవ్ గాంధీ చేసిన విజ్ఞప్తిని అధ్యక్షుడు రీగన్

ప్రక్కన పెట్టారు. పాకిస్తాన్ అణుయింధన విధానం అమెరికా మిలటరీ సహాయం చేయుటలో ఏ విధమైన మార్పు కనిపించటం లేదు.

భారత-అమెరికాల మధ్య సంబంధాలలో ఆటంకపరచుచున్న అంశం ఖలీస్తాన్ తీవ్రవాదులకు అమెరికాలో ఆశ్రయ మిచ్చి వారికి మద్దత్తునివ్వడం రాజీవ్ గాంధీ అమెరికా సందర్శించినపుడు చర్చలలో అమెరికా ప్రభుత్వం భారత ప్రభుత్వంతో సహకరించడం హర్షింపదగినది. రాజీవ్ గాంధీ అమెరికాలో భారత ఉత్సవం (Festi11va1) ను ప్రారంభించటం. అది సంవత్సరం పాటు కొన సాగడం భారత సంస్కృతిని, ఆచారం, శాంతి కాముకతను అర్థం చేసు కొనుటకు అవకాశం కలిగింది.

భారత-అమెరికా సంబంధాలు అదే స్థాయిలో గత 40 సంవత్సరాలుగా కొనసాగుచున్నాయి. కాని అమెరికా విదేశాంగ విధానంలో భారతదేశం తక్కువ స్థాయిలో నైతే లేదు. భారతదేశం కనుక అమెరికా మిలటరీ ఒప్పందంలో అంగీక రిస్తే అనేక విధాలు ప్రయోజనం ఉంటుంది. భారతదేశం అంగీకరించదు. అంగీక రిస్తే అభివృద్ధి అనేక రకాలుగా ఉంటుంది భారతదేశం యొక్క ప్రాముఖ్యత దాని పరిధి, కీలక ప్రయోజనం, మిలటరీ, పారిశ్రామిక కాంప్లెక్స్‌లు అమెరికా మరువలేదు. భారతదేశంను ఎప్పుడు మానవ ప్రయోజన కారిగా చూస్తూనే తన ప్రయోజనంను నెరవేర్చుటకు అమెరికా తన విధానంను కొనసాగిస్తూనే ఉంటుంది. అంటే భారత-అమెరికా సంబంధాలు ఎప్పటిలాగానే ప్రయోజనాలను బట్టి కొన సాగుతాయి.

శ్రీమతి ఇందిరాగాంధీ మూడవ ప్రపంచ దేశాల ప్రతినిధిగా కాన్‌కూన్‌లో జరిగిన అభివృద్ధి చెందిన దేశాల సమావేశమునకు హాజరై మూడవ ప్రపంచ దేశా లను ఆదుకోవలసిన అవసరం అభివృద్ధి చెందిన దేశాలుకు ఎంతైన ఉంది. ఎందు కంటే నేటి ఈ దేశాలు ఒకనాడు మీచేత పరిపాలించబడినవె. కనుక ఇంకా 1% పెట్టుబడి పెట్టాలనే వాధించింది. కొన్ని వ్యాపార రాయితీలు కోరింది. ఆనాడు అమెరికా అధ్యక్షుడు రీగన్‌తో కలిసి పాకిస్తాన్-భారత మధ్య సంబంధాలను గూర్చి చర్చించింది. భారత సరిహద్దులను హిందూ మహాసముద్రంను శాంతి యుతంగా వుంచాలని కోరింది.

ఆ తరువాత రాజీవ్‌గాంధీ అధికారంలోకి వచ్చాక ఇండో అమెరికా సంబం

ధాలు బాగా మెరుగైనాయి. 1987 లో 'ఇండియా పెస్టికల్‌ను' అమెరికాలో నిర్వహించడం జరిగింది. అదే విధంగా ఇండియాకు ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ నుండి అప్పులు మంజూరు చేయుటకు దోహదపడింది. అంతేగాక ఇండియాలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంను పెంచడానికి అమెరికా ఎంతగానో సహాయం చేస్తుంది.

రీగన్ అధికారంలో వచ్చాక ఇండియా-అమెరికా సంబంధాలు కొంతవరకు మెరుగయినాయి. అయినా అమెరికా-పాకిస్తాన్‌కు యుద్ధసామాగ్రిని ఇస్తూనే ఉంది. దాంతో ఇండియా ఆ రక్షణను ఎదుర్కొంటుంది.

బుష్ పరిపాలనకి వచ్చాక అనేక మార్పులు జరిగాయి అగ్రరాజ్యాల మధ్య ప్రచ్ఛనయుద్ధం తగ్గుముకం పట్టడంతో ఇండియాకు పెట్టుబడులు ఇవ్వడం జరిగింది.

1987 లో ఇండియా రక్షణమంత్రి అమెరికా సందర్శించారు. అమెరికా రక్షణశాఖ కార్యదర్శి ఇండియా వచ్చారు. అప్పుడు ఇండియా చాల అధునాతనమైన సాంకేతిక పరిజ్ఞామును అందించుటకు అమెరికా అంగీకరించింది మొదటిగా వాతావరణ శాఖకు సూపర్ కంప్యూటర్‌ను అమెరికా సప్లై చేసింది.

1989 లో ఇండియా-అమెరికాల మధ్య $ 6 బిలియన్ల డాలర్ల వ్యాపారం జరిగింది. అంతకు ముందు సంవత్సరం $ 5.7 బిలియన్ల డాలర్ల వ్యాపారం కొనసాగించింది. అందునా ఇండియాకు తగిన వ్యాపార లాభాలు చేకూర్చాయి. అదే విధంగా ఇండియా–అమెరికా లిసులు అత్యంత వ్యాపార ప్రాతిపదికగా యివ్వడం జరిగింది. 1980 దశకంలో అమెరికా–ఇండియా సంబంధాలు ముఖ్యంగా విద్యా సంస్కృతిక రంగాలలో బాగా అభివృద్ధి చెందాయి. అయినా అమెరికా ఇరాక్‌తో మధ్య ఆసియాతో యుద్ధం చేయడంతో హిందు మహాసముద్ర ప్రాంతంలో ఇండియాకు అమెరికా దగ్గరయింది. 1990 లో చాలవరకు అమెరికా ఇండియాకు దగ్గరయింది. సోవియట్ పతనం, ప్రచ్ఛన యుద్ధం అంతరించడంతో ఇండియా–అమెరికా నుండి నిధులను పొందింది World Bank IMF ల నుండి అనేక విధాలుగా అప్పులను పొందింది.

ఏది ఏమైన అమెరికా ఏకైక అగ్రరాజ్యం అయ్యాక ఇండియా–అమెరికా సంబంధాలు బాగా పుంజుకొన్నాయి. రెండు అత్యంత పెద్ద ప్రజాస్వామ్య దేశాలు ఐక్యరాజ్య సమితిలో నిరాయుధీకరణము, మధ్య ఆసియాలో శాంతికొరకు ఇండియా అమెరికాలు కృషి చేస్తున్నవి. 1990 దశకంలోనే అమెరికా-ఇండియా మరింత పటిష్ఠంకు కృషిచేయవలసిన అవసరం ఉంది.

# 21. భారత - కెనడా సంబంధాలు

భారతదేశం-కెనడాలు చాల సారుప్యతములను కలిగి ఉన్నాయి. ముఖ్యంగా రెండవ ప్రపంచయుద్ధానంతరం స్వాతంత్ర్యం పొందిన దేశం ఇండియా అయితే కెనడా మొదటి నుండి బ్రిటిషువారి నాయకత్వం నుండి స్వాతంత్ర్యం పొందిన దేశం. రెండు దేశాలు బ్రిటిషు నాయకత్వం క్రింద మొగ్గిన దేశాలే. బ్రిటిషువారు లార్డు కారన్‌వాలెస్ నాయకత్వాన ఉత్తర అమెరికా ఖండంలో ఓడిపోయి తమ అధికారంను ఒదులు కొన్నా బ్రిటిషువారు అదేసమయంలో ఇండియాలో పరి పాలనా పద్ధతిని 1796 లో ప్రవేశపెట్టి తమ అధికారం సుస్థిరం చేసుకొన్నారు. 1867 లో బ్రిటిష ఉత్తర అమెరికా చట్టం ద్వార కెనడా స్వయం పరిపాలనాధి కారమును పొంది ఒక స్వాతంత్ర్య దేశంగా ఏర్పడింది. అయినా బ్రిటిషు రాజు వారసత్వ అధికారాలను కెనడాలో 1982 వరకు తాత్కాలిక అధికారాలను కలిగి ఉండేవాడు. 1982ఏప్రిల్‌లో కెనడాలో పార్లమెంట్ చట్టంద్వార సంపూర్ణస్వాతంత్ర్య మును పొంది బ్రిటిష ప్రభుత్వంలో నున్న లింకు త్రెంచుకొంది. ఈ విధంగా ఇండియా-కెనడాల మధ్య ఎన్నో సారుప్య స్వభావాలున్నాయి. కనుక ఇండియా-కెనడా దేశాల చారిత్రక సంబంధాలు, ఆర్థిక, రాజకీయ, వ్యాపార సంబంధాలను గూర్చి చర్చించడానికి చేసిన ప్రయత్నమే ఈ వ్యాసం యొక్క ఉద్దేశ్యము.

**ఇండియా-కెనడాల మధ్య సారుప్యత :**

ఇండియా-కెనడాలు చాల విషయాలలో దగ్గర సంబంధమును కలిగి యున్నాయి. ఇండియా కెనడాలు బ్రిటిషు ఆధిపత్యం క్రింద వలస ప్రాంత దేశాలే రెండు ప్రపంచ దేశాలలో శాంతి కాముక దేశాలుగా పేరుపొందాయి. అంతర్జాతీయ రాజకీయలలో మధ్యవర్తిత్వం ద్వారా ప్రపంచ దేశాల మధ్య సంభాషణలు చర్చలు జరిపి శాంతి-సమాజం ఏర్పరచుటకు పనిచేసిన, చేస్తున దేశాలుగా గుర్తింపు పొంది నాయి. ముఖ్యంగా మధ్య వర్తిత్వమును జరిపి అనేక అంతర్జాతీయ సమస్యల పరి ష్కారంకు కృషి చేసినందుకు కెనడా దేశపు విదేశాంగ మంత్రికి శ్రీ లెస్టర్ బి. పియర్సన్‌కు నోబెల్ శాంతి బహుమతిని కూడ ఇవ్వడం జరిగింది. ఇండియా

కూడ శాంతి, సమాధానం, అభివృద్ధి ప్రాతిపదికగా అలీన విధానమును చేపట్టి ప్రపంచ సమస్యల పరిష్కారంకు కృషి చేయుచున్నది.

ఇండియా-కెనడాలు కూడా ఒకే స్థితిని కలిగి ఉండుటవలన చాల వరకు ఒకే సమస్య కలిగియున్నాయి. రెండూ ప్రజాస్వామ్య దేశాలు. ఫెడరల్ వ్యవస్థ లను కలిగి ఉన్నాయి. ఇండియా 25 రాష్ట్రాలు కెనడా 12 రాష్ట్ర ప్రభుత్వా లున్నాయి. ప్రాంతీయతత్వం, భాషా సమస్య, టెర్రరిజమ్ స్వతంత్ర్య రాష్ట్రప్రతి పత్తి కావాలను ఉద్యమాలనుఎదుర్కొను చున్నది. ఈ రెండు దేశాలు ఫెడరల్ వ్యవస్థలు ఒకే లక్షణాలు కలిగి ఉన్నాయి. పటిష్టమైన కేంద్రం ఉండవలె వ్యవస్థలు కలిగి ఉన్నాయి. కెనడా రాజ్యాంగం నుండి ఫెడరల్ సూత్రాలు-ఆదేశా సూత్రా లను తీసుకొని అదే రూపంలో కొన్ని మార్పులతో భారత రాజ్యాంగం నందు చేర్చడం జరిగింది. ఈ విధంగా ఇండియా-కెనడాలు చాలవరకు సారుప్యతలను కలిగింది.

## ఇండియా-కెనడా సంబంధాలు :

ఇండియా-కెనడాలు బ్రిటిషు కామన్‌వెల్త్ సంఘంలో ముఖ్యమైన స్థాపక సభ్యులు. ఈ రెండు కామన్‌వెల్త్ దేశాల వ్యాపారం, ఐక్యతను తత్సంబంధాలను పెంచడానికి కృషిచేయుచున్నవి. దక్షిణ ఆఫ్రికా దేశంలో జాతి విచక్షణను తొల గించడానికి ఇండియా కెనడా సహాయం కోరింది. బ్రిటిషు ప్రభుత్వమును చాల అంశాలలో జాతి విచక్షణ విధానమును తొలగించడానికి ప్రయత్నం ఇండియా చేసి సఫలిత పొందింది.

## ఇండియా-కెనడా ఇంధన సంబంధం :

ఇండియా-కెనడా ఇంధనమును పొదుపు చేయుటకు అనేక ప్రాజెక్టులలో సహాయ సహకారాలనందించు కొంటున్నాయి. ఇండియా-కెనడాల మధ్య శౌర్య శక్తిని వృద్ధి చేయడానికి హిమచల్ ప్రదేశ్‌లో ఒక ప్రాజక్టును పరస్పర సహ కారం ద్వారా నిర్మించడానికి అంగీకరించాయి. ఇండియాకు కెనడా విద్యుచ్ఛక్తి వృద్ధి, గనులు, నౌకాకేంద్రాలు, వృద్ధి చేయుటకు, పౌరవిమానాయాన ప్రాజెక్టులు రైల్వే మొదలైన సహకారమును అందించున్నాయి.

ఇండియా-కెనడాల మధ్య పారిశ్రామిక సహకారం అనేది రెండింతలగా

అభివృద్ధి చెందింది. 1980 లో 40 పరస్పర సహకారం ప్రాజెక్టులుంటే అది 1990 లో 100 కంటే ఎక్కువగా ప్రాజెక్టులకు కెనడా ఇండియాకు సహకారంను అందించుచున్నారు.

కెనడా-ఇండియా ఎగుమతి దారులకు సహకారాన్ని అందించుచున్నది. ఇండియా ఉత్పత్తులను కెనడాలో మార్కెట్లుచూడడం కొరకు చేస్తున్నారు ఇండియా ట్రేడ్ పెయిర్ అధారటీ, కెనడా ట్రేడ్ పెసిలిటేషన్ అఫీసు రెండు దేశాలమధ్య వ్యాపారం వృద్ధవ్వడానికి కృషి చేస్తున్నాయి.

ఇండియా కెనడాల మధ్య వ్యాపారం 1980 లో $ 5 బిలియన్ల డాలరు. అది 1989 కి $ 18 బిలియన్ల డాలర్లకు పెరిగిందంటే ఈ రెండు దేశాల మధ్య ఎలాంటి సహాయ సహకారాలున్నాయో తెలుస్తుంది. అదే విధంగా రెండు దేశాల మధ్య 1950 లో వ్యాల్యూమ్ ఆఫ్ ట్రెడ్ $ 68 మిలియన్లు అదే 1990 కి $ 535 మిలియన్లయింది.

# 22. ఇండియా అణు విధానం-పాక్షిక అణ్వాయుధాల నిషేధ సంధి

నేటి ప్రపంచ రాజకీయాలలో ఇండియాకు బలమైన్న రాజ్య మద్దతు లేదు. ప్రచ్ఛన్న యుద్ధం అంతరించడం ఇండియా తన అణువిధానమును మార్చుకొన వలసిన అవసరం ఏర్పడింది. అంతే గాక నేడు మారిన ప్రపంచ రాజకీయాలు దృష్ట్యా, నిరాయుధీకరణ స్థితి గతులు పోటీ ప్రపంచం లేకపోవుట మొదలైన అంశాల దృష్ట్యాను, మరొక సారి ఇండియా అణు విధానంను దక్షిణాశియాలోను, ప్రపంచ వ్యాప్తంగా పరిశీలించవలసివుంది. ఇండియా అణ్వస్త్రాల సంధిపై సంతకం చేయాలనేదానిపై భిన్నాభిప్రాయాలున్నాయి.

## ఇండియా అణుఇంధన విధానం

ముందు ఇండియా అణు ఇంధన విధానంను పరిశీలించాల్సింది. 1948లోనే ఇండియా మొదటి ప్రధాని జవహార్ లాల్ నెహ్రూ నాయకత్వాన్న భారతదేశ అణు ఇంధనాభివృద్ధికి పునాది వేయబడింది. 1948లోనే అణు ఇంధన కమీషన్ ఏర్పాటుచేయబడింది.దానికి అధిపతిగా ప్రఖ్యాత భారత శాస్త్రవేత్త డాక్టరు హోమీ బాబాను చైర్మన్‌గా అటామిక్ ఎనర్జీ కమీషన్ ఏర్పాటు చేయబడింది. అనేక మంది కృషి ఫలితముగా 1968కి మూడు అణు ఇంధన కేంద్రాలు స్థాపించడం జరిగింది. ఇండియా 1947 నుండి కూడా తను అణుయింధనాన్ని శాంతి యుత సాధనకు తప్ప, విచ్ఛిన్నకర విధంగా ఉపయోగించనని పేర్కొంది. ఇండియా తన పారిశ్రామికాభివృద్ధి దృష్టిలో ఉంచుకొని అణుయింధనాన్ని అభివృద్ధి చేస్తుంది. కాని జూలై 1, 1968 లో అణుపాటవ పరీక్షా సంధిపై సంతకం చేయడానికి నిరాకరించింది. ఎందువలనంటే నాన్ ప్రోలిఫిరేషన్ ట్రీటి (NPT)లో నున్న సూత్రాలు అణ్వాయుధాలు కలిగివున్న దేశాలకు మాత్రమే ప్రయోజనం చేకూర్చే విధంగా వున్నాయని పేర్కొంది.

ఇండియా శాంతి ప్రయోజనాలని మాత్రమే 1974 మే 18న మొట్ట మొదటి అణు పరీక్షను రాజస్థాన్‌లోని పొ కారన్‌లో నిర్వహించింది. కాని అన్నిదేశాలు

ఇండియా శాంతి ప్రయోజనాలను శంఖించాయి ఇండియా అంతర్గత పారిశ్రామిక, వ్యవసాయ, వైద్య ఆరోగ్య రంగాలకే పరిమితి చేసింది. ఇతర దేశాలు ఊహించి నట్లు ఆయుధాల ఉత్పత్తికి కాని లేదా అంతర్జాతీయ పరిమితులకు వ్యతిరేకముగా తన అణుయింధన శక్తి వినియోగించుట లేదు. ఇండియా అణుయింధన రంగంలో కూడా స్వయం సమృద్ధిని సాధించి విదేశీ దిగుమతులను తగ్గించు కొని దేశంలోనే అణుఇంధనం ఉత్పత్తికి షెర్వీంటర్ తోరియం, ప్లూటో నియమాలను ఉపయోగించి తయారు చేయడానికి కృషి సల్పుతుంది. కాని ఇంకా ఆయా స్వయం ఉపాధి శక్తికి చేరుకోలేదు. ఎందు కంటే ఇండియాకు శాస్త్రీయ సిబ్బంది ఉన్న తగిన ఆర్థిక సహాయం విరివిగా లభించకపోవుట వలన స్వయం సమృద్ధి సాధనలో ఇంకా వెనుకబడే ఉంది.

దీనితో అంతర్జాతీయంగా ఇండియా అణుయింధన శక్తి కలిగిన దేశంగా ఉన్న తనకు లాభం చేకూర్చేదిగా లేదు. ఇంకా విదేశీయ సహాయంపైన ఆధారపడి మొత్తం కార్యక్రమం నిర్వహించబడుతుంది. ఇట్లాంటి స్థితిలో అంతర్జాతీయ అణుపాటవ పరీక్ష సంధిపై NPT సంతకాలు చేయమని ఒత్తిడి ప్రారంభమై అది ఎక్కువైంది.

## పాక్షిక అణ్వాయుధాల నిషేధ సంధి (NPT)

NPT ని 17 రాజ్యాల ఐక్యరాజ్య సమితి నిరాయుధీ కరణ కమిటీ సలహా మేరకు జూలై 1, 1968 చేయబడింది. ఇప్పటికి NPT మీద 141 దేశాలు సంతకం చేశాయి. NPT పాక్షికమయిన, మన సూత్రాలకు విరుద్ధమయినది.

ఇప్పటికే ఫ్రాన్సు, చైనాలు సంతకాలు చేయడానికి అంగీకరించాయి. ఇండియా సంతకాలు చేయవలసి ఉన్నది. కాని NPTపై సంతకం చేస్తే, అణు యింధనాన్ని ఉత్పత్తి చేస్తున్న దేశం అంతర్జాతీయ పర్యవేక్షణ క్రిందకు రావాలి. అంతే కాక మూడవ పార్టీని ఎవరినైనా వేసి అణుయింధనాన్ని ఏమైనా తప్పుడు ప్రయోజనాలకు ఉపయోగిస్తున్నారా? లేదా? వనే పర్యవేక్షణకు NPTపై సంతకం చేసిన సభ్య దేశం అంగీకరించాలి. అదే విధంగా అణుయింధనం లేనిదేశంపై దండెత్తడం దాడి చేయకూడదు.

దీన్ని అంగీకరించకుండా 20సంవత్సరాల నుండి ఇండియాNPTకి దూరంగా ఉంది. NPTపై సంతకం చేసిన దేశానికి మూడవ పార్టీచే అణుయింధన పర్యవేక్షణ జరుపరనే గ్యారంటీ కూడా లేదు. ఎందుకంటే ఇరాక్ అణు ఆయు ధాలను కలిగి ఉందని పెద్ద రాజ్యాలు వారి అణు ఆయుధాలను నాశనం చేయ

డానికి వెనుకాడలేదు. ఇరాక్ NPTపై సంతకం చేసిన దాన్ని ఏ విధమయిన మినహాయింపు యివ్వలేదు.

అణు ఆయుధాల వ్యతిరేక రక్షణలలో అనేక లొసుగులున్నాయి. ఇంకా దీనికి వ్యతిరేకంగా చెప్పాలంటే NPT సమాన పద్ధతిలో అణు ఆయుధాల నిరోధాన్ని అరికట్టలేకపోయినా కనీసం కొన్ని షరతులను కూడా విధించడంలేదు. అందుకనే 'ఎన్నో సమస్యలు అణు యింధనాన్ని కలిగివుంటే వస్తాయని అణు ఆయుధాలున్న రాజ్యాలు అణు యింధన సౌకర్యం కొరకు ప్రయత్నం చేయడం లేదు. అందున గతంలో జర్మన్ డెమోక్రటిక్ రిపబ్లిక్, కెనడా, స్వీడన్, ఆస్ట్రేలియాలు, స్విట్జర్లాండ్ ఇవి అణు ఆయుధాలు కలిగివున్న అణు యింధనం లేదు. దాని కొరకు ప్రయత్నించడంలేదు. అయినా ఇది NPTపై సంతకం చేయక ముందే అణు ఆయుధాలను కలిగి ఉన్నాయి. ఇపుడు NPT సంతకం చేయడానికి అణు యింధనంను బదిలి చేయడానికి లింకు ఉంటే ప్రస్తుతం సంతకాలు చేసిన దేశం యొక్క గౌరవ ప్రతిష్టలపై ఆధారపడి ఉంటుంది.

## అంతర్జాతీయ స్థితి

అణు యింధనం, అణు ఆయుధాలు కలిగిన అయిదు దేశాలు ఈ అణు యింధనం, ఆయుధాలు మిగతా దేశాలకు విస్తరించకుండ చూస్తున్నవి. జూలై 1991 లండన్ G 7 దేశాల సమావేశంలో ఇదివరకున్న అణు యింధన ఆయుధాల తగ్గింపుకు పిలుపునిచ్చాయి. భద్రత మండలిలో 5 శాశ్వత సభ్యులు సంప్రదాయక ఆయుధాలు కూడ మూడవ ప్రపంచ దేశాలకు అందించడాన్ని నియంత్రించాలని నిర్ణయం తీసుకొన్నాయి. పశ్చిమాసియా శాంతిలో భాగంగా ఆ ప్రాంతంలో ఆయుధాలను ఈ ప్రాంతంలో నియంత్రించాలంటారు. అదే విధంగా NPT వున్న ఇరాక్ ఎన్ని ఆయుధాలు సమకూర్చుకుందో అందుకే NPT ని తిరిగి సమర్థవంతమయినదిగా తీర్చిదిద్దాలంటారు.

ఈ దేశాలు అణు ఇంధన విధానం, ఆయుధాలను కలిగి ఉండటాన్ని తిరిగి పునః పరిశీలించాలని, పరిమితులు తిరిగి ఆయాదేశాలమీద విధించాలంటున్నాయి.

అదే అమెరికా-రష్యాలు అంతగా తమ ఆయుధాలను తగ్గించుకోవాలనే నిర్ణయంతో ఇండియా అణు ఇంధన దౌత్యంపై ఎక్కువ ప్రభావం పడుతుంది. 1992 జనవరిలో ఇండియా విదేశాంగ మంత్రి శ్రీ మాధవ్ సింగ్ సోలంకి అమెరికా సందర్శించినపుడు అమెరికా విదేశాంగ కార్యదర్శి జేమ్స్ బేకర్ పాక్షిక అణు పాటవ పరీక్ష నిషేధపు సంధిపై సంతకం చేయల్సిందిగా సలహా యిచ్చాడు. కాని ఇండియా సంప్రదాయకంగా తన నిర్ణయం అదెలా కొనసాగుతుందని చెప్పాడు. అంతేగాక NPT పక్షపాతంతో కూడినదని కూడా అన్నారు.

ఇక్కడ అంతర్జాతీయంగా మారుతున్న పరిస్థితుల దృష్ట్యా ఇండియా తన విధానంను పునఃపరిశీలించాల్సిన అవసరం వుంది. ఎందుకంటే ఇండియా అంతర్జాతీయంగా నిరాయుధీకరణను అమలు చేయడానికి ఎంతో ఉత్సాహంగా ఇది వరకు పాల్గొంది. కనుక నేడు- 1) ప్రస్తుతం ఏర్పడుతున్న నిరాయుధీకరణను గ్లోబల్ నిరాయుధీకరణగా, విచక్షణ వంతంగాను ఏ దేశంకు హాని లేనిదిగా విశ్వవ్యాప్తంగా అమలు చేయునదిగా ఉండేలా చూడాలి 2) అంతర్జాతీయంగా అణ్వస్త్రాల నిషేధంలో వచ్చిన మార్పుల దృష్ట్యాను 3) మన ఇరుగువారు అణు యింధనాన్ని కలిగి ఉంది అనే భావాన్ని రాకుండుటకు,దాని వ్యతిరేకతలు రాకుండుటకు మనం కృషి చేయాలి. 4) మన అణు ఇంధన విధానమును మన ప్రాంతీయ అవసరాలను దృష్టిలో నుంచుకొని కొన సాగించాల్పింది.

**అణు యింధన యుగం :**

ఇండియా అంతర్జాతీయ అణు ఇంధనపు సభలలో చాల చురుకుగా పాల్గొనెడిది. ఇటీవల కాలంలో రెండవ ప్రచ్ఛన్న యుద్ధపు ఛాయలు తీవ్రస్థాయిలో నున్నపుడు ఇండియా ఆరుదేశాల నిరాయుధీకరణ సమావేశమును 1986 ఢిల్లీలో ఏర్పరచి నిరాయుధీకరణ అన్ని దేశాలు విధిగా అమలు పరచవలసిన అవసరం ఉందని పేర్కొంది. ఇండియా రష్యా అధ్యక్షుడు గోర్బచెవ్‌లు కలిసి 1986లో అణు ఆయుధాలు లేని స్వేచ్ఛా ప్రపంచమును నెలకొల్పాలని పిలుపు నిచ్చాయి. అదే ఐక్యరాజ్య సమితి మూడవ నిరాయుధీకరణ సమావేశం 1988 లో ఇండియా ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ సమగ్రమైన కార్యనిర్వాహణ పథకం నిరాయుధీకరణను అమలు చేయడానికి, 2010 సంవత్సరానికల్లా అణు ఆయుధాలను పూర్తిగా తొలగించాలని పిలుపునిచ్చాయి. ఇట్లా ఇండియా అణుఆయుధాలను తగ్గించుట కొరకు, నిరాయుధీకరణను అమలు చేయడానికి చాల చురుకుగా పాల్గొని ప్రపంచ దేశాలలో నిరాయుధీకరణ కృషిచేసే ముఖ్యమైన దేశంగా పేర్కొంది. 1989 ఇండియాలో ప్రభుత్వాలు మారడం వలన దీన్ని గూర్చి అంతగా పట్టించు కొన్నవారు లేరు.

ఆ విధంగా ప్రపంచ వ్యాప్తంగా గ్లోబల్ నిరాయుధీకరణకు ఇండియా కృషి చేసింది. ఇప్పటికినీ ఇండియా ప్రపంచలో పూర్తిగా అణుఆయుధాలను తొలగించాలనే విధానాన్ని ప్రముఖ విధానంగా తన అణు ఆయుధ విధానమును కొనసాగిస్తున్నది.

వాస్తవంగా ఇండియా NPT ని పూర్తిగా పక్షపాతమయినదని అనుటయే కాకుండా, ఇండియా అణువిధానం వలన నష్టపోకుండా చూచుకుంటూ ఉండాలనేది వాదన.

ఇండియా NPTపై సంతకాలు చేయడం ఒక అణుఇంధన దేశం చేయాలి. దీనితో మొత్తం NPT నున్న సూత్రాలలో మార్పులు తీసుకొనిరావాలి. కాని అణుదేశాలు మార్పులను తేవడం కొన్నికష్టాలను ఎదుర్కొనవలసుంటుందంటాయి. దానికి ప్రత్యామ్నాయంగా ఇండియా అణుఇంధన దేశాలు ఏ వైతే ప్రతిపాదనలకు కట్టుబడి ఉన్నాయో వాటి కన్నింటికి కట్టుబడి ఉంటానని ప్రకటన చేయాలి. ఇందులో అణుయింధనాన్ని కలిగినదేశం అణుయింధనంలేని దేశానికి మార్చనని, సహాయపడననే సూత్రం ఉండాలి ఇండియా ఎప్పుడు ఇట్లా వ్యవహరించలేదు. కాని చైనాలాంటి దేశం యితర దేశాలకు యిస్తుంది. కాని ఇండియా ఇంతవరకు అలా చేయలేదు.

అందువలన ఇండియా అంతర్జాతీయంగా అణువిధానాన్ని ప్రకటించి. అన్ని నిరాయుధీకరణ సమావేశాల్లో పాల్గొని తన పాత్రను నిర్వహించాలి. ఇండియా NPT దగ్గరగా ప్రత్యేక హోదాతో పనిచేయాలి దీనితో ప్రస్తుతం కొనసాగుతున్న అణుయింధనపు తగ్గింపు డైలాగుల్లో ఇండియా చురుకుగా పాల్గొని ఇండియాయొక్క ఆశయమైన భయంలేని, అణుయింధన ప్రపంచమును ఏర్పడుటకు తనవంతు కర్తవ్యం నిర్వహించడానికి కృషి చేయవలసిన అవసరం ఏంతైనా ఉంది.

ఇండియా తన ఇరుగు దేశాల అణుయింధన పరిస్థితులను గూర్చి ఆలోచిస్తూ దక్షిణ ఆసియా అణుయింధన ఆయుధాలు లేనిగా చూడాలంటే ఆ స్థితి ఇండియాపై ఆధారపడి లేదు. ఎందుకంటే 1974 ఇండియా తన సొంత ప్రయోజనాలకు తప్ప వేరే స్థితికి తన అణుఇంధనాన్ని వినియోగించలేదు. కనుక మన అణుయింధన విధానమును చైనా, పాకిస్తాన్‌లు అనుసరిస్తున్న అణుయింధన విధానంపై ఆధారపడి ఉంటుంది. ఏది ఏమైన భారతదేశం అణుయింధనమును శాంతియుత పరిస్థితుల వరకే ఉపయోగపడుతుందే కాని తన ప్రయోజనాలకు అడ్డు ఏర్పడినపుడు మాత్రం అణచక అణు ఉపయోగాన్ని ఎట్టి పరిస్థితుల్లోను అంగీకరించబోదు.



× × ×